శ్రీమత్పరదేవతాయైనమః.

# గురుకటాక్షము.

(శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున భక్తిపూర్వకముగా సమర్పించినది).



స్నేహలతా కవితా సంఘము,

కొల్లాపురం,

శ్రీ జటప్రోలు సంస్థానం.

ప్రకటనకర్త,

ప్రెసిడెంటు,

వాజపేయయాజుల రామసుబ్బారాయుడు, బి.ఏ.

1933.

శ్రీగౌరీముద్రాక్షరశాల, నూజవీడు.

శ్రీమత్పరదేవతాయైనమః.

# గురుకట్నము.

చ. గురులఋణంబుఁ దీర్చుటకుఁ గోరి ప్రయత్నము సేయఁ బోయినన్
సరిపడ దెంతమాత్రమును జన్మశతాలకునైనఁ గాని, స
ద్గురులఋణంబు తీరునె? యకుంఠితభక్తి నమస్కృతుల్ నిరం
తరము నొసంగినన్ గలుగుఁ దథ్యము సర్వశుభంబు లెప్పుడున్. 1

సీ. పలుకష్టములతోఁ బొల్పడి కవిత్రయము వా
రెంతో కాంక్షను సృజియించినారు
నవరసంబుల నాంధ్రకవితా పితామహుం
డంచితరీతిఁ బోషించినాడు
క్రమముమైనగతి సలంకారముల్ సహజపాం
డిత్యుండు మేన నిండించినాడు
కనకంపుఁ బల్లకిన్ గవిసార్వభౌముండు
దేశదేశమ్ములఁ ద్రిప్పినాడు
గీ. అట్టి మనయాంధ్ర కవితాలతాంగి నేఁడు
భావనాతీతమైన శతావధాన
వైభవంబును గాంచి భాస్వత్ప్రదీప్తి
వెలయుచుండుటలెల్ల మీవలనఁ గాదె? 2

మ. సకలస్థానములన్ జరించియట మీసామర్థ్యమున్ జూపి, జం
కక యువ్వారికి సర్వదిగ్విజయమున్ గావించి పేరందినా
రు, కవుల్ చాల నిరంకుశోత్తములని యార్యుల్ పల్కుటల్ దెల్పి, యో
యకలంక ప్రతిభావిశేష నిధులారా! మీరు సామాన్యులే? 3

సీ. వాణీవిలాసిని రాణించి నిజజిహ్వ
నాటపట్టుగఁ జేసె ధాటిగాను
దశదిక్కులందు నిఖిలసత్కీర్తులు నిండ
దిగ్జైత్రసంపొంది తేజరిల్లె

# 2

సర్వాగమామ్నాయ సమధికసారంబు
కరతలామలకమై సరిలెనీకు
ఆసేతుహిమగిరి భాసురంబై నీవు
విమల విజ్ఞానంబు వెలసెభువిని

గీ. శతవిధశతావధానంబు సకలరాజ
రాజరాజన్య లోకంబులోజఁ బొగడ
నవరసాలంకృతంబుగాఁగవి కులంబు
మెచ్చఁగాఁ జేసినావు నిన్నెంచఁగలనె? 4

సీ. శ్రీసరస్వతినీకు చిన్నారి బొమ్మయై
చిలిపిప్రాయమునాఁడె చెలిమిగాంచె
శ్రీసరస్వతినిన్ను స్నేహంబు దనరార
కౌమారమున దేశ ఘనతఁగాంచె
శ్రీసరస్వతినీకుఁ జేదోడుగా యౌవ
నంబున నినుఁగూడి నాట్యమాడె
శ్రీసరస్వతినీకుఁ జెలువుగా ముదిమిని
పితృభక్తిఁ దగఁజూపి పేరువడసె

గీ. భద్రకల్యాణి నీవాణి భవ్యవాణి
మధురమంజుల గీర్వాణి మగ్నమయ్యె
నీదు వాక్సుధాలహరిలో నాదరమున
సకల కలలందు నెక్కుడు జాణగాన. 5

సీ. కనులు విప్పిననాఁడె కవితామతల్లిక
నవనవోద్భాసయై నవ్వఁజొచ్చె
వేళ్లువిప్పిననాఁడె విద్యావినోదిని
ధన్యాత్మయై తాను ధాత్రినిలచె
పలుకనేర్చిననాఁడె భవ్యకళాపధా
సప్రభావంబు మాన్యతనుఁగాంచె

సముగుఁ బెట్టిననాఁడె యఖిలకలావతం
సులకీర్తి సన్నమై సురుఁగనయ్యె

గీ. కవిజనాశ్రయ కారుణ్య కల్పవృక్ష!
వేదవేదాంత విజ్ఞాన విబుధగేయ!
సరస సారస్వత విజయ సదయ హృదయ!
చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి! చిత్స్వరూప! 6

సీ. అసమానులని సంస్కృతాంధ్ర భాషలయందు
బిరుదంబుఁ గైకొన్న వీరులెవరు?
రాజసంస్థాన మర్యాదలనువడసి
విఖ్యాతిఁ గనియట్టి విజ్ఞులెవరు?
గద్వాలమున్నగాఁగల రాజధానుల
సభలందు గెలిచిన జ్ఞానులెవరు?
పండితకవులకుఁ బరమమోదముఁ గూర్చ
విజయంబుఁ గాంచిన విజయులెవరు?

గీ. ధరణి తిరుపతి వేంకటేశ్వరులుగారె
యనుచుఁ బ్రజలెల్ల మిమ్మెప్డు వినుతిసేయ
శాశ్వతానంద సౌఖ్యమీ విశ్వమందుఁ
గాంచుచున్నారు జగదీశు కరుణఁజేసి. 7

సీ. సరసాశు కవితా విశారదులనుటకు
సలిపిన యవధాన చయమెసాక్షి
సరిలేని పాండిత్య సంపన్నులనుటకు
వ్రాసిన గ్రంథంపు ప్రతతిసాక్షి
ధర్మమార్గానువర్తనులనుటకు మీదు
శాశ్వతమగు పాఠశాలసాక్షి
సరిరారు మీకేరు జగతిలోననుటకు
సద్విరా! దిగ్జయయాత్రసాక్షి

గీ. అట్టి మీకీర్తి జగమంత నల్లుకొనఁగ
ఘనతఁ గాంచినయట్టి సత్కవులటంచుఁ
దిరిగి మేమిట బాపురే! తెల్పుటనఁగ
దినకరుని మ్రోల నిడునట్టి దివ్వె కాదె!

సీ. తిరిగి రెవ్వ రనేక దేశంబులను దమ
పాండిత్య విస్ఫూర్తి ప్రబలఁజేయ
కావించి రెవరు శతావధానము లెన్నొ
కవుల కెంతేని దిగ్భ్రమ జనింప
వ్రాసి రెవ్వరు సత్ప్రబంధము లెన్నొ ప్రా
క్కవుల శక్తిని మించి ఘనతఁ జూప
ననుభవించిరి వార లధిక భోగంబులఁ
బృథ్వీపతుల కెంతొ వెరపు గొలుప

గీ. నట్టి కవిసార్వభౌముల నట్టి శతవ
ధానధనుల నట్టి గుణవిజ్ఞానమణుల
నట్టి తిరుపతి వేంకటేశాఖ్యులఁ గవి
తా గురువుల, నుతింపఁగాఁ దరము గాదు. 9

క. శ్రవణానందము జదివిన
శ్రవణానందంబుఁ గల్గుఁ జతురత మీరున్
గవికోటులలో మీకో
కవికేసరులార! నాటికలరే ధరిత్రిన్. 10

గీ. భారతం బంత నాటక శక్తి నెంతొ
మృదుమధుర శైలిగా వ్రాసి ముదము గూర్చి
జనుల కుపకారమును జేసి వినుతిఁ గంటి
రిలను మీసాటి గలరె కవీంద్రులార! 11

మ. ధరణీశుల్ కడు మెచ్చి మ్రొక్కిలిడ విద్వన్మాన్యులగ్గించి య
బ్బురపాటొందఁ గవీంద్రపాళి ప్రమదస్ఫూర్తిన్ బ్రవర్తిల్ల, సు

స్థిరకీర్త్యస్తుతులన్ జగద్వలయ ముద్దీపింపఁగా వేంకటే
శ్వరశాస్త్రీ! కరినెక్కి నిక్కితివి నీసామర్థ్యమేలాటిదో? 12

మ. కలిలింపం బేము బ్రహ్మనంశమున విఖ్యాతుండవై పుట్టి, నే
ర్పలరారంగ శతావధాన నిపుణవ్యాపార పారీణతన్
గలవాఁ డంచును నీకుకావ్యకలనా కల్పంబులన్ ధాత్రిపై
వెలయన్ జేసిన పుణ్యమూర్తివిగదా! విజ్ఞాన చింతామణీ! 13

మ. ఒక చోమద్దులుమూటఁగట్టు నొక చో నోహో! యనన్ మించు, వే
ఱొక చో సొంపులునింపు మందు నొకచో నుద్వేగమున్ జూపునిం
కొక చోఁ బాశ్రిషగతిన్ హాయల్ గులుకఁగా నొయ్యారమున్
[జిల్కు ; జం
కకరాజిల్లునుగాదె! మీసుకవితా కంజాక్షిలీలాగతిన్. 14

ఉ. ఆరయ సర్వశాస్త్రములయందసమానులటన్న సాహితీ
ధోరణిఁగాంచి సర్వవిబుధుల్ గొనియాడ, కవిత్వవిద్యశా
ధారముమీరలన్నమడీ ధారుణినిల్చెను నేఁడు నిత్యశో
భారమణీయమై కవులభాగ్యము సెప్పఁగ శక్యమానొకో! 15

ఉ. మానిరికీర్తికీర్తులు సమస్తజగంబులఁ బ్రాకుచుండ, ప్ర
జ్ఞానిధులంచుఁ బేర్గొని రసజ్ఞులు మెచ్చఁ బ్రబంధరాజముల్
మానుగఁ గూర్చినార లసమాన కవిత్వపటుత్వ తత్త్వ సు
శ్రీనియమంబుఁ జాఁటి భళిరేయని సర్వజనుల్ నుతింపఁగన్. 16

చ. తిరుపతి వేంకటేశ్వర సుధీమణులిర్వురె సత్కవీంద్రులా
తిరుపతిశాస్త్రి లేని వెలితిన్ గననయ్యెను నేఁడు వేంకటే
శ్వరునకు షష్టిపూర్తియని చాఁటుమవార్తనొకింత విన్న సం
బరమును దుఃఖమున్ బెనఁగి పైకొనుటబ్రమో! పండితాళికిన్. 17

చ. అరునది యేమలావొ సగమాయువుదాఁటె నమోఘుమై ఖరిన్
దరమగుకీర్తిసిల్పెఁ బరదేశమునందు స్వదేశమునందు, భా

సురముగఁ బండితో త్తములు సూరిజనుల్ నినుఁబూజసేయఁగా
సరసులు వహ్వారేయనఁగ సర్వసమర్థుఁడవైతి ధారుణిన్. 18

చ. తిరుపతి వేంకటేశ కవిదిగ్గజరాజములెల్ల దేశముల్
తిరిగి శతావధానమున తేరుసమానులు వీరికంచు న
ల్లరుఁ దలలూఁపమెచ్చునటులన్ బొనరింపఁగఁ గాంచనట్టియా
కొఱతనుదీర్చుకొంట కొనగూడెను మాకిపుడీవిధమ్మునన్. 19

సీ. భారతియెందాక వ్యాసించియున్నదో
యందాక మీరాను రాజ్యంపుహద్దు
హారిణశాబకచిత్ర వర్గముద్రితంబగు
చంద్రబింబంబె మీరాజయపతాక
పండితుల్ లక్షణపారీణులును భవ
దీయరాజ్యంబునఁ దిరుగు ప్రజలు
పారితోషికముగాఁ బడయుధనంబె మీ
ప్రజనుండిగొనెడు కప్పంపుసొమ్ము

గీ. ధరను దిరుపతి వేంకటేశ్వరుల రాజు
నీడు రారన్న సత్కీర్తి నెసఁగునట్లు
ఈకవీశ్వరిలోకంబుఁ బ్రాకటముగ
నేలుఁడా చంద్రతారార్క మొనయునట్లు. 20

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రియైనమః.

# ప్రార్థన.

---

ఉ. సారములేని సంసరణ సంగతిఁ గాలముఁ బుచ్చఁబోక వి
స్తార కథా సుధా మధుర సారముఁ జిల్కెడు భారతంబులో
నేరితిఁ గొన్ని నీతులను నేర్పుదునట్లు జగద్ధితంబుగన్
నేరుపు చాలకున్న జననీ! నిరసింపకుమమ్మ శాంకరీ!

(వా. మహాలక్ష్మి.)

# ఆశయము.

ఉ. భారత మాదిగ్రంథమును భక్తి మెయిన్ బఠియించి కైతలో
ధోరణి కొంత గాంచి విబుధుల్ కడు మెచ్చెడు లీల శ్రద్ధతో
భారత నీతులన్ దగిన పద్ధతి నత్తి లిఖించు మత్సఖిన్
వారక ప్రోచుతన్ విజయ భాగ్యము లిచ్చి రమేశుఁ డెంతయున్.

శ్రీ. చేబ్రోలు సరస్వతీదేవి, (యం. ఇ.)
ఆంధ్రమూరాంగ్లపండిత,
వైస్-ప్రెసిడెంటు,
స్నేహలతా కవితా సంఘము.

శ్రీ కామేశ్వర్యైనమః.

# ఉపోద్ఘాతము.



భరతఖండ మాహాత్మ్యమునకు శ్రీమహాభారతము కల్ప ద్రుమము వంటిది. అష్టాదశ పురాణములలో నది యగ్రస్థానము నాక్రమించుచున్నది. అందువలననే "భారతః పంచమోవేద" యని శాశ్వత యశంబు నొందఁగలిగెను. సమగ్రముగా భారతమును బఠించిన సాధారణముగ నేగ్రంథమునైన మఱలఁ బఠింప నవసర ముండదు. ఇందుఁ బొందుపఱుపంబడని ధర్మములు లేవు. ఇతిహాసములు లేవు. ఉపాఖ్యానములు లేవు. సుధాసాగర చూడామణివలె నీగ్రంథము గంభీరమై పవిత్రమై యున్నది. ప్రపంచమునందలి యేభాషా సారస్వతమునందు నిట్టి యుత్తమ గ్రంథము లేదనిన నతిశయోక్తి కాదు. అణువు మొదలు బ్రహ్మము దాకఁ గల సమస్త పదార్థ తత్త్వములు నీగ్రంథము ప్రస్ఫుటముగాఁ జూపుచున్నది. నేమేల? యిది సకల పండిత పామర జనుల పాలిఁటి పారిజాతము.

భారతము నందలి కథలను విడదీసి కవులు ప్రత్యేక కావ్యములుగ వెలయించిరి. ఇందలి యితిహాసములను గొందఱు నాటకములుగ మార్చిరి. కొందఱిందలి పాత్రములఁ బ్రత్యేకముగఁ బోషించి గద్యగ్రంథములుగ వ్రాసిరి.

ఎన్నికథ లెన్ని యితిహాసములు చదివినను కడకు నేర్చుకొనిజ్ఞప్తి నిడవలసిన వందలి నీతులు. ప్రతికథలోఁ గొన్ని నీతు లిమిడియుండును. లోకములోనివారు ప్రపంచానుభవము పేర్మిఁ దమయంతకుఁ దామే నీతివిశేషములను గనుఁగొన వలెననినఁ గాలయాప

నిశాత ప్రతిభా వశమున నేర్చి కూర్చి మహానుభావులు గ్రంథములలో సోదాహరణముగ స్థాపించిన నీతులను జదివి తెలివిఁగాంచుట సులభము. ప్రతిమనుజుఁడును బారపడక, మెలకువ గలిగి యుండ నవకాశ మొదవుచున్నది. కావున జనోపయోగమునకై పూర్వ గ్రంథరాజములనుండి నీతిపద్యముల నేర్చి యొకచోఁ జేర్చుటయు నవసరకార్యమే యగుచున్నది. పాఠకులు శ్రమపడక చదివి గ్రహించి పద్యరూపమున నున్నందున లోకోక్తులవలె సులభముగ జ్ఞప్తి నుంచుకొనఁ గలరు.

శ్రీమతి వాజపేయయాజుల మహాలక్ష్మీదేవి "భారత నీతు"లను పేర మహాభారతమునందలి యుత్తమ నీతిపద్యములను దీసి యీ చిన్నిపొత్తమునందు ముద్రించి యున్నది. ఈమహాలక్ష్మి వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు. బి. ఏ., గారి యర్ధాంగలక్ష్మి. ఆంధ్రదేశమున నీయనగారిపే రెఱుఁగనివా రుండరు. ప్రొద్దుటూరికి వచ్చినప్పు డీదంపతులు మాకుఁ బరిచితులు. సుకవియైన భర్తృసాన్నిధ్య సాహాయ్యముల వశమున నీమె కవితా విషయముల శ్రద్ధ వహించి భాషాసేవ చేయ నెంచుట ప్రశంసార్హము.

అవకాశము లభించినప్పుడెల్లఁ గులసతులు కలము నారాధించి సారస్వత సేవకుఁ దొరకొనినపుడు దేశము కల్యాణ మండపము భాతిఁ బ్రకాశింపక పోదు. గ్రంథము చిన్నదైనను విలువయొడఁ బెద్దదియ.

బాలికా పాఠశాలలలో విద్యాధికారు లిట్టి గ్రంథములు నియోగించి ప్రారంభమునసే బాలికలకు నీతి నలవడఁ జేయుట శ్రేయోదాయకము.

పరమేశ్వరుఁడు శ్రీమహాలక్ష్మీదేవి కాయు రారోగ్య భాగ్యము లొసంగి కాపాడునుగాక. పద్యములు భారతమునందలి వగుటచే శైలీపరిదర్శనార్థ మిందుదాహరింపఁ బనిలేదని యింతటితో నుపరమించుచున్నారము.

ఇట్లు,

ప్రొద్దుటూరు,
1—3—33.

కవిసింహ అవధానిపంచానన,
రాజశేఖర వేంకట శేషకవులు,
శతావధానులు.

# అభిప్రాయము.



ఆంధ్ర వాఙ్మయమున పంచమవేద మనఁబరగు భారతము మూల్య రత్నతుల్యములగు నీతుల కాలవాలము. ఉద్గ్రంథములయం దిమిడియున్న రత్నముల నేరి పండిత పామరులకుఁ గరతలామలక మొనర్చుటలోఁ గల భాషాసేవ, నైతికోన్నతికై సంఘమునకిచ్చు చేయూత, యభిలషణీయము. అందును నైహికమే యాదర్శముగ గల నేటి విద్యావిధానమం దిట్టి రత్నసంచయమునకుఁగల ప్రాముఖ్య మపారము.

స్నేహలతా కవితాసంఘమున కధ్యక్షులు శ్రీయుతులు రాజ పేయయాజుల రామసుబ్బారాయఁడు, బి. ఏ., గారొనర్చుచున్న కృషి ప్రశంసాపాత్రము. భాషాసేవయందు వారికిఁ జేదోడు వాదోడు నగు వారిధర్మపత్ని శ్రీమతి, మహాలక్ష్మమ్మగారేర్చి కూర్చిన "భారత నీతు" లను శతక సంపుటి చక్కని నీతుల ఖని, విద్యార్థుల దృష్టి యిట్టి నీతివిషయముల నాకర్షించి వారి వ్యాప్తిపద్మముల సద్బీజములు నాటుటనాఁ డవశ్య కర్తవ్యము. ఆంధ్రలోక మీ సతీరత్నముయొక్క కృషికి సర్వదా కృతజ్ఞత చూపుఁగాత.

విద్వాన్ యస్. విశ్వనాథశాస్త్రి, యం. ఏ., గారు,

ఆంధ్ర గీర్వాణ ప్రధానోపన్యాసకులు,

నైజాం కాలేజీ, హైదరాబాద్.

శ్రీరాజరాజేశ్వర్యై నమః.

# భారతనీతులు.

[భారతమహిమ.]

క. బహుభాషల బహువిధముల
బహుజనముల వలన వినుచు భారత బద్ధ
స్పృహులగు వారికి నెప్పుడు
బహుయాగంబుల ఫలంబు పరమార్థ మగున్. 1

[జ్ఞానము.]

క. జ్ఞానంబు వడయుటకు వా
ఙ్మానసములు సునియతములు గావింతురు స
న్మానిత శాంతికొఱకు వి
జ్ఞానంబున నాత్మనియతి సల్పుదురు బుధుల్. 2

[పాడి.]

తే. పాడి గలిగిన నిహలోక ఫలము లెల్లఁ
జేరుటయు గాదు కీర్తియుఁ జెందు పురుషు
ధరణిఁ బొగడిత యొందాఁకఁ బరఁగు నంత
కాలమును బుణ్యలోకంబు గల్గు నండ్రు. 3

[ఓర్పు.]

క. అలిగిన నలుగక యొగ్గులు
పలికిన మఱి విననియట్లు ప్రతివచనంబుల్
వలుకక బన్నము వడి యెదఁ
దలఁపక యున్నతఁడ చూవె ధర్మజ్ఞుఁ డిలన్. 4

[సు తుఁ డు.]

క. తనయుండు దల్లిదండ్రులు
పనిచిన పని సేయఁడేని పలుకెదలోఁ జే
కొనఁడేని వాఁడు తనయుం
డనఁబడునే పిత్ర్య ధనమున కర్హుండగునే. 5

తే. తనయుఁ గని తల్లి దండ్రులు దమకు నతఁడు
భక్తుఁడగుటకు ధర్మానురక్తుఁ డగుట
కాసపడుదురు విను పుట్టి యాస సిద్ధిఁ
బొందఁ జేయునతఁడ చువ్వె నందనుండు. 6

[స త్య ము.]

చ. నుతజల పూరితంబులగు నూతులు నూటికంటె నూనృత
వ్రతి యొక బావి మేలు మఱిబావులు నూటికంటెనొక్క స
త్క్రతువది మేలు తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలు త
త్సుతశతకంబుకంటెనొక సూనృతవాక్యము మేలుసూడఁగన్.

క. వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్క సత్యమును నిరుగడలం
దుల నిడి తూఁపఁగ సత్యము
వలనన ములుసూపు గౌరవంబున పెర్మన్. 8

తే. సర్వ తీర్థాభిగమనంబు సర్వ వేద
సమధిగమము సత్యంబుతో సరియుఁ గావు
యెఱుఁగు మెల్లధర్మంబుల కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు. 9

క. సత్యమ తపమును యజ్ఞము
సత్యమ వేదంబు దాంతి శాంతులు నగుటన్

సత్యము దొఱఁగుట నిర్మల
నిత్యానుష్ఠానములును నిష్ఫలము లగుఁగా. 10

[భూదానము.]

క. దానము లన్నిటికిని భూ
దానం బెక్కుడు సమస్త ధాన్యములుఁ బ్రభూ
తానేక వస్త్ర ధన ర
త్నానూనత్వమును భూమి నవుట కతమునఁగా. 11

[ప్రజ్ఞ.]

క. ప్రజ్ఞయ ప్రతిష్ఠ లాభము
ప్రజ్ఞయ నాకం బనంగఁ బ్రజ్ఞయ చువ్వే
ప్రజ్ఞయ కైవల్యంబును
ప్రజ్ఞా సాధ్యములుగాని పనులుం గలవే. 12

[రాజు — ప్రజ.]

క. రాజునకుఁ బ్రజ శరీరము
రాజు ప్రజకు నాత్మ గాన రాజుం బ్రజయుఁగా
రాజోత్తమ యన్యోన్య వి
రాజితులై యుండవలయు రక్షార్చనలఁగా. 13

[అర్థము.]

క. అర్థ మనర్థ మూలం
బర్థమ మాయావిమోహ నాహవము నరుం
డర్థార్జన దుఃఖమునన
పార్థీకృత కర్ముఁడగుట పరమార్థ మిలఁగా. 14

[త ప ము.]

క. తప మనఁగ సకల విషయ
వ్యపేత మగునట్టి బుద్ధి వైభవము సుమీ
తపమున సుస్థిరుఁడగు యో
గపరునకుం గలవె యొండు కర్తవ్యంబుల్. 15

[భా ర్య.]

క. పాతివ్రత్యము గలిగిన
నాతియనఁగ దైవమని జనస్తుత వేత్తే
యాతత ధర్మార్థ సుఖ
ఖ్యాతులు సద్భార్యవలనఁ గాదే కలుగుఁ. 16

సీ. ధర్మార్థ కామ సాధన ముపకరణంబు
గృహనీతి విద్యకు గృహము విమల
చారిత్ర శిక్షకాచార్యకం బన్వయ స్థితికి
మూలంబు సద్గతికి నూఁత
గౌరవంబున కేకకారణం బున్నత
స్థిరగుణమణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ
చూవె భర్తకు నొండ్లుగావు ప్రియము
ఆ. లెట్టి ఘట్టములను నెట్టి యాపదలను
నెట్టి తీఱములను ముట్టఁబడిన
వంతలెల్లఁ బాయు నింతులఁ బ్రజలను
నొనరఁ జూడఁ గనిన జనుల కెందు. 17

క. సంతత గృహమేధి ఫల
బంతయుఁ బడయంగ నోవు ననుగుణ భార్యా

వంతుండగువాఁడు క్రియా
వంతుఁడు దాతుండు పుత్రవంతుండు నగుర్. 18

[సఖ్యము.]

చ. ధనపతితోఁ దరిద్రునకుఁ దత్త్వవిదుండగు వానితోడ మూ
ర్ఖునకుఁ బ్రశాంతుతోడఁ గడుఁగ్రూరునకున్ రణశూరుతోడ భీ
రునకు వరూధితోడన వరూథికి సజ్జనుతోడఁ గష్ట దు
ర్జనునకు నెవ్విధంబునను సఖ్యము దానొడఁగూడ నేర్చునే. 19

క. సమ శీల చరిత యుతులకు
సమ ధనవంతులకు సమ సుచారిత్రులకుం
దమలోఁ సఖ్యమును వివా
హము నగుఁగా కగునె రెండు నసమానులకున్. 20

[మూర్ఖుఁడు.]

క. మఱచినఁ దలపింపఁగ నగు
నెఱుఁగనినాఁ డెల్లపాట నెఱిఁగింప నగున్
మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని
కఱటిం దెలుపంగఁ గమల గర్భుని వశమే. 21

[వార్త.]

ఆ. వార్తయంద జగము వర్తిల్లుచున్నది
యదియు లేనినాఁడ యఖిల జనులు
నంధకారమగ్ను లగుదురు గావున
వార్త నిర్వహింప వలయుఁ బతికి. 22

[విద్య.]

తే. విద్య యిచ్చుట సత్పాత్ర విషయమైన
నవ్యయానంద పదముఁ జేయుంగఁ జాలుఁ

దగఁగ దక్షిణ యిచ్చి పేదలకు విద్య
యా నియోగించుటయుఁ దత్సమాన కృతియ. 23

[క్రోధము.]

క. క్రోధము తపముం జెఱుచును
గ్రోధము యణిమాదులైన గుణముల బాపుం
గ్రోధము ధర్మ క్రియలకు
బాధ యగుం గ్రోధిగాఁ దపస్వికిఁ జన్నే. 24

క. అనుపమ నియమాన్వితులై
యనూన దక్షిణలఁ గ్రతు సహస్రంబులు సే
సిన వారికంటె నక్రో
ధనుఁడ గరం బధికుఁ డండ్రు తత్త్వ విధిజ్ఞుల్. 25

[అన్నదానము.]

ఆ. అన్నదాన సదృశమగు దానమెందు నె
న్నఁడును లేదు గావునను విధేయు
మన్నదాన మధిక యత్న పూతంబుగాఁ
బూని దానిచేత పుణ్యతమము. 26

ఆ. అన్నమిడిన మణిమయావాస శయ్యాస
నములు నమృత భోజనంబు హృద్య
మాల్య లేపనములు మహనీయ మహిళాను
భవముఁ జిరత నొందు దివమునందు. 27

క. దానార్హ వస్తువులలో
మానిత మన్నంబ యన్నమయము లసువుల్
మేనుఁ దదీయ బలంబును
గావ బుధులుఁ దానిఁ దద గెకొండ్రు మఱిన్. 28

[మ హా పా త క ము లు.]

తే. కల్లు ద్రావుట గురుపత్ని గవయుటయును
విప్రుఁ జంపుట బ్రహ్మస్వ విషయమైన
ముచ్చిలుటయును నివిగల క్రూరజనులఁ
బ్రీతిఁ బొందుటయును మహాపాతకములు. 29

[కు ల ఘ్న లు.]

క. కుల నాశము సేసినఁ ద
త్కుల ధర్మము లడఁగు నష్టకుల ధర్మలకుం
గలుగును దుస్సంకర మ
క్కులఘ్నులేఁగుదురు నరక కూపంబులకున్. 30

[గృ హ స్థ ధ ర్మ ము.]

క. తక్కిన మూఁడాశ్రమములు
నొక్కదెస గృహస్థధర్మ మొకదెసఁ దులయం
దెక్కింప వానితో స
రియ్యొక్కటి సరిదూఁగ నందు రుర్వీశ బుధుల్. 31

[క న్యా దా న ము.]

క. కులమును శీలము విద్యయుఁ
గలవానిం బిలిచి ప్రీతిఁ గన్నియ నీఁగా
వలయు నుదకపూర్వదానా
కలితంబుగ బ్రాహ్మకర్మ గతియిది యధిపా. 32

[కీ ర్తి.]

ఉ. కీర్తియ యిచ్చుఁ బుణ్యగతిఁ గీర్తియ తల్లియుఁబోలెఁ బ్రోచు స
త్కీర్తియ యాయువుల్ సిరియుఁగీర్తివిహీనుఁడ చూశవంబు దు
ష్కీర్తను నెల్లచేటులను గిట్టి హరించు ననండె తొల్లి భ
క్తార్తి హరుండు నాఁబరగు నంబుజనాభి జగద్ధితంబుగన్. 33

పాదిల్లక తక్కువు పూ
ర్వోదయ కర్మమున నెట్టి యోగికి నయినన్. 45

[సంసారము.]

క. నలసారము సంసార మ
ఖల దుఃఖావహ ముభయ నికేతన మతిచం
చలము పరాధీనం బిం
దుల జీవన మేల నమ్మెదురు తత్త్వవిదుల్. 46

క. మఱిఁ దలపఁగ సంసారం
బతి చంచల మెండమావులట్టుల సంప
త్ప్రతతు లతిక్షణికంబులు
గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్. 47

క. కదియుం గ్రామముఁ గ్రామము
నదిలో మఱి కొంతసేపునకు బాయును నె
మ్మది నట్లుగఁ దలఁపఁగ వల
వదె పితృ పుత్రాది బంధువర్గము నధిపా. 48

[పురుషుఁడు - దైవము.]

క. విను పురుషుఁడు గావింపని
పనులకు దైవ మది యెట్లు ఫల మొనరించున్
జనములు గార్యము నడపఁగ
ననుకూలత నిచ్చుఁగాక యయ్యో ఫలముల్. 49

తే. పౌరుషమ్ము దైవంబు తోడ్పాటు లేక
ఫలముఁ బొందంగ నేరదు పార్థివేంద్ర
విత్తు సహకారి గాకున్న రిత్తనేల
వంధ్య మగుఁగాక తా ఫలవంత మగునె. 50

[బ్రహ్మహత్య.]

ఆ. పలు సదువులు సదివి పండితమానియై
తనదు విద్య నొరుల ఘనయశంబుఁ
దూలవుచ్చు నట్టి దుష్టాత్మకుని బ్రహ్మ
హత్య వొందు సందియంబు లేదు. 51

[శీలము.]

తే. సత్కులంబునఁ బుట్టుట సకల వేద
ములుఁ బురాణంబులును శాస్త్రములును జదువు
టయును సద్గతిఁ జేయఁ బ్రాభవములు గావు
శీలసామగ్రిలేని దుశ్చేష్టితునకు. 52

[కిల్బిషము.]

క. విను గురు పూజన విప్రా
ర్చనము లధిక పుణ్యములు ధరావల్లభ వి
ప్రుని నిందించుటయును న
గ్ని నివేదము విడుచుటయును గిల్బిషతమముల్. 53

[గంగ.]

క. మే నించుక సోఁకిన గం
గానదితోయములు జనుల కల్మష కోటిం
బోనడిచి పురందరలో
కానందముఁ బొందఁ జేయు నాగమవేదీ. 54

క. జనులకు నిందుఁడు గ్రహముల
కినుఁడును బితరులకు నోషధీశుఁడు పోలెన్
మనుజోత్తమ కడు నెక్కుడు
వినుము నదులకెల్ల జాహ్నవి మహత్త్వమునన్. 55

[అధ్రువములు.]

కం. క్షమలేని తపసి తపమును
బ్రమత్తు సంపదయు ధర్మబాహ్యప్రభు రా
జ్యము భిన్నకుంభమున తో
యములట్టుల యధ్రువంబులగు నిలయెల్లన్. 56

[అనృతము.]

ఆ. సభకు వచ్చి ధర్మసందేహ మడిగిన
నెఱిఁగి చెప్పకుండిరేని సభ్యు
లనృత దోష ఫలముసం దర్థమొందుదు
రనిరి ధర్మవేదులైన మునులు. 57

[క్షత్రియధర్మము.]

ఉ. శత్రుల నాజినోర్చుటయు సర్వధనంబులఁ బొందకుండఁగా
ధాత్రిఁబరిగ్రహించి యుచితస్థితిఁ గాచుటయుం బ్రియంబుతోఁ
బాత్రుల కర్థిఁ గోరికలు బ్రాహ్మణపూజయుఁ జాన్వె యుత్తమ
క్షత్రియధర్మముల్ సుగతికారణముల్ విపులార్థమూలముల్. 58

ఆ. పసులవలన బాధ వొరయకుండఁగ సాధు
జనుల ధనము గాచు జనవిభుండు
గరుణ దప్పి తాన హరియించు వాఁడగు
నేని సాధు లోక మేమి సేయు. 59

[ఉత్తముఁడు.]

తే. ఉత్తమజ్ఞాన వృద్ధునా నుండెనేని
బాలుఁ డయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు
క్షత్రియుఁడు పూజ్యుఁ డమిత విక్రమ సమృద్ధి
నుర్వీపతులలో నధికుఁడై యుండెనేని. 60

[ధనము.]

క. ఇచ్చునది ధనము పాత్రున
కిచ్చుగ నోరు వేఁడకుండునది యభిముఖులై
వచ్చిన యాశార్థుల వృథ
పుచ్చక చేయునది సర్వభూత ప్రీతిన్. 61

[విక్రమము.]

క. కులరూప గుణ ద్రవ్యం
బులు విక్రమ వంతునందు భూవిదితములై
నిలుచు నవిక్రమునకు నవి
గలిగియు లేని క్రియ నప్రకాశంబు లగున్. 62

చ. ఘనమగు విక్రమంబునన కాదె జగత్త్రితయంబుఁ బాకశా
సనుఁడుజయించె భూతలము సర్వముమున్ భరతుండువిక్రమం
బునజయించె విక్రమము భూరియశఃప్రియులైన రాజనం
దనులకు సర్వసాధనము ధర్మువు శత్రునిబర్హణంబులన్. 63

[క్రోధలోభములు.]

తే. పాపముల కెల్ల నెక్కుడు పాతకములు
సువ్వె క్రోధ లోభంబులు సువ్రతాత్మ
వాని రెంటి జయించిన వాఁడు గాని
యెందుఁ బరమ ధార్మికుఁ డని యెన్నఁబడఁడు. 64

[ఇంద్రియనిగ్రహము.]

చ. అరదము దేహమింద్రియము లశ్వములాత్ముఁడు సూతుఁడమ్మహో
తురగచయంబు ధైర్యమను తోరపుఁ బగ్గములన్ దృఢంబుగా
నురవడిఁ బోకయుండ వెరవొప్పఁగఁ బట్టిన వాఁడు సేమపుం
దెరువున నేఁగు నప్పరమధీరుఁడు సువ్వె యుదారఁ డెయ్యెడన్. 65

[ధర్మము.]

ఉ. ధర్మమ నల్పుచుం దగిలి ధర్మ పథంబునఁ జేసి యర్థముం
బేర్మియుఁ గాంచి ధర్మ విధిఁ బెండిలియై ప్రజలన్ సృజించి స
త్కర్మములం బవిత్రములుగాఁ గ్రతువుల్ దనరింప సజ్జనుల్
ధర్మజయిందునందునుముదంబునఁగాంతురభీష్టసౌఖ్యముల్. 66

తే. ఓపి ధర్మార్థ కామంబు లొకటి నొకటి
నాశ మొందింప కుండంగ నడపవలయుఁ
గాక ధర్మంబు సెడ నర్థ కామములను
గోరు పురుషుండు నిందకుఁ గుదురు గాదె. 67

ఆ. అర్థ సిద్ధికంటె నరయ నెక్కుడు ధర్మ
సిద్ధి దాన సకల సిద్ధులును బ్ర
శస్తభంగిఁ జేరు శాశ్వత కీర్తియు
సంభవించుఁ గలుగు సద్గతియును. 68

[ఉత్తమ జన్మము.]

ఉ. ఆపదఁ దూలపోక సిరినంది మదింపక శౌర్యవృత్తిమైఁ
బాపుల గెల్చి యార్జవము బంధు జనాలికి నార్యకోటికిం
జూపుచు దీనులం గరుణఁ జూచి తగంగలమాత్రఁ బ్రోచుచుం
గోపము లేక మన్కి గలుగున్ దివిజాంశమునన్ జనించినన్. 69

[వైరాగ్యము.]

ఆ. విడువు వలయు సకల విషయ వాంఛలయందు
విడువుఁ బోలు గుణము వెదకి యొందుఁ
గానరైరి బుధులు గలదె పరిత్యాగ
శీలునకు నసాధ్య సిద్ధియొందు. 70

[సప్తవ్యసనములు.]

తే. వెలది జూదంబు పానంబు వేఁట పలుకు
ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముఁగ వమ్ముసేఁత
యనెడు సప్త వ్యసనములఁ జనదు తగుల. 71

[కార్యసాధనము.]

తే. మాలకరి పుష్పముల గోయుమాడ్కిఁ దేటి
పుష్పఁదేనియఁ గొనియెడు పోల్కి నెదురు
గందకుండఁగఁ గొనునది కార్యఫలము
బొగ్గులకుఁ బోలె మొదలంటఁ బొడువఁజనదు. 72

[అసూయ.]

క. పరుల ధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడు న
న్నరుఁడు దెవులులేని వేదనంబడు నధిపా. 73

[యతి.]

క. దండము కాషాయంబును
ముండితయుఁ గమండలువును మోక్ష మొసఁగ వె
ట్లుండేని లింగములకు న
ఖండ జ్ఞాన ప్రదత్వ కలనము గలదే. 74

[తృప్తి.]

క. గతమునకును వగవక నా
గతమునకును నోరు దెఱచి కదుఁ గోరక దీ
నతఁ బొందక దైవం బే
గతిఁ బుచ్చిన దానఁ బోదుఁగా కనవలయున్. 75

[శత్రుత్రయము.]

క. తెగఁదీర్పక తగ నార్పక
తెగటార్పక కడమ కొంత దిక్కగనున్నన్
జగతీశ యప్పు నగ్నియుఁ
బగయును గడుఁ బెరుఁగుఁ గీడు వాటిల్లుఁ దుదిన్. 76

[దత్తాపహరణము.]

ఆ. పూర్వదత్తమైన భూమి నెవ్వఁడు పుచ్చి
కొనియె నతఁడు తనదు కులము వారి
నిరువదొక్క తరము నరక వాసులఁ జేయు
దాను సహముగాఁగ ధర్మ నిరత. 77

[పలుకు.]

చ. పలుకక యుండుకంటెఁ దగఁ బల్కుట మేలు వినుండు సత్యముం
బలుకుట ధర్మమార్గమునఁ బల్కుట సర్వజనప్రియంబుగాఁ
బలుకుట యొాలి నెక్కుడగు భంగులు వీని నెఱింగి యొండుమైఁ
బలుకక నాల్గుచందములఁ బల్కఁగ మెత్తురు వాని దేవతల్. 78

[దమము.]

క. తనువుం గడచిన సద్ధ
ర్మము లేదని విందు నాశ్రమముల కన్నిటికిన్
దమవంతుఁడు గామముఁ గ్రో
ధము లోభము మత్సరంబు దర్పము గెల్చున్. 79

[సుకృతము.]

ఆ. ఉత్సవంబు మీఁద నుత్సవ మందుచు
సుఖము మీఁద సుఖము సొప్పడంగఁ
బుణ్యపదము మీఁదఁ బుణ్యపదంబున
కరుగు నరుఁడు సుకృతియైన నధిప. 80

[స త్త్వ ము.]

తే. సర్వ సంకల్ప రహితుఁడై సత్త్వమునవి
నిశ్చలంబుగఁ జిత్తంబు నిలుప వలయు
సత్త్వ సక్త చిత్తంబు ప్రసాద మొసఁగు
దానఁ గాలంబు నడపు టుత్తమ విధంబు. 81

[గ ర్వ ము.]

క. నరనాథుఁ గొలిచి యులవడఁ
దిరిగితి నాకేమి యనుచుఁ దేఁకువ లేమిన్
మరియాద దప్పమెలఁగినఁ
బురుషార్థంబునకు హాని పుట్టక యున్నే. 82

[ధీ రుఁ డు.]

ఉ. ధీరుఁడు నిర్జితేంద్రియుఁడు దెల్లముగాఁ దనుఁగాంచు భూత వి
స్తార నిరూఢమైన పరతత్త్వముగాఁ దనయందు భూత వి
స్తారము నెల్లఁ గాంచు సతత స్ఫుట దర్శనుఁడై సమగ్ర చి
త్సారముఁ బొందినిర్మలతపంబులయందుఁజలింపకెన్నఁడున్. 83

[దు ర్మ తి.]

క. సతియును గుణవతియుఁ బ్రజా
వతియు ననువ్రతియు నైన వనిత నవజ్ఞా
న్వితదృష్టిఁ జూచు నతి దు
ర్మతి కిహముం బరముఁ గలదె మతిఁ బరికింపన్. 84

క. ధృతిసెడి వేఁడెడు వానిని
నతిథిని నభ్యాగతుని భయార్తుని శరణా
గతుఁ జంపఁగ నోడఁబడు దు
ర్మతి కిహముం బరముఁ గలదె మదిఁ బరికింపన్. 85

[కృతజ్ఞత.]

క. కృత మెఱుఁగుట పుణ్యము స
త్కృతిదానికి సమము సేఁత మధ్యము మఱి త
త్కృతమున కగ్గలముగ స
త్కృతి సేయుట యుత్తమంబు కృతబుద్ధులకున్. 86

[సత్సాంగత్యము.]

క. ఎఱుక గలవారి చరితలు
గఱచుచు సజ్జనుల గోష్ఠిఁ గదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగిన దానిని
మఱవ కనుష్ఠించునది సమంజస బుద్ధిన్. 87

[నిర్లక్ష్యము.]

క. తన కపకారము మును జే
సిన జనుఁ డల్పుఁడని నమ్మి చేకొని యుండం
జన దొక యించుక ముల్లును
వను బాద తలమున నున్న నడవఁగ నగునే. 88

[స్వస్థానము.]

క. కులపాంసను లై యహితం
బులె సేయుచు నుండుచుట్టములఁ బొందక యి
మ్ముల నుండువాఁడ పుణ్యుఁడు
వెలయఁగ గ్రామస్థితైక వృక్షముల పోలెన్. 89

[అన్యోన్యము.]

క. పరహిత ధనవంతులు సు
స్థిర మూలాన్వితులు పాపధీరతులు పర
స్పర సంశ్రయమున జీవిం
తురు మనుజులు వనములోని ద్రుమముల పోలెన్. 90

[ఉదాసీనుఁడు.]

తే. ఎఱుక గలఁడేని మఱి శక్తుఁడేని యన్యు
లన్యులకు హింస గావించు నపుడ దానిఁ
బూని వారింపకున్న నప్పురుషుఁ డేఁగు
హింస సేసిన వారల యేఁగు గతికి. 91

[వాక్పారుష్యము.]

క. భూరి గుణోన్నతు లనఁదగు
వారికి ధీరులకు ధరణి వల్లభులకు వా
క్పారుష్యము చన్నె మహా
దారుణ మది విషము కంటె దహనము కంటెన్. 92

[మద్యము.]

ఆ. మొదలి పెక్కు జన్మములఁ బుణ్య కర్మముల్
పరఁగఁ బెక్కు సేసి పడయఁ బడిన
యట్టి యెఱుక జనుల కాక్షణ మాత్రన
చెఱుచు మద్యసేవ సేయ నగునె. 93

[నిరాశ.]

క. దొరకొనినదానిఁ గోరక
దొరకొని నందును మమత్వ తుష్ట హృదయతం
బొరయక విగత స్పృహులగు
పురుషులు శుచు లేల తీర్థములు వారలకున్. 94

[మాతృపితృగురుభక్తి.]

క. జననీ జనక గురులయెడ
నొనరించిన మేలుఁ గీడు నొదవించు సుఖం
బునకును దుఃఖమునకు నిం
తని కొలఁది యెఱుఁగ వశంబె యజునకు నైనన్. 95

క. మాతృ పితృ గురులు దక్కఁగ
నే తెరువునఁ బాప మొలసె నేనియు దానిం
బాతురు ప్రాయశ్చిత్త
స్థితులు దద్విషయమైనఁ జెడ దల్పములన్. 96

[దానము.]

ఉ. భూసుర కోటికిన్ వినయ పూర్వకముగా ధనధాన్య గోమణి
క్ష్మా సలిలాన్న ముఖ్యములు సమ్మతి నీగి సుయజ్ఞ మానవో
ద్భాసితసత్క్రియల్ నడపుభవ్యుఁడు యజ్ఞములుం దపంబులుం
జేసినపుణ్యముంబడయుఁ జేయుము దానములోపి నిత్యమున్. 97

[కులధర్మము.]

క. తన కులధర్మము విడువక
మనుట పరమ ధర్మ మండ్రు మాన్యులు చిత్తం
బునఁ గృపఁ గలుగుట ముఖ్యపుఁ
బని సైరణ వలయు నఖిల భావము లందున్. 98

[దైవము.]

ఆ. మణిమయములుఁ గనక మయములు రజత మ
యములు మఱియు మృణ్మయాదికములు
నైన పెక్కు పూసలందుఁ దారమున్నట్లు
భూతకోటియందుఁ బురుషుఁ డుండు. 99

[ఫలశ్రుతి.]

ఉ. భారత మర్థితో వినిన భక్తిఁ బఠించిన శ్రీయు నాయువున్
భూరి యశంబునుం బ్రమదమున్ దృఢవిద్యయుఁ గల్గు వారికే
కోరికలైన వేగ మొనఁగూడు సుపుత్రునిఁగాంచు సద్వరున్
గారవమొప్పఁగాఁబడయుఁ గర్భిణి యున్ వరుసన్ గుమారియున్.

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

సమాప్తము.

శ్రీ.

# టిప్పణి.

1 బద్ధ = కట్టఁబడిన ; స్పృహులు = కోరికగలవారు ; పరమా ర్థము = మోక్షకారణము.

2 సునియతములు = నిశ్చలములు.

4 బన్నము = అవమానము.

7 సూనృతవాక్యము = నిజమగుమాట.

9 సమధిగమము = వేదసమధిగమము (చదువుట).

10 అనుష్ఠానము = నిత్యకర్మ (సంధ్యావందనాదులు)

11 అనూనత్వము = తక్కువకాకుండుట.

14 అర్థార్జన దుఃఖమున పాఠీకృతకర్ముఁడగుట = ధనార్జనకై నట్టి క్రియలు చేయకుండుట మంచిది.

15 వ్యపేతము = తొలఁగినది.

17 ఉపకరణము = సాధనము.

19 తత్త్వవిదుండు = సత్యమును తెలిసినవాఁడు ; ప్రశాంతుఁడు= శాంతముగలవాఁడు ; వరూధి = సేనగలవాఁడు.

21 కటితి = మూర్ఖుఁడు.

24 అణిమ = సూక్ష్మరూపము ధరించు శక్తి.

27 మాల్యలేపనములు = పూలదండలు, చందనము.

29 బ్రహ్మస్వము = బ్రాహ్మణధనము ; ముచ్చిలుట = దొంగి లించుట.

30 కులఘ్నులు = కులము చెడిపినవారు.

34 ఏనుగడ (ఏడు+కడ) రక్షకుఁడు. (గురువు, తల్లి, తండ్రి, పతి, దాత, విద్య, దైవము.) ఇట్లేడువిధముల రక్షించువాఁడు.

36 పతిగడవంగ = పతికన్న హెచ్చు.

38 పక్కంబు = తోడు.

39 విశిష్టము = సదాచారము ; నెట్టన = తప్పక.

43 ఐహికము = ఇహలోకసంబంధమైనది ; ఆవిర్భూత = పుట్టిన.

44 నాస్తిక్యము = పరలోకము లేదనెడు బుద్ధి.

45 ద్వంద్వములు = రెండు. (సుఖదుఃఖములు, కలిమిలేములు) మొదలగు జంటపదములు.

46 నికేతనము = ఇల్లు.

50 వంధ్య = ఫలింపనిది.

54 పురందరలోకము = ఇంద్రలోకము.

55 ఇనుఁడు = సూర్యుఁడు ; ఓషధీశుఁడు=చంద్రుఁడు ; జాహ్నవి= గంగ.

56 క్షమ = ఓర్పు ; తోయము = నీరు.

58 ఓర్చుట = ఓడించుట.

61 అభిముఖులై వచ్చిన = తమంత వచ్చిన.

63 శత్రుని బర్హణము = పగవారిఁ జంపుట.

65 అరదము = తేరు ; సూతుఁడు= తేరుగడపువాఁడు ; ఉరవడి = అతివేగము. (ఉరవు+వడి).

67 నిందకుఁ గుదురుగాడై = నిందకు పాత్రుఁడగును.

69 ఆపదఁ దూలపోక = ఆపదయందు ధైర్యము వీడక ; మసి= వసించుట.

71 సొమ్ము నిష్ప్రయోజనముగవచ్చునేఁత=సొమ్ము వృథావ్యయము చేయుట.

72 మాలకరి = పూలదండలు గుచ్చువాఁడు ; తేఁటి= తేనెటీఁగ ; కందకుండఁగ = తపింపకుండ.

73 ఎరియఁగ = పరితపించఁగ.

74 ముండితయు = తల బోడియైయుండుట.

75 ఆగతమునకు = రాబోవుదానికి.

76 దిక్కఁగనున్నఁ = మిగిలియున్న యెడల.

78 ఓలి = క్రమముగ.

79 దమవంతుఁడు = ఇంద్రియనిగ్రహముఁ గలవాఁడు.

80 సొప్పడు = సరిపడు.

81 రహితుఁడు = లేనివాఁడు.

82 తేఁకువ = భయము ; పురుషార్థము = పురుషప్రయోజనము. (ఇవినాలుఁగు ధర్మము, అర్థము, కామము, మోక్షము).

83 నిరూఢమైన = సుప్రసిద్ధమైన ; సమగ్ర = సంపూర్ణమైన ; చిత్పారము = జ్ఞానముయొక్క అంతము.

84 ప్రజావతి = సంతానముకలది ; అవజ్ఞాన్విత=తిరస్కారముతోఁ కూడిన.

85 ధృతి = ధైర్యము ; అతిథి = విందునకు వచ్చినవాఁడు ; అభ్యాగతుఁడు = భోజనసమయమున వచ్చిన అతిథి.

87 కఱచుచు = అభ్యసించుచు ; సమంజసము = న్యాయము.

89 కులపాంసనులై = కులదూషకులై ; ఇమ్ము = గృహము, స్థానము ; గ్రామస్థితైకవృక్షము = గ్రామములోనున్న చెట్టు.

90 సంశ్రయమున = ఆశ్రయమున ; ద్రుమము = చెట్టు.

91 ఎఱుకఁ గలఁడేని = ఎఱిఁగినవాఁడైనచో.

92 వాక్పారుష్యము = పరుసపుమాటలు.

93 ఎఱుక = జ్ఞానము.

94 దొరకొననిదాని = దొరకనిదానిని ; మమత్వతుష్టహృదయుతం బొరయక = హృదయమునందు మమకారమును పొందక ; విగతస్పృహులు = కోరికలేనివారు.

96 ప్రాయశ్చిత్తస్థితులు=శాస్త్రమునందు చెప్పినట్లు పాపపరిహారార్థము చేసెడు కర్మగలవారు.

97 క్ష్మా=భూమి; ఈగి = ఇచ్చుట; భవ్యుఁడు = యోగ్యుఁడు.

98 మనుట = వర్తించుట; సైరణ = సహనము.

99 మృణ్మయము = మన్నుతోఁ జేసినది.

100 అర్థితో = కోరికతో; ఒనఁగూడు = సిద్ధించును.

## తప్పొప్పుల పట్టిక.

| పద్యము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 14 | నాహావము | నావహాము |
| 18 | దాతుండు | దాంతుండు |
| 35 | మనవు | మనువు |
| 36 | ధనదాన్య | ధనధాన్య |
| 79 | తమము | దమము |
| 94 | దొరకొనిన | దొరకొనని |
| 97 | పూర్వకముగా | పూర్వముగా |

శ్రీమత్పరదేవతాయైనమః.

# పోతన్న భక్తివైరాగ్యములు.


శ్రీమతి, వాజపేయయాజుల మహాలక్ష్మి,

స్నేహలతా కవితాసంఘము,

కొల్లాపురం.

(కర్నూలుజిల్లా.)





పెంటపాడు,

శ్రీవైష్ణవ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1933.




[వెల రు 0-2-0 లు.

# తొలి పలుకు.



సోదర సోదరీ మణులారా !

ఈ ప్రపంచమున మానవ జన్మ మత్యుత్తమంబు. అందు సదమలవిజ్ఞానము గలిగిన బహుజన్మ సుకృత తపఃఫల భాగ్యవిశేష మని చెప్పక తప్పదు. ఇట్టి విజ్ఞానసంపన్నులగు మానవులు నీటిబుగ్గలవలె మాయమగు నాయుఃపరిమాణంబును, సౌదామినీ లతికవలె క్షణములో మార్పుఁజెందు భోగభాగ్యములకును గట్టువడి, సంసార చక్రింబులో దిరుగుచు దారియుఁ దెన్నును గానక వృధాప్రయాసంబున జీవితంబు గడపం దలపెట్టక, చిరతరానంద సంధాయకంబును నైహికాముష్మిక సౌఖ్యంబునుగూర్చు సద్యఃప్రభావ జనితంబగు కృత్యంబు లనేకంబులు సేయుచుందురనియు, నట్టి యుత్కృష్టమగు మానవజీవితమందు నిత్యకృత్యములలో నగ్రస్థానము వహించునది సకలకారణ కారణభూతుఁడైన యాపరమేశ్వర పాదారవింద ధ్యానమనియు ధర్మజ్ఞులు బలుక వింటి.

సరస్వతీ కరుణాకటాక్ష శ్రీలచే లభించు సహజ వాగ్ధోరణి వలన స్తుతించుదమన్న నట్టిశక్తి నాకలవడకుండుటంజేసియు, సహజ పాండిత్య సంపన్నుండై కేవల మాపరబ్రహ్మ స్వరూప మనందగు పోతనార్యుని వాగ్విలసితమందు నాకుంగల యభిమానముచేతను, సులభమార్గంబున ముక్తిమార్గంబుఁ బొందుటకు భక్తి, నీతి, జ్ఞాన, వైరాగ్యంబుల కాలవాలమగు భాగవతము పవిత్రమగు గ్రంథరాజ మగుటచేతను

శ్లో. భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప.

అను గీతావాక్య ప్రమాణము ననుసరించి కేవలము భక్తిచేతనే పరంధాముని జేరవచ్చునను నాశయముచేతను, అట్టి భక్తికి భాగవతము పుట్టినిల్లగుటచేతను, నందుండి కొన్ని భక్తి వైరాగ్య పద్యంబులను నిత్యప్రార్థన కనుకూలించునట్లు సంగ్రహించితిని. ఇయ్యది ఘనకార్యము కాదని నేనెఱుంగుదును. " ఉదరనిమిత్తో బహుకృత వేషః " యనునట్లు " నిజదార సుతోదర పోషణార్థమై " మానవులు విశేషకాలము వెచ్చింపవలసిన వారలయ్యుఁ దుదకు జీవిత తరణోపాయము వెదకుకొన వలయును గదా! అట్టిచో నట్టిశక్తియు లేని నాకు వరప్రసాదలబ్ధులును వాక్సిద్ధిగలవారును నగు ప్రాక్కవుల గ్రంథరాజములే శరణ్యంబులయ్యె. దినచర్యలు ముగిసిన వెనుక నిత్యము బహుస్వల్పకాలమైనను దైవతారాధనకై నియోగించిన చాలునను నమ్మకముతో క్లుప్తముగ నియ్యది సమకూర్చితిని. పరమ భాగవతోత్తములగు పాఠకమహాశయు లెల్లరును నాయీ యుద్యమమునకుఁ దగిన ప్రోత్సాహ మిత్తురుగాక.

క. భక్తిన్ భాగవతంబును
శక్తికొలందిని పఠించు శాంతాత్ములకున్
ముక్తి బహు సులభమగు, వే
దోక్తంబగు మార్గమిది బహూక్తు లిఁకేలా?

ఇట్లు,

వా. మహాలక్ష్మమ్మ.

శ్రీమత్పరదేవతాయైనమః.

# పోతన్న భక్తి.

---

ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాది మధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁ దానయైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్. 1

ఉ. ఏవిభు వందనార్చనము లేవిభు చింతయు నామకీర్తనం
బేవిభు లీల లద్భుతము లెవ్వని సంశ్రవణంబు సేయు దో
షావళిఁ బాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగు నందురు నే
నావిభు నాశ్రయించెద నఘౌఘ నివర్తను భద్రకీర్తనున్. 2

ఉ. ఏ పరమేశు పాదయుగ మెప్పుడుఁ గోరి భజించి నేర్పరుల్
లోపలి బుద్ధితో నుభయ లోకములందుల జడ్డుఁ బాసి యే
తాపము లేక బ్రహ్మగతిఁ దారు గతశ్రములై చరింతు రే
నాపరమేశు మ్రొక్కెద నఘౌఘ నివర్తను భద్రకీర్తనున్. 3

చ. తపములఁ జేసియైన మఱి దానము లెన్నియుఁ జేసియైన నే
జపములఁ జేసియైన ఫలసంచయ మెవ్వనిఁ జేర్పకున్న హే
యపదములై దురంత విపదంచిత రీతిగ నొప్పుచుండు న
య్యపరిమితున్ భజించెద నఘౌఘ నివర్తను భద్రకీర్తనున్. 4

సీ. నీగృహాంగణభూమి సిలలంబు మోవంగ
మోదించి నిత్యంబు మ్రొక్కఁడేని
నీమంగళ స్తవ నికర వర్ణంబులు
పలుమాఱు నాలుకఁ బలుకఁడేని

నీయధీనములుగా నిఖిల కృత్యంబులు
ప్రియభావమున సమర్పింపఁ డేని
నీపదాంబుజముల నిర్మల ధ్యానయుక్తిఁ
చింతించి మ్రొక్కఁ జిక్కఁడేని

గీ. విన్నఁ జెవులార వినఁడేని నీదు సేవ
సేయరాఁడేని బ్రహ్మంబుఁ జెందఁగలఁడె
యోగియైనఁ దపోవ్రత యోగియైన
వేదియైన మహాతత్త్వ వేదియైన. 5

గీ. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేనిఁ
గలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు. 6

మ. పరుఁడై యీశ్వరుఁడై మహామహిముఁడై ప్రాదుర్భవస్థాన సం
హరణక్రీడనుఁడై త్రిశక్తియుతుఁడై యంతర్గత జ్యోతియై
పరమేష్ఠి ప్రముఖామరాదులకునుం బ్రాపింప రాకుండు దు
స్తర మార్గంబునఁ జెలరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్.

సీ. మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁ దూఁగు
రాయంచ సనునె తరంగిణులకు
లలిత రసాల పల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు

గీ. నంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేష మత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు
వినుత గుణశీల మాటలు వేయునేల? 8

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి
గీ. దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి హరిఁ జేరు మనియెడి తండ్రి తండ్రి. 9

క. కలఁడందురు దీనులయెడఁ
గలఁడందురు పరమయోగి గణముల పాలం
గలఁడందు రన్నిదిశలను
గలఁడు కలండనెడు వాఁడు గలఁడో లేఁడో. 10

సీ. కలుగఁడే నాపాలి కలిమి సందేహింపఁ
గలిమి లేములు లేక కలుగువాఁడు
నాకడ్డపడ రాఁడె నలినసాధువులచేఁ
బడిన సాధుల కడ్డపడెడు వాఁడు

చూడఁడే నా పాటుఁ జూపులఁ జూడక
చూచువారలఁ గృపఁ జూచువాఁడు
లీలతో నా మొఱాలింపఁడే మొఱఁగుల
మొఱలెఱుంగుచు దన్ను మొఱఁగువాఁడు
గీ. అఖిలరూపముల్ దనరూప మైనవాఁడు
ఆదిమధ్యాంతములు లేక యడరువాఁడు
భక్తజనముల దీనుల పాలివాఁడు
వినఁడె చూడఁడె తలఁపఁడె వేగరాఁడె. 11

శా. లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా. 12

మ. మది నూహింపఁగ యోగివర్యులు భవన్మాయా లతాబద్ధులై
యిదమిత్థమ్మన లేరు తామసులనై యేపారు మాబోఁటి దు
ర్మదు లేరీతి నెఱుంగఁ జాలుదురు సమ్యగ్జ్ఞాన ధీయుక్తి నీ
పదముల్ సేరెడి త్రోవఁ జూపి భవకూపంబుం దరింపింపవే? 13

# శ్రీమన్నారాయణ కవచము.

చ. గరుడుని మూఁపుపైఁ బదయుగంబు ఘటిల్లఁగ శంఖ చక్ర వ
ర్మరుచిర శార్ఙ్గ ఖడ్గ శర రాజిత పాశ గదాది సాధనో
త్కర నికరంబు లాత్మకరకంజములన్ ధరియించి భూతి సం
భరిత మహాష్టబాహుఁడు కృపామతితో ననుఁ గాచుఁ గావుతన్.

ఆ. ప్రకట మకర వరుణ పాశంబులందుల
జలములందు నెందుఁ బొలియకుండఁ
గాచుఁగాక నన్ను ఘనుఁ డొక్కఁడైనట్టి
మత్స్యమూర్తి విద్యమాన కీర్తి.

క. వటుఁడు సమాశ్రిత మాయా
నటుఁడు బలిప్రబల శోభన ప్రతిఘటనో
ద్భటుఁడు త్రివిక్రమ దేవుఁడు
చటుల స్థలమందు నన్ను సంరక్షించున్.

చ. అడవుల సంకటస్థలుల నాజిముఖంబుల నగ్నికీలలం
దెదరుల నెల్ల నాకు నుతికెక్కఁగ దిక్కగుఁగాక శ్రీ నృసిం
హుఁడు సురశత్రుయూథప వధోగ్రుఁడు విస్ఫురితాట్టహాస వ
క్త్రుఁడు ఘనదంష్ట్ర పావక విధూత దిగంతరుఁ డప్రమేయుఁడై.

చ. అరయఁగ నెల్లలోకములు నంకిలి నొంద మహార్ణవంబులో
నొరగి నిమగ్నమైన ధర నుద్ధతిఁ గొమ్మున నెత్తినట్టి యా
కిటిపతి యగ్నికల్పుఁ డురుఖేలుఁడు నూర్జిత మేదినీ మనో
హరుఁడు కృపావిధేయుఁడు సదాధ్వముల న్ననుఁ గాచుఁ గావుతన్.

క. రాముఁడు రాజకులైక వి
రాముఁడు భృగు సత్కులాబ్ధి రాముఁడు సుగుణ
స్తోముఁడు నను రక్షించును
శ్రీమహితోన్నతుఁడు నద్రిశిఖరము లందున్.

సీ. తాటక మర్దించి తపసి జన్నము గాచి
హరువిల్లు విఱిచి ధైర్యమున మెఱసి
ప్రబలులైనట్టి విరాధ కబంధోగ్ర
ఖరదూషణాది రాక్షసులఁ దునిమి

వానరవిభు నేలి వాలిఁ గూలఁగ నేసి
జలరాశి గర్వంబుఁ జక్కఁ జేసి
సేతువు బంధించి చేరి రావణ కుంభ
కర్ణాది వీరులఁ గడిమిఁ ద్రుంచి
గీ. యల విభీషణు లంకకు నధిపుఁ జేసి
భూమిసుతఁ గూడి సాకేత పురమునందు
రాజ్యసుఖములు గైకొన్న రామ విభుఁడు
వరుస నన్నుఁ బ్రోచుచుండుఁ బ్రవాసగతుల.

మఱియు నఖిల ప్రమాదంబులైన యభిచార కర్మంబువలన నారాయణుండును గర్వంబువలన నగుండును యోగభ్రంశంబువలన యోగనాథుండయిన దత్తాత్రేయుండును గర్మబంధమువలన గణేశుండైన కపిలుండును గామదేవునివలన సనత్కుమారుండును మార్గంబుల దేవహేళనంబు సేయుటవలన శ్రీహయగ్రీవ మూర్తియును దేవతా నమస్కార తిరస్కార దేవపూజాచ్ఛిద్రంబులవలన నారదుండును నశేష నిరయంబువలన గూర్మంబును నపథ్యంబువలన భగవంతుండైన ధన్వంతరియును ద్వంద్వంబువలన నిర్జితాత్ముండైన ఋషభుండును జనాపవాదంబువలన నగ్నిదేవుండును జనన మరణాదులం గలుగఁజేయు కర్మంబువలన బలభద్రుండును గాలంబువలన యముండును సర్పగణంబులవలన శేషుండును నప్రబోధంబువలన ద్వైపాయనుండును పాషండ సమూహంబువలన బుద్ధదేవుండును శనైశ్చరునివలన గల్కియునై ధర్మరక్షణ పరుండయిన మహావతారుండు నన్ను రక్షించుగాతఁ బ్రాహ్ణ మధ్యాహ్న పరాహ్ణ సాయంకాలంబులను బ్రదోషోర్ధరాత్రాపరరాత్రి ప్రత్యూషానుసంధ్యలను బ్రభాతంబునను గదాద్యాయుధంబుల ధరియించి కేశవ నారాయణ గోవింద విష్ణు మధుసంహార త్రివిక్రమ వామన హృషీకేశ పద్మనాభ శ్రీవత్సధామ సర్వే

శ్వరేశ జనార్దన విశ్వేశ్వర కాలమూర్తులను నామరూపంబులు గల
దేవుండు నన్ను రక్షించుగాక. ప్రళయకాలానలాతితీక్ష్ణ సంభ్రమ
భ్రమణనిర్వక్ర విక్రమ వక్రీకృత దనుజ చక్రంబైన సుదర్శన నామ
చక్రంబ! మహావాయు ప్రేరితుండై మహాశనుండు నీరస తృణాట
వుల భస్మీభూతంబు సేయుభంగి భగవత్ప్రయుక్తంబవై మద్వైరిసై
న్యంబుల దగ్ధంబుఁ గావింపుము. జగత్సంహారకాల పటుఘటిత
చటుల మహోత్పాత గర్జారవ తర్జన దశదిశాభివర్జిత ఘనఘనాం
తర నిష్ఠ్యూత నిష్ఠురకోటి శతకోటి సంస్పర్శ స్ఫురద్విస్ఫులింగ నిర్గ
మానర్గళభుగభుగాయమాన మూర్తి విస్ఫూర్తి నారాయణ కరకమ
లవర్తి గదాయుధోత్తమ! మదీయ వైరితండోపతండంబుల ఖండనం
బునం జండగతిం బిండిపిండిగాఁ గూశ్మాండ వైనాయక యక్ష రక్షో
భూతగ్రహంబులు చూర్ణంబులుగాఁ గొండొక వినోదంబు సలుపుము.
దరేంద్రంబవైన పాంచజన్యంబ! సర్వలోక జిష్ణుండైన శ్రీకృష్ణుని నిఖిల
పుణ్యైక సదన వదన నిష్ఠ్యూత నిశ్వాసాధర వేణుపరిపూరితంబవై
యున్మత్త భూత ప్రేత పిశాచ విప్ర గ్రహాది క్రూరదుర్గ్రహంబులు
విద్రావణంబుగా నస్మత్పరివీర మండలంబుల గుండియలతోఁ దదీయ
మానినీ దుర్భర గర్భంబులు గర్భస్రావక నిర్భేదంబుగా భూరి
బ్రహ్మాండభాండ భీకరంబగున భూరినాదంబున మోరింపు మతితీవ్ర
ధారాదళిత నిశాతకోటి కఠోర కంఠ కరాళ రక్తధారా ధౌత మలీ
మస విసరంబవైన నందక మహాసిశేఖరంబ! జగదీశ ప్రేరితంబవై
మద్విద్వేషమ వ్యూహంబుల మెండు గండికండలుగఁ జెండి చెండా
డుము. నిష్కళంక నిరాతంక సాంద్ర చంద్రమండల పరిమండిత
సర్వాంగ లక్షణ విచక్షణ ధర్మనిరతంబవైన చర్మంబ! దుర్మద మద్వై
రిలోక భీకరాలోకంబులను సమాకుల నిబిడ నీరంధ్ర నిష్ఠుర తమః
పటల పటుఘటనంబులం గుటిల పఱుపుము. నిఖిల పాపగ్రహంబు
లవలనను సకల నర మృగ సర్ప క్రోడ భూతాదులవలనను నగు

భయంబులు భగవన్నామరూప యాన దివ్యాస్త్రంబులవలనం బొంద
కుండుగాక. బృహద్రథంతరాది సామంబులచేత స్తోత్రంబు సేయం
బడుచున్న ఖగేంద్రుండు రక్షణ దక్షుండై నన్ను రక్షించుఁగాక.
శ్రీహరినామ రూప వాహన దివ్యాయుధ పార్షదోత్తమ ప్రముఖంబు
లస్మదీయ బుద్ధీంద్రియ మనఃప్రాణంబుల సంరక్షించు భగవంతుం
డైన శేషుండు సర్వోపద్రవంబుల నాశంబు సేయు. జగదైక్య భావం
బయిన ధ్యానంబుఁ గలవానికి వికల్పరహితుండై భూషణాయుధ లిం
గాఖ్యలగు శక్తులం దనమాయచేత ధరియించి తేజరిల్లుచుండు లక్ష్మీ
కాంతుండు వికల్ప విగ్రహంబులవలన నన్ను రక్షించుఁగాక. లోక
భయంక రాట్టహాస భాసుర వదనగహ్వరుండగుచు సమస్త తేజోహ
రణ ధురీణ తేజఃపుంజ సంజాత దివ్య నృసింహావతారుండగు నప్పర
మేశ్వరుండు సర్వదిగ్భాగంబులవలన సమస్త బహిరంతరంబులవలన
నన్ను రక్షించుచుండుఁ గాతమని నారాయణాత్మక కవచ పరిభావం
బితిహాసరూపంబున నింద్రుండు తెలిసికొని ధ్యానంబు సేసి తద్విద్యా
ధారణ మహిమవలన నరాతుల నిర్జించెం గావున నెవ్వారేని నిర్మలా
త్ములగువార లేతద్విద్యాధారణులై యనుదినంబును బఠించిన నతి
ఘోర రణంబుల నత్యుత్కట సంకటంబులను సర్వగ్రహ నిగ్రహ
కర్మ మారణ కర్మాది దుష్కర్మజన్య క్లేశంబులను వదలి యవ్యాకుల
మనస్కులై విజయంబు నొందుదురు. మఱియును సర్వరోగంబు
లకు నగమ్య శరీరులై సుఖంబు నొందుదు రదియునుంగాక.

క. అనుదినము దీని నెవ్వరు
వినిరేనిఁ బఠించిరేని విస్మయ మొదవన్
ఘనభూత జాలమెల్లను
మునుకొని వారలను గాంచి మ్రొక్కుచునుండున్.

# పోతన్న వైరాగ్యము.

మ. అరవిందాక్షు పదారవింద మకరందాసక్తులై యున్న స
త్పురుష శ్రేష్ఠుల వృత్తముల్ వినక దుర్బుద్ధిన్ విలంఘించి, దు
ర్నరవార్తా కథన ప్రపంచములు గర్ణప్రాప్తముల్ సేసి, వా
సరముల్ వ్యర్థతఁ ద్రోచుచుండ జనదీ సంసార మోహంబునన్. 1

చ. పరఁగుచునున్న దుర్వ్యసన భాజనమై ఘన దుఃఖ మూలమై
యరయఁగఁ బెక్కుతూంట్లు గలదై క్రిమిసంభవ మైనయట్టి దు
స్తర బహు గర్భవాసముల సంగతి మాన్పుటకై భజించెదన్
సరసిజనాభ భూరి భవసాగర తారక పాదపద్మముల్. 2

ఉ. మచ్చిక వీరికెల్ల బహుమాత్రముఁ జోద్యము దేహి పుట్టుచుం
జచ్చుచు నుండఁ జూచెదరు చావక మానెదు వారిభంగి నీ
చచ్చినవాని కేడ్చెదరు చావున కొల్లక డాఁగ వచ్చునే
యెచ్చటఁ బుట్టి నచ్చటికి నేఁగుట నైజము ప్రాణికోటికిన్. 3

మ. చెలులుం దల్లులుదండ్రు లాత్మజులు సంసేవ్యుల్ సతుల్ చారు ని
ర్మల గేహంబులటంచుఁ గూర్తురు మహామాయాగుణ భ్రాంతులై
కలలోఁ దోఁచిన యర్థముల్ నిజములే కర్మానుబంధంబులం
గలుగున్ సంగము లేక మానుఁ బిదపం గర్మాంత కాలంబునన్. 4

మ. కలలం బోలెడి పుత్రమిత్ర వనితాగారాది సంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయు చందంబునం
దలఁతుర్ సత్యములంచు మూఢుఁడ వృథాతత్త్వజ్ఞుఁడన్ నాకు నీ
విలసత్పాదయుగంబు సూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ! 5

ఉ. ఏను మృతుండ నౌదునని యింత భయంబు మనంబులోపలన్
మానుము సంభవంబుగల మానవకోట్లకుఁ జావు నిత్యమా

భయంబులు భగవన్నామరూప యాన దివ్యాస్త్రంబులవలనం బొంద కుండుగాక. బృహద్రథంతరాది సామంబులచేత స్తోత్రింబు సేయం బడుచున్న ఖగేంద్రుండు రక్షణ దక్షుండై నన్ను రక్షించుఁగాక. శ్రీహరినామ రూప వాహన దివ్యాయుధ పార్షదోత్తను ప్రముఖంబు లస్మదీయ బుద్ధీంద్రియ మనఃప్రాణంబుల సంరక్షించు భగవంతుండైన శేషుండు సర్వోపద్రవంబుల నాశంబు సేయు. జగదైక్య భావంబయిన ధ్యానంబుఁ గలవానికి వికల్పరహితుండై భూషణాయుధ లింగాఖ్యలగు శక్తులం దనమాయ చేత ధరియించి తేజరిల్లుచుండు లక్ష్మీకాంతుండు వికల్ప విగ్రహంబులవలన నన్ను రక్షించుఁగాక. లోకభయంకర రాట్టహాస భాసుర వదనగహ్వరుఁడగుచు సమస్త తేజోహారణ ధురీణ తేజఃపుంజ సంజాత దివ్య నృసింహావతారుండగు నప్పరమేశ్వరుండు సర్వదిగ్భాగంబులవలన సమస్త బహిరంతరంబులవలన నన్ను రక్షించుచుండుఁ గాతమని నారాయణాత్మక కవచ ప్రభావంబితిహాసరూపంబున నింద్రుండు తెలిసికొని ధ్యానంబు సేసి తద్విద్యాధారణ మహిమవలన నరాతుల నిర్జించెఁ గావున నెవ్వరేని నిర్మలాత్ములగువార లేతద్విద్యాధారణులై యనుదినంబును బఠించిన నతిఘోర రణంబుల నత్యుత్కట సంకటంబులను సర్వగ్రహ నిగ్రహకర్మ మారణ కర్మాది దుష్కర్మజన్య క్లేశంబులను వదలి యవ్యాకులమనస్కులై విజయంబు నొందుదురు. మఱియును సర్వరోగంబులకు నగమ్య శరీరులై సుఖంబు నొందుదు రదియునుంగాక.

క. అనుదినము దీని నెవ్వరు
వినిరేనిఁ బఠించిరేని విస్మయ మొదవన్
ఘనభూత జాలమెల్లను
మునుకొని వారలను గాంచి మ్రొక్కుచునుండున్.

# పోతన్న వైరాగ్యము.

మ. అరవిందాక్షు పదారవింద మకరందాసక్తులై యున్న స
త్పురుష శ్రేష్ఠుల వృత్తముల్ వినక దుర్బుద్ధిన్ విలంఘించి, దు
ర్నరవార్తా కథన ప్రపంచములు గర్ణప్రాప్తముల్ సేసి, వా
సరముల్ వ్యర్థతఁ ద్రోచుచుండ జనదీ సంసార మోహంబునన్. 1

చ. పరఁగుచునున్న దుర్వ్యసన భాజనమై ఘన దుఃఖ మూలమై
యరయఁగ బెక్కుతూంట్లు గలదై క్రిమిసంభవమైనయట్టి దు
స్తర బహు గర్భవాసముల సంగతి మాన్పుటకై భజించెదన్
సరసిజనాభ భూరి భవసాగర తారక పాదపద్మముల్. 2

ఉ. మచ్చిక వీరికెల్ల బహుమాత్రముఁ జోద్యము దేహి పుట్టుచుం
జచ్చుచు నుండఁ జూచెదరు చావక మానెడు వారిభంగి నీ
చచ్చినవాని కేడ్చెదరు చావున కొల్లక డాఁగ వచ్చునే
యెచ్చటఁ బుట్టి నచ్చటికి నేఁగుట నైజము ప్రాణికోటికిన్. 3

మ. చెలులుం దల్లులుదండ్రు లాత్మజులు సంసేవ్యుల్ సతుల్ చారు ని
ర్మల గేహంబులటంచుఁ గూర్తురు మహామాయాగుణ భ్రాంతులై
కలలోఁ దోఁచిన యర్థముల్ నిజము లే కర్మానుబంధంబులం
గలుగున్ సంగము లేక మానుఁ బిదపం గర్మాంత కాలంబునన్. 4

మ. కలలం బోలెడి పుత్రమిత్ర వనితాగారాది సంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయు చందంబునం
దలఁతున్ సత్యములంచు మూఢుఁడ వృథాతత్త్వజ్ఞుఁడన్ నాకు నీ
విలసత్పాదయుగంబు సూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ! 5

ఉ. ఏను మృతుండ నౌదునని యింత భయంబు మనంబులోపలన్
మానుము సంభవంబుగల మానవకోట్లకుఁ జావు నిత్యమా

గాన హరిం దలంపు మిఁక గల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ! పొందెదవు మాధవలోక నివాస సౌఖ్యముల్. 6

చ. ధన పశు పుత్ర మిత్ర వనితా గృహ కారణ భూతమైన యీ
తనువున నున్న జీవుఁడు పదంపడి యట్టి శరీర మొత్తి తా
ననుగతమైన కర్మఫల మందక పోవఁగ రాదు మింటఁ బో
యిన భువి దూఱినన్ దిశల కేఁగిన నెచ్చటనైన డాఁగినన్. 7

సకల జన్మంబులందును ధర్మార్థచరణ కారణంబయిన మానుష జన్మంబు దుర్లభం బందుఁ బురుషత్వంబు దుర్గమం బదియు శతవర్ష పరిమితంబైన జీవిత కాలంబున నియతంబై యుండు నందు సగమంధకార బంధురంబై రాత్రిరూపంబున నిద్రాది వ్యవహారంబుల నిరర్థకంబై చనుఁ జిక్కిన పంచాశద్వత్సరంబులందును బాల్య కైశోర వయోవిశేషంబుల వింశతి హాయనంబులు గడచుఁ గడమ ముప్పది యబ్దంబులు నింద్రియంబులచేతఁ బట్టువడి దురవగాహంబులయిన కామ క్రోధ లోభ మోహ మద మత్సరంబులను పాశంబులం గట్టువడి వివశ సమర్థుండు గాక ప్రాణంబులకంటె మధురాయమానమైన తృష్ణకు లోనై భృత్య తస్కర వణిక్కర్మంబులఁ బ్రాణహానియైన నంగీకరించి పరార్థంబుల నర్థించుచు రహస్య సంభోగ చాతుర్య సౌందర్య విశేషంబుల ధైర్యవల్లికా లవిత్రంబులయిన కళత్రంబులను, సుహాసీయ మంజుల మధురాలాపంబులు గలిగి వశులయిన శిశువులను శీలవయోరూప ధన్యలగు కన్యలను వినయ వివేక విద్యాలంకారులయిన కుమారులను గామిత ఫలప్రదాతలగు భ్రాతలను మమత్వ ప్రేమ దైన్య జనకులయిన జననీ జనకులను సకల సౌజన్య సింధువులయిన బంధువులను, ధన కనక వస్తు వాహన సుందరంబులయిన మందిరంబులను సుకరంబులైన పశు భృత్య నికరంబులను వంశపరంపరాయత్తంబులయిన విత్తంబులను వర్జింప లేక సం

సారంబు నిర్ణయించు నుపాయంబుఁ గానక తంతువర్గంబున నిర్గమద్వార శూన్యంబయిన మందిరంబుఁ జేరి చిక్కువడి వెడలెడు పాటవంబు చాలక తగులువడు కీటకంబు చందంబున గృహస్థుండు స్వయంకృత కర్మబద్ధుండై శిశ్నోదరాది సుఖంబులఁ బ్రమత్తుండయి నిజ కుటుంబ పోషణ పారవశ్యంబున విరక్తి మార్గంబుఁ దెలియనేరక స్వకీయ పరకీయభిన్నభావంబున నంధకారంబునం బ్రవేశించుం గావునఁ గౌమారసమయంబున మనీషా గరిష్ఠుండై పరమ భాగవత ధర్మంబు లనుష్ఠింపవలయు. దుఃఖంబులు వాంఛితంబులు గాక దేవుభంగి సుఖంబులును గాలానుసారంబులై లబ్ధంబు లగుం గావున వృథా ప్రయాసంబున నాయుర్వ్యయంబు సేయం జనదు. హరిభజనంబున మోక్షంబు సిద్ధించు. విష్ణుండు సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు. ముముక్షువైన దేహికి దేహావసాన పర్యంతంబు నారాయణ చరణారవింద సేవనంబు గర్తవ్యంబు.

సీ. కంటిరే మనవారు ఘనులు గృహస్థులై
విఫలులై కైకొన్న వెఱ్ఱితనము
భద్రార్థులై యుండి పాయరు సంసార
పద్ధతి నూరక పట్టువడిరి
కల యోనులందెల్ల గర్భాద్యవస్థలఁ
బురుషుండు దేహియై పుట్టుచుండుఁ
దన్నెఱుంగఁడు కర్మతంత్రుఁడై కడపట
ముట్టఁడు భవశతములకునైన

ఆ. దీన శుభము లేదు దివ్యకీర్తియు లేదు
జగతిఁ బుట్టిపుట్టి చచ్చిచచ్చి
పొరల నేల మనకుఁ బుట్టని చావని
త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి.

సంపూర్ణము.

# స్నేహలతా కవితాసంఘమువారిచే ప్రకటింపబడిన గ్రంథములు.

| | | | రు. అ. పై. |
|---|---|---|---|
| 1 | రాఘవ శతకము | ... | 0—2—0 |
| 2 | మాధవ శతకము | ... | 0—2—0 |
| 3 | సరస్వతీ శతకము | ... | 0—2—0 |
| 4 | పతివ్రతా శతకము | ... | 0—4—0 |
| 5 | భారతనీతులు | ... | 0—4—0 |
| 6 | ధ్రువచరిత్ర | ... | 0—4—0 |
| 7 | వైజయంతి వార్షికపత్రిక | ... | 1—0—0 |
| 8 | సరస్వతీ రామాయణము | ... | 1—0—0 |
| 9 | రామాయణ సంగ్రహము | ... | 0—8—0 |
| 10 | లక్ష్మీశారదా సుభాషితము | ... | 0—8—0 |
| 11 | లక్ష్మీశారదా గీతములు | ... | 0—10—0 |
| 12 | లక్ష్మీశారదా శతకములు | ... | 0—5—0 |
| 13 | వీరగాధలు | ... | 0—5—0 |
| 14 | సుకన్య | ... | 0—2—0 |
| 15 | బ్రహ్మవర్తోపాఖ్యానము అను పౌగాణచరిత్ర | | 0—8—0 |

వలయువారికి కవితాసంఘము రిపోర్టు ఉచితముగపంపబడును. అందు సర్వవిషయములును గోచరములగును. పై అన్నిగ్రంథములు ఒకేసారి కొనువారికి పై సంఘమువారిచే రచింపబడిన మఱికొన్ని గ్రంథములు ఉచితముగ నియ్యబడును.

అభినవసరస్వత్యనుబంధము ౯౨.

# జానకీపతిశతకము



గ్రంథకర్త

వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు, బి. ఏ.

ప్రెసిడెంటు — స్నేహలతాకవితాసంఘము,

కొల్లాపురము - జటప్రోలుసంస్థానము.



గ్రంథసంస్కర్త

జానపాటి పట్టాభిరామశాస్త్రి

ఎడిటరు - అభినవసరస్వతి.



గుంటూరు చంద్రికాముద్రాక్షరశాలయందు ముద్రితము.

1932

# పితృపాద సంస్కృతి

———:o:———

ఉ. పెంపెక్కన్ పఠియించి పొంగెదను స
ద్విజ్ఞానసంస్కారతన్
మాహాత్మ్యంబయి నిండె నెవ్వఁడు యశో
ష్పూర్తిన్ నించి సద్దీక్షలన్
శిష్యున్ నే నల రామనాథ జనకున్
సేవింతు సద్భక్తి నీ
పాదమ్ముల్ రఘురామ నాపియుచి సం
ప్రార్థించుచున్ రాఘవా !

వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడు.

# పీఠిక

రసికులారా !

సహజమగు తన కలమంజులస్వరమున భావమనోజ్ఞమంగళగీ ములు పాడు నీకవికలకంఠపోతము శ్రీ సుకవితాసామ్రాజ్యము నే చ్ఛత్రముగ నేలిన శ్రీ తిరుపతివేంకటేశ్వరుల కరుణాకటాక్షసుధా రసము గ్రోలుచుఁ దత్ప్రభావమున రచించిన కబ్బములు పెక్కుఁ గలవు. అందు నీజానకీపతిశతక మొకటి - ఇది కేవలము భక్తిరస పరిపూరితమై లలితంపు శయ్య నలరారుచు నీతిరత్నముల కెల్లఁ బేటిక యై చెలువొందుచున్నది. ఇందు శ్రీరాముని త్యాగశీలతయుఁ గుల సమాగత ధర్మగుణరక్షణమును జానకీవిమలపాతివ్రత్యమును లక్ష్మణుని సౌభ్రాత్రృత్వమును భరతుని నిష్కలంకమహాత్యాగమును భక్తిరసా వేశమున వర్ణింపఁబడినవి. ఈకవి తన తాతతండ్రులువోలె రామభక్తి పరాయణుండని తద్గ్రంథమే చెప్పక చెప్పెడిని.

## గుణసంపత్తి.

సత్త్వగుణసంపన్నతను బితాజ్ఞాపరిపాలనంబునను ధర్మరక్ష మ్మునను శ్రీరాముఁడువోలె ముందంజవైచు త్యాగధనులలో యువకుఁ డొకఁడని యీతని జీవితచారిత్రమును గాంచిన సత్యశీలు కెల్లఁ దెల్లము కాక మానదు.

## గ్రంథప్రయోజనము.

శ్రీరాముని చారిత్రమును బెక్కురు కవిపుంగవులు కావ్య నాటకశతకరూపముల రచించియుండ నిప్పుడీ

గ్రంథమువలని ప్రయోజన మేమి ?

అట్లు నిరసింపవలదు. మోక్షసాధనములలో భక్తియే ప్రథమ సాధనమని వ్యాసాదు లుద్ఘోషించుటంజేసి భక్తిరసపరిపూర్ణమగు శతకము ముముక్షుజనుల కెల్ల మార్గదర్శకమై భక్తినిఁ బెంపొందిం డిని. మఱియు,

మ॥ ... ... ... రాఘవే
శ్వరుచారిత్రము నెవ్వ రెన్నిగతులఁ వాకుచ్చినఁ గాదే ?

అను నార్యోక్తు లభినందనీయములు - కలిగినదానఁ దృప్తి వడఁగల్గి క్షమాసత్యముల నుపాసించుచుఁ బరమేశ్వరప్రతిపాదకమగు కవిత్వమును రచించుచు దాన జీవితము గృతార్థత గావించుకొనుట పండితప్రశంసనీయము.

## గు ణ దో ష ము లు.

ఇందు శైలి మధురముగ నున్నది. వినువారి వీనుల నమృతంపు సోన లొలుకురీతిఁ దేటతెల్లమగు మాటలతో భావము విశదీకరింపఁ బడినది. వేయేల కవితాప్రపంచమున కీకవి నర్ధమానచంద్రుఁడు. మఱియు నిందు 'చేతును తోత్రువె' ఇత్యాదిప్రయోగము లసాధువు లని కొందఱిమతము. అందందుఁ బునరుక్తములు క్వాచిత్కము లగుచు న్నను నయ్యవి భక్తిరసతన్మయతను వ్యక్తపఱచుటంజేసి శతకమునకు నూతనాలంకృతులయి సత్కవిజనాదరణీయము లగుచున్నవి.

## అ భి నం ద న ము.

విద్యాభిమానియగు నీతనికి శ్రీ రాజా సురభి లక్ష్మారాయ మిడిల్ స్కూలునందునఁ బ్రధానోపాధ్యాయత్వపద మొసంగి గృహా రామాదుల నిచ్చి దయ నాదరించుచుండిన శ్రీ శ్రితజనకల్పవల్లియగు శ్రీ జటప్రోల్ మహారాణి శ్రీ వేంకటరత్నమాంబాజనసీమతల్లికిని శ్రీ తత్కుమారరత్నములగు శ్రీ రాజా జగన్నాథరావుబహాదర్ వారికిని నా జగన్నాథుఁడు చిరాయుష్యమును స్థిరసామ్రాజ్యలక్ష్మీవిభవంబు నొసంగి రక్షించుఁగాక.

మఱియు, స్నేహాలతాకవితాసంఘమునకు నధ్యక్షుఁడయి స ద్గ్రంథరచనకుఁ గడంగుచుండిన యీతని యుద్యమమునకుఁ బరమేశ్వ రుఁడు తోడగుఁగాక.

## —♦ ఆశీర్వచనము ♦—

మ. గురు నాజ్ఞం దలఁదాల్చు ధీమణులకున్ గోవిందుఁ డానందమున్
స్థిరసౌఖ్యమ్ముఁ జిరాయువున్ విజయలక్ష్మిం గూర్చి పాలించు-నా
పరమాత్ముండగు రాఘవేశ్వరుని దివ్యంబైన చారిత్రమే
వరలుం దత్పరమార్థలక్ష్యముగ నోవత్సా! శుభం బయ్యెడిన్. 1

మ. రఘురాముల్ భజియించుచుంటివికదా! రక్షించు నిన్నాతఁడున్
రఘువంశమ్మున కాదియైన రవియున్ రక్షింపఁడే నీసతిన్.
లఘుతం జెందుదురే? రఘుప్రముఖు. లౌరా! భక్తసంత్రాణల
బ్ధ ఘనోద్యద్రమణీయకంకణలసత్ప్రాంచత్కరాంభోరుహుల్. 2

మ. చిరసౌభాగ్యముగల్గి నీసుదతి వాసింగాంచి నీపుత్రులున్
స్థిరసంపత్కమనీయవైభవయశశ్శ్రీమత్తచే నీవునున్
ధర వర్ధిల్లుఁడు నూఱువత్సరము లుద్యద్రమ్యహర్మ్యాద్రి భ
ర్మరమామందిరచంద్రశాలల శుభప్రాచుర్య మేపారఁగన్. 3

ఉ. రాఁగల పెద్దియున్ మనకు రాఁగలదంచుఁ దలంచుచున్ మహా
భాగులు యోగులున్ నడచు భవ్యపథమ్మును బట్టుటల్ మహా
త్యాగులలక్షణంబని యెదం దలపోయుచు ధర్మరక్షణో
ద్యోగుఁడవై మసంగదవె విశ్రుతకీర్తిని దానసంపదన్. 4

మ. స్తుతిపాత్రంబగుఁగాక నీచరిత-మీశుం డాయురారోగ్యసం
యుతఁగాఁ జేసి భవత్సతిన్ మనుచుఁగా కుద్యత్కృపాదృష్టిమై-
సతతమ్మున్ హితబంధువర్గమున కుత్సాహమ్ము దీపింపఁగా
మతిమచ్ఛేఖర! నీకవిత్వము జగన్మాన్యత్వముం బొందుతన్.

ఇట్లు,

పిఠాపురము, 25-2-'32.

జయంతి రామనాథశాస్త్రి
విద్యార్థి.

మ॥ రా॥ శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడుగారు రచించిన జానకీపతిశతకమునందలి కొన్ని పద్యముల నవలోకించితి. ఈకబ్బము భక్తిప్రధానమని చెప్పనొప్పెడిని. కవిత్వము ప్రసాదగుణమున నలరారెడిని. వృత్తి యుపనాగరికాప్రచురమనఁజెల్లును. అలంకారము లటనట శ్రోతల మనముల నాహ్లాదము నుప్పతిల్లంజేసెడిని.

శ్రీ రామసుబ్బారాయుఁడుగారు మఱికొన్ని శతకముల రచించిరి. అయ్యవియు సందర్భానుగుణముగ భావపోషణముం జేయుటలో మిన్నలై మన్నన గనుచున్నయవి.

ఇదియునుంగాక వీ రేర్పఱచిన స్నేహలతాకవితాసంఘమునాఁ బిలువంబడు కవిసమాజమువారు రచించిన కబ్బములును యుక్తములుగఁ జూపట్టెడిని. ఇట్టికావ్యముల వ్రాసియు మఱియు వ్రాయించియుఁ గాలక్షేపమొనర్చెడు శ్రీ రామసుబ్బారాయుఁడుగారి కాయురారోగ్యైశ్వర్యముల నిచ్చి భగవానుఁడు చిరకాలము రక్షించుఁగాత.

వాజపేయవంశవార్ధిచంద్రిమ ! రామ
సుబ్బరాయ ! నీదు కబ్బమందు
పద్యసముదయంబుఁ బరికించినాఁడఁ బో
సంతసించినాఁడ స్వాంతమునను ॥

శ్రీధర పరశురామశాస్త్రి.

-o-

## TESTIMONIAL by
## Sree Raja Inuganty Venkata Krishna Rao Bahadur Varu.

Mr. V. Ramasubbarayudu garu, B. A., of Kovvur is very well known to me for the last five years both as a Palace Tutor and Head master of the local middle school of Jatprole state. He is an industrious and 'deligent young man with an excellent character. Inspite of his many sided interests his field of specialisation lies in Vernacular and Sanskrit and he cultivated his Vernacular to such an extent that it is amazing while at the same time discharging his duties as the Headmaster of the Middle School and tutor in the palace side by side in a way which won for him the good-will and esteem of his pupils and superiors. It is only on account of him that the Middle School at Kollapuram (Jatprole State) has come to such a good state as is at present and I am confident that he would loose no time ere long to make still better use of his extraordinary talents in that direction. His general character leaves nothing to be desired and in his case intelligence is combined with conscientiousness. I wish him every success in life.

**(Sd) I. V. KRISTNARAO,**
*Zamindar of Tirupacchur.*

KOLLAPURAM,
1st. September '32.

---

ఈ వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడుగారు ప్రధాముగా నభ్యసించిన భాష యింగ్లీషు. అందు బి. ఏ. ప్యాసుచేసినారు కాని మొదటనుండియు మాతృభాషయగు నాంధ్రభాషయం దీయ కభిమాన మెక్కుడు. అక్కతన మాయెడల నెక్కుడు ప్రేమతో మ గ్రంథములను జదివి పాండితిని సంపాదించుకొన్న మా యేకలవ శిష్యులలో నగ్రగణ్యుఁడు. ఈయన మామొగమును జూడకమును కవిద్యై మంచి పాండితి నాంధ్రమునందు సంపాదించినవాఁడయ్యె నే వల యల్. టి. పరీక్షార్థము రాజమండ్రిలో నున్న దినములలో న కాశమైనప్పుడెల్ల సమీపముననున్న మాగ్రామమునకు వచ్చి న

యొద్ద భాషావ్యాసంగముగూడఁ జేసి మఱికొంత పాండిత్యమును సంపాదించుకొన్నాఁడు. ఈ కారణమున మా కీయన సాక్షాచ్ఛిష్యుఁడుకూడ నైయున్నాఁడు. ఇప్పుడు చక్కఁగాఁ గవిత్వమును రచియించుచున్నాఁడు. పాండిత్య మటుండ నిట్టియోగ్యతకల మానిసి మాట నాటఁ గాని సాధారణముగాఁ దటస్థింపఁడని నా నిశ్చితాభిప్రాయము. ఇట్టివాఁ డుపాధ్యాయుఁడగుట విద్యార్థుల భాగ్యమని వేఱుగఁ జెప్పనక్కఱ లేదు. ఈయన భగవద్గీతాపరీక్షగూడ మొదటితరగతిగా నిచ్చియుండెను. వర్తనమునకును గీతావ్యాసంగమునకును సంబంధము కలదని చూచినవారెల్ల నిశ్చయింపఁగలరు.

కడియము
తూర్పుగోదావరిజిల్లా

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,
శతావధాని.

చిరంజీవి వాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారిని జిరకాలమునుండి నే నెఱుంగుదును. చిన్ననాఁటనుండియు నతఁడు బుద్ధిమంతుఁడై యాంగ్లేయభాషాభ్యాసముచేసి పట్టపరీక్షయందుఁ గృతార్థుఁడయ్యు నంతతోఁ దనివినందక యీనాఁటి యాంగ్లేయవిద్యాప్రవీణు లగుయువకులవలె మాతృభాష నిరసింపక దానియందుఁ దగిన కృషిచేసి పాండిత్య మలవఱచుకొని శ్రీ రాజా సురభి వేంకటలక్ష్మారావుబహద్దరువారి జీవితము, ఆరోగ్యవేంకటేశ్వర రాజరాజేశ్వరీశతకములు శనిస్తోత్రము మొదలగు గ్రంథములను రచియించెను. ఈయన నేర్చినవిద్యకు వినయము వన్నె పెట్టుచున్నది. విద్యావినయములకు సత్ప్రవర్తనము మెఱుఁగుపెట్టుచున్నది. గుణసంపన్నుఁడైన యీ యువకునకుఁ బరమేశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యములు ప్రసాదించుఁగాత.

రాజమహేంద్రవరము.

చిలకమర్తి లక్ష్మీనరసింహము.

బ్రహ్మశ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారిచే రచింపఁబడిన యీ జానకీపతిశతకము ధారాశుద్ధిగలిగి మృదుమధుర పదగుంభితమై యలరారుచు రామభక్తు లత్యంతాభిలాషతోఁ జదువుకొనుటకు యోగ్యముగా నుండెననుటకు సందియము లేదు. శతకము చేతఁబట్టి యొకటిరెండుపద్యములు పఠించిన భక్తులును రసికులును శతక మంతయుఁ జదువకుండ వదలిపెట్టఁజాలరని తన్మాధుర్యము తఱచుగా ననుభవించిన నాయభిప్రాయము. అక్కతంబుననే యభినవ సరస్వతియం దిద్దానిఁ బ్రచురించితిని. ప్రతిపద్యమును బ్రత్యక్షరమును బలుమాఱులు పఠించియుఁ బరిశీలించియుఁ బ్రత్యంతరము లిఖించియు నున్న కారణమునఁ బ్రకృత మీశతకమున దోషలవమును నుండదని నేను దృఢముగాఁ జెప్పఁగలను. ఉపమోత్ప్రేక్షాద్యర్థాలంకారములు గాని వృత్త్యనుప్రాసాది శబ్దాలంకారములుగాని విశేషించి కలిగి యంత ప్రౌఢము గాకున్నను మనోహరమైన ధార గలిగి సులభశైలితోఁ బాఠకులకు భక్తిజనకమై యుండెననుటకు సంశయము లేదు. గ్రంథకర్తయగు రామసుబ్బారాయఁడుగారు సుజనులు. భగవద్భక్తులు. పండితపక్షపాతులు. కవితాలోలురు. ఇంకను నిత్యాద్యనేక సుగుణగణవిశిష్టులు. ఇంగ్లీషులో బి యేలు. ఆత్మాభ్యస్తమగు నాంధ్రాంగ్లేయభాషలలో ననేకులకు గురువులు. అందును శ్రీ జటప్రోలు సంస్థానాధిపతులగు ప్రస్తుత కుమారరాజాగారి కాంగ్లోపాధ్యాయులై వర్తమానమునఁ దత్సంస్థానమును బాలించుచున్న వారి పాలకమాత యగు రాణి వెంకటరత్నమాంబగారి యధికాదరణమునకుఁ బాత్రులు. రామసుబ్బారాయఁడుగారు పైయంశము లన్నియు నీశతకమున స్ఫురించునట్లు వ్రాసియే యున్నవారు. కావున నియ్యది ప్రశంసాపాత్రమైన శతకమని యస్మదాశయము.

జానపాటి పట్టాభిరామశాస్త్రి,
అభినవసరస్వతీసంపాదకుఁడు.

## —* కృతజ్ఞత *—

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తలును శతావధానధనులును నభినవసరస్వతీ పత్రికాధిపతులును సనాతన ధర్మతత్త్వజ్ఞులును నగు బ్రహ్మశ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు శ్రీ జటప్రోలుసంస్థానములోఁ జేరిన కొల్లాపురగ్రామము వచ్చినప్పుడు నాభాగ్యవశమున నాయింటనే నివసించిరి. ఇట్టి మహనీయులను దర్శించుట కదియే నాకుఁ బ్రథమభాగ్యము. నాకు నాంధ్రకవిత్వమునం దొకింత యభిరుచి యుండుటంజేసి శాస్త్రిగారివద్దఁ గొన్ని కవితా రహస్యములను సంగ్రహించితిని. నాచే రచింపఁబడిన శనిస్తోత్రనక్షత్ర మాలను సంస్కరించి తగు పీఠికవ్రాసి నన్నుఁ గృతకృత్యునిజేసిన మహాత్ములు వీరే. నా ప్రియశిష్యురాలగు శ్రీమతి చేబ్రోలు సరస్వతీ దేవిగారిచే రచింపఁబడిన 'సరస్వతీరామాయణము'నకు సదభిప్రాయ మిచ్చిన పుణ్యాత్ములును వీరే. నాఁటినుండి నా 'స్నేహలతాకవితా సంఘము' నకును వీరికిని దగుబాంధవ్య మేర్పడినది. సంఘ సభ్యు లందఱును వీరి నుచితభక్తితో సత్కరించి నాఁటినుండి వీరిని బెద్దఁజేసి యొకగురునిగ భజించుచున్నారు. ఇప్పుడు నా యీ జానకీ పతిశతకమును నాయందుఁగల శిష్యవాత్సల్యముచేఁ జక్కగా సంస్కరించి దానిపై సదభిప్రాయమిచ్చి దిగంతవిశ్రాంతకీర్తి నార్జించి రమారమి 25 సం॥ నుండి జయప్రదముగ సాగుచున్న తమ యభినవసరస్వతీ పత్రికలోఁ బ్రచురించి నన్ను ధన్యునిగఁ జేసినందులకు నా హృదయ పూర్వకమగు సాష్టాంగవందనసహస్రంబులను త్రికాలములయందును శ్రీ శాస్త్రిగారికి సమర్పణముచేయుచు నా కృతజ్ఞత నీరీతి వెల్లడించు దును. నన్నును నాకవితాసంఘమును నుద్ధరించుచున్న శ్రీశాస్త్రి గారికిఁ బరమేశ్వరుఁడు సంపూర్ణాయురారోగ్యైశ్వర్యముల నిచ్చి సంరక్షించుఁగాతమని ప్రార్థించుదును.

ఇట్లు, విధేయుఁడు,

రామసుబ్బారాయఁడు, బి. ఏ.

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణే నమః

# జానకీపతిశతకము

-:o:-

ఉ. శ్రీగలవానిఁ గాఁగ ననుఁ జేయుమటంచు నినున్ భజింప. ను
ద్యోగులయు న్నొకాఁడనయి యుండుట చాలు. భవాబ్ధి రేబవల్
వేఁగఁగనీక తావకపవిత్రపదంబులు గొల్చులాగునన్
వేగ ననుగ్రహింపుమని వేఁడెద నే నిఁక జానకీపతీ ! 1

చ. సదయత నాకు నాంధ్రమునఁ జక్కని కైతము నేర్పి యొంతయున్
ముద మొనగూర్చియున్న పరిపూషితశిష్యజనాళి బాధునిన్
విదితసమస్తగాథుని వివేకసనాథుని రామనాథునిన్
వదలక కొల్తు నెల్లపుడు వాగ్విభవాప్తికి జానకీపతీ ! 2

ఉ. నీ మహనీయమూర్తి మది నిల్పినవాఁడయి నీదునామమే
పాపుల నెల్లఁ బాపునని భక్తిఁ దలిర్పఁగ సంస్మరించుచున్
నేమముతోడ నెల్లపుడు నిన్ను భజించెను నాదుతండ్రి. ఆ
నామమె నామజిహ్వపయి నాట్యము సల్పుత జానకీపతీ ! 3

ఉ. రామునిభక్తుఁడై పుడమి రాజిలె నాజనకుండు పేర్మి. శ్రీ
రాముఁడె మత్కులంబునకుఁ బ్రాపని పల్కెను బిన్నతండ్రియున్
రాముఁడె దైవమంచు మది రంజిల నిన్ను భజించుచుంటి నేన్
ప్రేమ మదీయవంశ మభివృద్ధికిఁ దెమ్మిఁక జానకీపతీ ! 4

చ. రకమగు నీదునామ మలరన్ దగ నుంచెను నాదుపేరునన్
బ్రకటితభక్తిభావమున రాజిలు నా జనకుండు గాన నే
నొకనిముసంబుగూడ నిను నోపికఁ గొల్వక వ్యర్థపుచ్చ. వే
ఱొకపని లేదు నాకు. వినుమోయి రఘూత్తమ ! జానకీపతీ ! 5

చ. గణపతిఁ గొల్చి యాపయిని గాని మఱొండు శుభప్రకాండముల్
గణన మొనర్ప రెవ్వరు జగమ్మునఁ గావున దంతిరాణ్ముఖున్

ప్రీణతులొనర్చి కబ్బమును వ్రాయుటకై తగఁ బూనువాఁడ వా
క్ప్రణతికిన్ సదా కొలుతు వత్సలతన్ గన జానకీపతీ! 6

ఉ. నా ప్రియశిష్యురాలు మఱి నాదగు ప్రేరణ నీదుగాథఁ దా
నోపిక శ్రీసరస్వతి మృదూక్తుల నింపి రచించె. శిష్యులై
నెపయి నూఱుపద్యములు నిల్పిరి కృష్ణకుమారమిత్రముల్
కాపరినంచు నేను శతకంబునఁ గొల్చెద జానకీపతీ! 7

ఉ. రాజలలామ మీవు కమర జెలునట్లు కవీంద్రు లెందఱో
ఈజగతిన్ శతంబులు రచించిరి నా కృతకంబు. లేను నే
యోజనొ నీపయిన్ శతక మొక్కటి వ్రాయఁగ సాహసించితిన్
తేజమునింపి యీకృతిని దీసికొనన్ వలె జానకీపతీ! 8

ఉ. ఎల్లరు భక్తిపూర్ణులయి యేభవదాకృతి దేవతాళి దా
ముల్లములందుఁ గన్గొనుచునుందురొ దేనిని సర్వరాజ్యులు నే
నోళ్ల నుతించుచుండునొ జనుల్ దగ జానకినాథయు దొర్గ యా
త్వల్లలితాకృతిన్ మదిని దప్పకనిల్పెద జానకీపతీ!

ఉ. పాలసముద్రపు న్నడుమఁ బన్నగతల్పముమీఁద నీటుగాఁ
బాళిఁ బిసాళినవ్వు చెలువంబు ముఖంబునఁ జెంగలింపఁగా
శ్రీలలితాంగిదైన నును చెక్కిలి నొక్కుచు హృద్యమిచ్చుచున్
మేలములాడు నిన్ దలఁతు మించిన వేడ్కను జానకీపతీ! 10

ఉ. భూమి జలంబు మారుతము పుష్కర మగ్ని సమస్తలోకముల్
సోముఁడు సూర్యుఁడు న్మఱియు సూక్ష్మములైన చరాచరంబులున్
నీమహిమన్ జని వనయి నివయి సర్వము నిండియుండఁగా
వేమఱు నిన్నుఁగాంచి కీటు విస్మృతిఁ జెందితి జానకీపతీ! 11

చ. గజవరదాతవైతి. వొకకాంతకు వల్వలొసంగి మానమున్
సుజనులు మెచ్చఁ గాచితివి. సోదరులరాయుని ముద్దుబాలుఁడ
య్యజగరవహ్నివారిగరళాదుల మ్రిందకయుండఁ జేసి. తీ
రుజము హరించి సౌఖ్య మిడు రూఢిగ నాకును జానకీపతీ! 12

చ. కులమును గీర్తిసంపదయుఁ గూర్మియు దాల్మియు సత్ప్రవృత్తియున్
బల మనురాగమున్ సుఖ మపారపుభక్తియు భోగభాగ్యముల్
తలఁగవు ధర్మచింతయు నుదారగుణంబును మానవాళి కి
య్యల దయసేయు నీపదము నే స్మరియింతును జానకీపతీ! 13

ఉ. పావనఁ జేసితీవు గవనసంఘము కొల్లపురమ్మునందు నే
ఈ పరికటంపుసంఘమున కైపనుబంధముగం జెలంగున
ట్లుపవహించు 'రెడ్ లెటరు' గుంపునఁ గూర్చితి మానసపత్రికన్
నీపటిమశక్తి మునుముందుకు నెట్టఁగ నా యిక జానకీపతీ! 14

ఉ. ఎప్పుడు మేలు కాంచి హృదయేశ్వరి సీతను గూడి లీలలం
దొప్పుగఁ దేలుచుందువొ సమ్మదూక్తుల నావెను దన్వి యప్పుడే
త్రిప్పుము నీకటాక్షమయితీవు నను మక్కువ నుద్ధరింపఁగాఁ
జెప్పెడి దేమి నీకు సరసీరుహలోచన! జానకీపతీ! 15

ఉ. పాబినవేడ్క నిన్ గొలుచు భక్తజనంబులలోఁ బ్రధానుఁడన్
డంబము లేనివాఁడను బడాయివహించెడు వాఁడఁగాను. అ
[illegible]ంబునుగోరి నిన్ గొలుచు దాసుఁడఁగాను భవత్కృపాపదా
బ్జం బొకటున్నఁ జాలు సతతంబును నాకది జానకీపతీ! 16

చ. శరణని నిన్నుఁ జేరితిని. సారెకుసారెకు భక్తిమై నమ
స్కరణము నీపదాంబుజయుగంబునకుం దగ సల్పుచుంటి. మేల్
వరమునొసంగి నన్నుఁ బరిపాలనఁ జేయక తప్పదింకఁ జె
చ్చెర నరుదెంచి నాకు దయసేయవె మోక్షము జానకీపతీ! 17

ఉ. దాసులు చేయుతప్పులను దప్పకత్రోయుట నీకు ధర్మమా.
వీసము లోటు సూప కిటు విస్మితభక్తిని గొల్చుచున్న నీ
దాసుఁడనేను. మూఢుఁడ. నితఃపర మేమియు నే నెఱుంగ. నా
దోసములన్ సహించి పరిపోషితుఁ జేయవె జానకీపతీ! 18

ఉ. పొంగినవేడ్క నీదు పదముల్ దగఁ బట్టితి. మూఁడువేళలన్
వంగి నమస్కృతుల్ వినయవంతుఁడనై పచరించుచుంటి,..త

స్వాంగినిగూడి యాత్మను సమర్పణసేయుచునుంటి. సత్కృపన్.
మంగళముల్ లభించునటు మాకు ఘటింపుము జానకీపతీ! 19

ఉ. పాలనసేయువాఁడవని వారక నిన్మదిఁ గొల్చుచుంటి- నే
వేళను నీపదాబ్జములు పేర్మిని గన్నుల నద్దికొంచు నేఁ
గాలము నెట్టుచుంటిని. సుఖంబును గాంచుచునున్నవాఁడ. ని
న్నోలిభజించువారి కిఁక నుండున లోపము. జానకీపతీ! 20

ఉ. నీప్రతిరూపముల్ నిలిపి నిచ్చలు మ్రొక్కనివారు లేరు. నీ
సుప్రథితంబులౌ కృతులఁ జూడనివారును లేరు లేరు. నీ
వప్రతిమానయోగమహిమాఢ్యుఁడ. నాదిగురుండ వెంచఁగా.
నీప్రతిభన్ నుతించుటకు నేరఁ డెవండును జానకీపతీ! 21

ఉ. హెచ్చినభక్తిఁ జందురికు నెల్లరు సేయరె నూలిపోగు? అ
ట్లచ్చపుభక్తి నుత్పలము లర్పణసేయుదు. చంపకమ్ములన్
జెచ్చెర నీపదాబ్జములఁ జేరిచి సారె నమస్కరింతు. నన్
మచ్చికతోడఁ గావఁగదె మాట లిఁకేటికి జానకీపతీ! 22

ఉ. తావకమైన రూపమును దైవతముల్ నుతియింప లేరు. నీ
పావననామ మాహాత్మ్యమును బ్రస్తుతిసల్పఁగఁజాలఁ డెట్టి
సేవకుఁ డట్టినిన్ను స్తుతిసేయఁగలాఁడిఁక? అట్టిగాన న
న్నివె కృతార్థుఁజేయవలె నెట్టులొ గట్టిగ జానకీపతీ! 23

ఉ. రాతిని నాతిఁ జేసితివి. రాజశిరస్కుని విల్లు త్రుంచి. తే
కోఁతులతో వచ్చి సాయపడఁ గూడఁగఁద్రోసితి రావణాసురున్.
ఖ్యాతి గడించినాఁడవు సుఖాన విభీషణు రాజుఁ జేసి. ఆ
సీత నయోధ్యకున్ మరలఁ జేర్చితి పేర్చితి జానకీపతీ! 24

ఉ. నేర్వఁగ లేదు శాస్త్రములు. నేర్పునఁ జేయఁగ లేదు దానముల్.
నేర్వఁగ లేదు వేదములు. నే నెఱుఁగన్ గవితారహస్యముల్.
నేర్వఁగ లేదు సత్కృతులు. నిచ్చలుఁ జేసెదు శక్తి లే. దిఁకే
సర్వము నీవె కూర్తువని సన్నుతి సల్పెద జానకీపతీ! 25

ఉ. భక్తుఁడ నీకు నేను. మఱి పావనతారకనామమంత్రముం
భక్తిదలిర్ప నిచ్చలును భావమునం దలపోయుచుంటి నా
శక్తికొలందిఁ బద్యములు సల్పి త్వదీయయశంబు ధాత్రిన్
వ్యక్తము సేయుచుంటి రవివంశసముద్భవ ! జానకీపతీ ! 39

ఉ. సన్నుతిఁజేసి నీకరుణ నాపయిఁ జూపుచు నెల్లవేళలన్
దిన్నని వాగ్విలాసములుఁ దెల్వియు శక్తియు నిచ్చి ప్రోవవే.
చెన్నలరారు సౌఖ్యమును జెచ్చెర నిచ్చి యనుగ్రహింపవే.
క్రన్ననఁ జేరఁదీయవె. వికాసముఁ గూర్పవె జానకీపతీ ! 40

ఉ. వ్యాపకుఁడీఁ కేమి సేయఁగలనాఁ డితఁడంచుఁ ద్యజింపఁబోకు. మే
కామముఁగోరి నిన్ గొలువనైతి. భవత్పదపద్మ మొక్కటే
ప్రార్థన సేయుచుంటి వినయంబున . నా మనవిన్ గ్రహింపుమో
వార్ధికృతప్రసేతు ! విబుధవ్రాతమాశ్రితీ ! జానకీపతీ ! 41

ఉ. తన్నుఁ గూడ నిచ్చలును ధర్మముఁదప్పని పదదాంబమే
న స్వతలందు ముంపక ఘనంబుగ నేలునటంచుఁ గొల్తు. మే
న స్వకీస్వ్య తేజముఁ. గనం ద్వదనుగ్రహముంచుఁదోఁచె. ఐ
న న్వపయింపఁ బ్రోతునని నమ్మికఁ గల్గఁగ జానకీపతీ ! 42

ఉ. నమ్మితి నీపదాబ్జములు నన్ దయఁ బ్రోవఁగఁ జేయునంచెదన్.
నమ్మితి నీస్వరూపమును నామదిఁ జాలఁ బ్రసన్నమైనటుల్.
నమ్మితి నీపరాక్రమము నాకలుషంబులఁ గూల్పునంచు. చింతల్
నమ్మి భజించెదన్ ద్రికరణంబులచే నిను జానకీపతీ ! 43

ఉ. నిక్కము సెప్పుచుంటి మది నేను ద్వదాకృతి సంస్మరించుటే
తక్క నితఃపరంబెఱుఁగఁ. దానికి పాదముతక్క నన్యమున్
దిక్కని నమ్మలే దెపుడు. దీనుఁడఁగావున నాదొసంగు స
మ్యక్కృపతో క్షమింపఁదగదా ? పెఱనాఁడన ? జానకీపతీ ! 44

ఉ. నే మొఱవెట్టుచుంటినని నేస్తమునం జనుదెంచి వేగ బి
ట్టేమిడువారు లేరు, గద ! యూఱక యిట్లు తపించుచుంటి నా

చ. చెలువుగ భద్రపీఠమున సీతనుగూడి విలాసలోలతన్
గలకల నవ్వుకొంచు రహిఁగన్పడుచుందువు భక్తకోటికి. కా
విలసితమే త్వదాకృతిని బ్రేమదలిర్పఁగఁ జూపరాదొకో
యిలనయినన్ గృపామతిని గన్పడరాదొకొ ? జానకీపతీ ! 52

ఉ. నీ కరుణాసుధారసము నీరజశత్రుఁడు నీరజాప్తుఁడున్
బ్రాకటభక్తిఁ గ్రోలుదు రనారతమున్. మునికోటు లెప్పుడున్
వాకొనుచుం గ్రొమహిమ వాకిటనుండుచు. నిన్ను దేవతా
నీకము గొల్చు- పుణ్యమన నిక్కము వారిదె జానకీపతీ ! 53

ఉ. నీకు సమానులై యెవరు నిల్వరు. నీసరిదైవతంబు ము
ల్లోకములందుఁ గాన. మదిలో నినుఁగొల్చి కవిత్వకల్పనో
ద్రేకము చేత నీకయి నెటిన్ రచియించితి నూటపద్యముల్.
నాకృతిఁగొంచుఁ జేయుమిఁక నన్ గృతకృత్యుని జానకీపతీ ! 54

చ. వనరుహసంభవాదులును వర్ణనసేయఁగ లేరు నిన్ను. ఏ
మని యిఁక నేను జేయఁగల. నైనను సాహసమూని యెట్టులో.
నిను నుతియింపఁబూనితిని నేర్చినరీతి. దోసంగులుండినన్
కనికరముంచి యేరికిని గన్పడనీయకు జానకీపతీ ! 55

ఉ. ఆదికి నాదియైన పరమాత్ముఁడు నీవని నిశ్చయించితిన్
నామనమ్ములోపల ఘనమ్మగు భక్తి నిగుడ్పఁజేసి నే
నీదయఁగాంచుకోర్కెమెయి నిన్ననయమ్మును గొల్చుచుంటి. నా
మీఁద భవత్కృపారసము మిక్కిలిచిల్కుము జానకీపతీ ! 56

చ. అతులితమౌ తపంబు గొనియాడఁగ జేయు మునీశ్వరాదు ల
ద్భుతమగు నీప్రభావమును బూర్తిగ వాకొనలేకయుండ దు
ష్కృతమతినైన నాకు నెటు చేకుఱు నిన్ను నుతించు భాగ్య ? మీ
శతకము వ్రాయమాత్ర మెటొ సాహసమూనితి జానకీపతీ ! 57

ఉ. నీ కరుణాకటాక్ష మెవనిం గను ధన్యునిఁజేయు వాఁడెపో
శ్రీకి నివాసభూతుఁడయి చిక్కనికీర్తి సంతరించి లో
కైకవిధంబుగన్ వెలుఁగు నింపును నందును. గాన నాపయిన్
నీ కరుణాకటాక్షమును నిల్పి కను గొను జానకీపతీ ! 70

ఉ. ధీమతినైన పెండ్లమును గురుని దమ్ముని గూడి కానన
స్థామమునం జరించి మాతనుష్ఠత నందు వసించు సంయమి
గ్రామము నోముచున్ భువనకంటకు రావణు గూల్చి యాతటన్
క్షేమముగూర్పనే కొక్క కృతకృత్యులయస్థితి ! జానకీపతీ ! 71

చ. తనయులపైని భార్యపయిఁ దద్దయు బ్రేమఁ జేయుట సాజమె
వ్వనికిని. భేదముండదిల స్వామికి భృత్యున. కింతగాన నా
తనయులు భార్యయుం దలఁపఁ దావకులే కదె ! కంటె వారికిన్
దనరెడు భాగ్య మిచ్చి సతతం బును బ్రోవుము జానకీపతీ ! 72

చ. తనయులు చిన్నవారు. విదితంబుగ దా సతి చిన్నది చుమీ ! కా
డును మది నెంచిచూచినఁ గనుంగను దక్కవ వాఁకుఁగాండు. ఇ
ట్లని ముఖచిహ్నములన్ గనయంతని సత్యము చెప్పి చెప్పఁగ. నే
యనువునఁబ్రోచెదో ? సుఖములం దగఁజేయుచు జానకీపతీ ! 73

ఉ. ప్రాణముపోవువేళ నిజబంధులు పుత్రులు పెండ్లి మాప్తులున్
గోణముగూడఁ దీసికొని కూర్మిరత వీడి గమింతురి. తద్దయున్
రాణఁ జెలంగునప్పు డెదురన్ వసియింతిరిటుగాక నీవు నా
ప్రాణము పోవునప్పుడయినన్ ద్యజియింపకు జానకీపతీ ! 74

ఉ. ధర్మ మధర్మమున్ సువిదితంబయి యుండుటఁజేసి నేను స
త్కర్మములాచరించుచును దప్పక కల్గను మోక్షమంచు నా
నిర్మలమానసంబున వినీతుఁడనై నినుఁ గొల్చుచుంటి నే
కర్మమెఱుంగఁజూవె యిదిగాక రమాపతి ! జానకీపతీ ! 75

ఉ. పాత్రికటతావకీనపదపంకజయుగ్మమునందు భక్తి శో
భాకరమైన నీదు మృదులాంగము లెప్డును మానసంబునన్
వీక వసింపఁజేయుటయు నేను భువిన్ మనుసంత కాలమున్
నాకు ననుగ్రహించుటకు నమ్రతఁ గొల్చెద జానకీపతీ! 76

ఉ. నీమృదుపాదపద్మముల నిశ్చలభక్తిని శ్రేయమిచ్చు త్వ
న్నామజపంబు భూమిసుతయి నాఁటిసు మేటి వనాటపుంగవున్
నీ మహనీయకార్యములను నేనుముఖంబొనరించు మారుతిన్
సమహితాత్మునిన్ గొలుతుఁ దీరనిభక్తిని జానకీపతీ! 77

ఉ. మేటిబలమునం గడలిమీఁదుగ లంకకుఁ జేరఁబోయి య
న్నాటు భవన్నిమిత్తముగ వేదనఁజెందుచునున్న సీతయా
రాటము మాన్పి యాపె కుశలంబును నీ కవలీలఁ జెప్పఁడే
సాటిగ నాంజనేయుఁ డతనిన్ భజియించెద జానకీపతీ! 78

చ. పరమపతివ్రతాత్వమునఁ బ్రాయము కొంత క్రమించి భర్తని
ర్జరపురమేలఁ గొల్పుపురరాజ్యము దానును నేలుచుం బ్రజా
దరణము దైవభక్తియును దద్దగఁ గడించిన రత్నమాంబ శ్రీ
కరముగు నాయుష్మంతులఁ గాంచఁగఁ జేయుము జానకీపతీ! 79

ఉ. ఆ జగదీశ్వరుండు కరుణాళువు సద్గుణసాగరుండు వి
భ్రాజితవైభవోన్నతుఁడు భాగ్యమభాగ్యము వ్రాయు బ్రహ్మ తా
నా జతనానఁ దోడుపడి నన్ గృతకృత్యుని జేయుఁ బొంటె నే
నోజ భజించువాఁడ మహిమోజ్జ్వలు నాతని జానకీపతీ! 80

చ. చిరుసగ వంకురింప సరసీరుహము ల్లగు నీదుపాదముల్
కరముల నొత్తుచున్ మిగుల గారవమొప్ప భజించు సీతమన్
కర మనురక్తితోడ బిగికౌఁగిటఁ జేర్చి సుఖించునీవు న
న్నణుమణులేక బ్రోవవలె నార్య! రఘూత్తమ! జానకీపతీ! 81

చ. మనమున శాంతిఁబూని నియమంబులు తప్పక తీర్చి యుష్మదా
శ్రితనవీనయుగ్మముఁ గొల్చి కేవలభక్తి నమస్కరించి య
ర్చనలొనరించువారలను సాకతకేతన నన్ను సాకుమా
చనియమున వేఁడువాఁడను దయన్ నను బ్రోవుము జానకీపతీ! 95

శా. ఈ యఖిలప్రపంచమున కీవ విభుండవు. నీ యనాద్యన
నూయనతుంగ నాతరమె? మానుష వేషము దాల్చినట్టి నా
రాయణమూర్తివి. వనచరావళి గొల్వ ఘనేంద్రునిక్క వి
చ్చేయుము. దర్శనం బిడుము. స్నిగ్ధతిపూర్తి! జానకీపతీ! 96

ఉ. అవ్యయ మప్రతర్క్య మఖిలాశ్రయ మక్షయ మాద్య మాన్యమై
సవ్య మనం దనర్చు పరతత్త్వము నీవయి సృష్టిసాధన
ద్రవ్యగుణాత్మకత్వమునఁ దాలుతు నీతను వెంతొ. చూపు మ
ద్దివ్యశరీర మిమ్మ్యెడలఁ దివ్యగ నాకిఁక జానకీపతీ! 97

ఉ. ధర్మమునం బ్రజాహితము. ధర్మము నెమ్మది నేర్పు. లార్యులన్.
గూర్మివహింతు. ధర్మమును గూర్పక యే యరిప్రయత్నము చెందరు. దు
ష్కర్ములు భీతిఁజెందుదురు. శత్రులడంగుదు రమసిద్ధమౌ
నిర్మలకీర్తియున్ ధరణి నిల్చుఁ జిరంబుగ జానకీపతీ! 98

ఉ. ప్రాయనిభక్తి నీపయిని వ్రాసితి నీశతకంబు నేను. సు
శ్రీయుత వాజపేయకులసింధుశశాంకసముండ రామను
బ్రాయుఁడ నీదుభక్తుఁడ విపన్నుఁడ. దీనిఁ బ్రేమతోడుతన్
స్వీయవిభూషణంబుగను జేకొని ప్రోవుము జానకీపతీ! 99

చ. జయజయ సాధురక్షణ! విచారవిచక్షణ! సారసేక్షణా!
జయజయ సర్వకారణ! నిశాచరదారణకృష్ణహారణా!
జయజయ సత్యభావన! సుజన్యసుభావన! లోకపావనా!
జయజయ మంజుభాషణ! లసత్కులభూషణ! జానకీపతీ! 100

చంద్రికా ముద్రాక్షరశాల : గుంటూరు

# అభినవ సరస్వతి

సంపాదకుడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును ప్రకటింపబడును. చందా సం॥ 1 కి రు 3—0—0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విరూపాక్షపీఠగురుపరంపర ... | 0 | 2 | 0 |
| 2 | నీతిగీతులు (సుమతిశతకము, దానికి శ్లోకములు) ... | 0 | 2 | 0 |
| 3 | వాసంతికాపరిణయ నాటకము ... | 0 | 4 | 0 |
| 4 | కరిణీశోద్ధారిణి [పూరి వీరభద్రకవి] ... | 0 | 4 | 0 |
| 5 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | 0 | 2 | 0 |
| 6 | వత్సలనీతిశతకము ... | 0 | 1 | 0 |
| 7 | చమత్కారమంజరి (ప్రాచీనప్రబంధము) ... | 0 | 4 | 0 |
| 8 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివేంకటీయము) | 0 | 3 | 0 |
| 9 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) ... | 0 | 6 | 0 |
| 10 | సంగదోషము ... | 0 | 3 | 0 |
| 11 | పశ్యశబ్దవిచారము ... | 0 | 2 | 0 |
| 12 | పుళిందా వివాహము ... | 0 | 4 | 0 |
| 13 | తిరుపతివేంకటేశ్వరతత్త్వము ... | 0 | 1 | 0 |
| 14 | పురశ్చరణము ... | 0 | 2 | 0 |
| 15 | విగ్రహారాధన ఖండనఖండనము ... | 0 | 4 | 0 |
| 16 | శంతనురాజచరిత్రి (ప్రాచీనప్రబంధము) ... | 0 | 14 | 0 |
| 17 | వర్ణవ్యవస్థ ... | 0 | 4 | 0 |
| 18 | స్వర్ణకారవ్యవహారము ... | 1 | 8 | 0 |
| 19 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము ... | 0 | 10 | 0 |
| 20 | సూతసంహిత (ఆంధ్రము) ... | 2 | 0 | 0 |
| 21 | భారతీయప్రబోధము (పిడుపాటి చిదంబరశాస్త్రి) | 0 | 4 | 0 |
| 22 | అభినవశాకుంతల నాటకము ... | 0 | 8 | 0 |
| 23 | ధర్మనిర్ణయము. | 0 | 4 | 0 |
| 24 | అస్పృశ్యతానివారణ ఖండనము(మల్లాది రామకృష్ణ చయనులుగారు) | 0 | 8 | 0 |
| 25 | భారతీక థాతత్త్వనిర్ణయము ... | 0 | 4 | 0 |
| 26 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము ( ౧ సంపుటము ) | 1 | 0 | 0 |
| 27 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | 1 | 8 | 0 |
| 28 | డిటో నాగరఖండము (3 సంపుటము) | 1 | 8 | 0 |

అభినవసరస్వతీకార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,
గుంటూరు జిల్లా.

శ్రీమత్పరదేవతాయై నమః.



# ఆరోగ్య వేంకటేశ్వర
# రాజరాజేశ్వరీ శతకములు.


గ్రంథకర్త,

వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడు, బి.ఏ.

కొల్లాపురం,

(శ్రీజటప్రోలు సంస్థానము).



శ్రీగౌరీముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపఁబడియె.

నూజవీడు.

**1931.**

శ్రీమత్పరదేవతాయైనమః

# పీఠిక.

చదువరులారా!

నేనీపద్యములను వ్రాయుటకుఁ గారణము నాకుఁగల చిక్కులే కాని పెద్దకవినని లోకమునకుఁ జాటుటకుఁ గాదు. ఆచిక్కెట్టిదియో యాయీపద్యములయం దచ్చటచ్చట స్ఫుటమగుచునే యుండును గాన నేనిట వేఱుగ వ్రాసికొనవలసినపనిలేదు. వ్యాధిరూపమైనచిక్కునకు నౌషధసేవ చేయవలయునే కాని పద్యములు వ్రాసికొనిన నేమి ప్రయోజనమని కొందఱనవచ్చును. కాని మనపూర్వులు వ్రాసిన రీతి యిది.

"పూర్వజన్మకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే।
తచ్ఛాంతి రౌషధైర్దానైర్జపహోమసురార్చనైః॥"

పూర్వులు సురార్చనమును గడపటిసాధనముగా వ్రాసియుండఁగా మాపరమగురువులు దానికే కొన్నివిషయములయెడఁ బ్రాధాన్యమునిచ్చిరి చూడుఁడు.

మ. పడిసెంబో, తలనొప్పియో, జ్వరమొ సంప్రాప్తించుచో వైద్యులం
దడవన్ లాభముగల్గినన్ గలుగు దుర్దాంతవ్యథాభారముల్
గుడువన్ దాపగుచోసఖుండెటఁగితాఁ 'గుయ్యోమొఱో'యంచునీ
యడుగుల్ వట్టుట యేరుజాపనయనోపాయమ్ము కామేశ్వరీ.

పై వారియుపదేశమునకుఁ దార్కాణగా నాకు నౌషధసేవకంటె దైవతారాధనమే యుపశాంతినిచ్చినది. ఇంతకును భావనముఖ్యము.

"భావనాయదిభవేత్ఫలదాత్రీ మామకం నగరమేవహికాశీ"

అని యభియుక్తోక్తి. సరియే. మహాకవులగు మయూరాదులు నిరాఘాటపాండిత్యముతోపాటు నిరర్గళవాక్సిద్ధికూడఁ గలవారగుటచే నట్లొనర్చిరిగాక. యేనో రెండు జల్లిపదములనెట్లో జతకూర్చు నీవ్రగూడ

సత్ప్రయత్నమునే చేయుదువా? యని యెల్లరును గాకున్నను వృథా కలహాకారకులగు కొందఱు నన్ను నెగతాళి చేయుదురని యెఱుఁగుదును. నన్నెగతాళిచేయువారు చాల సుప్రసిద్ధులు. నేనో,

"వారిపాకరజంబుఁబోలనివాని నన్ను మనుష్యసం।
సారిఁగోరఁగఁజన్న"

అను తెగఁలోవాఁడను వారు సంస్కృతాంధ్రపాండితికలవారు. నేనో పొట్టకొఱకై యితరభాషనభ్యసించుచు,

"స్వస్థానవేషభాషాభిమతాః"

అను దానిననుసరించి యెట్లో రెండుతెలుఁగుముక్కలకై యత్నించి కృతార్థతనందనివాఁడను. ఇట్టిస్థితిలోనున్న నన్ను విమర్శించుట యను పిరుచ మందలించుట నాపూర్వజన్మపుణ్యముకాక వేఱుండదని భావించుచు సవ్వారికి మనః పూర్వకముగా నెల్లపుడు నమస్కరించెదను.

"కాకిబిడ్డ కాకికిముద్దు"

అను సామెతనుబట్టి యితరులకు బాగుగ నుండకున్నను నెవని కవిత్వము వానికి బాగుగనుండవలయును. నాకవిత్వముపై దానికి భిన్నముగా నాకే బాగుగనుండదు. దీనినితరులెట్లు మెచ్చికొందురు. అగుచో మానవలయునే? మానుచో దైవతారాధనమెట్లు? ఊరక వచనరూపమునఁజేయరాదా? పద్యములేల? ఇట్లనేకములు ప్రశ్నలు వచ్చునని నేననుకొనుచున్నాను. ఈపద్యరచన నాకభ్యాసార్థమని తజ్ఞులు నన్ను క్షమింపఁగలరు. ఎన్నఁటికేని మంచికవినగుదునేమోయనియాశ.

"యత్నే కృతే యదిన సిద్ధ్యతి కోఽత్ర దోషః"

ఇంతతో ముగించుచున్నాఁడను.

రామసుబ్బారాయుఁడు.






# ఆరోగ్య వేంకటేశ్వర శతకము.



ఉ. శ్రీకరసౌఖ్యసంపదలు చేకుఱునంచు మదిందలంచి స
త్ప్రాకటభక్తిమీఱునటు ప్రస్తుతిసేయఁగ నెంచినాఁడ ని
న్నోకరుణాసముద్ర! మహితోన్నత దివ్యపదంబునందఁగా
నీకరుణాకటాక్షమును నిల్పుమ, నాపయి వేంకటేశ్వరా!

చ. తిరుపతి వేంకటేశ కవిధీవరు శ్రీపదకృష్ణమూర్తినిన్
వరగుణుఁడా నృసింహకవి భద్రుని శ్రీయుత రామనాథునిన్
గురుతరభక్తిభావములు గూర్చి భజించుచునుంటి నాత్మలో
గురులనిసమ్మి నేఁడిపుడు గోరిభజింతును వేంకటేశ్వరా!

చ. అనుదినమున్ భజించెద సమంచితభక్తిని దాల్చుచుండి నా
జనకుని రామనాథుని ప్రసన్నదయాపరుఁ రామభక్తునిన్
మనమునమాటిమాటికిని నన్నును నాదగు భార్యనున్ గుమ
రునిపయినుండిచూడుమని ప్రోవుమటంచును వేంకటేశ్వరా!

ఉ. మ్రొక్కెదసోమనాథునకు మ్రొక్కెదనిత్యమురామయాఖ్యునిన్
మక్కువమీఱనంజలి సమంబుగఁదాల్చి విశేషభక్తితో
మ్రొక్కెదరామమాంబకును మ్రొక్కెద శ్రీయుతలక్ష్మిదేవికిన్
పెక్కనభక్తితోడ నను నెమ్మియిఁజూడఁగ వేంకటేశ్వరా!

ఉ. మోదముతోడభక్తిమెయి మ్రొక్కుచునుంటినిదోసిలొగ్గి నా
సోదరునప్పయాఖ్యుని విశుద్ధచరిత్రుని దైవభక్తునిన్
నాదగు మిత్రబాంధవుల నమ్మిభజింతుమదాత్మలోన నీ
వే, దయసూపఁగావలయు వేగమప్రోవుము వేంకటేశ్వరా! 5

ఉ. నాదగుప్రాణమిత్రులను నమ్మిభజించెద నాత్మగోపలన్
శ్రీదయివారసౌఖ్యతతి జేరునటంచుఁ దలంచి భక్తిమై
మోదముగూర్చి నాజనని పుణ్యవతీసతిఁ సుబ్బమాంబనున్
నాదయితామణీయుతుడనై భజియించెద వేంకటేశ్వరా! 6

ఉ. నాకును నాదుభార్యకును నాదగుపుత్రుఁడు వేంకటేశునున్
బ్రాకటసౌఖ్యసంపదలు బాగుగ లేవని మద్గురూత్తమున్
శ్రీకరవేంకటేశ కవిసింహుని వేఁడితి భక్తిభావముల్
వ్రాకఁగఁజేసి యాపయిని భవ్యపదంబుగనంపె దీవనల్. 7

మ. తనపుత్రుండటు రోగబాధలకు సంతాపించి స్రుక్కంగఁజే
యనుదానద్దియ మాయజేయవలెనంచారోగ్య కామేశ్వరీ
యను గ్రంథంబునువ్రాసెనక్కతననే యారోగ్యమున్ గల్గెఁ బు
త్రునకున్ నాకదియందఁజేసెమిగులన్ దోరంపు ప్రేమంబునన్.

ఉ. దానినిజూచియంతయు యథావిధిభక్తిఁబఠించితంతఁ బ్ర
జ్ఞానిధిలేకపోయినను గల్గెమనమ్మున మద్గురూత్తమున్
శ్రీనియమంబుదాల్చుచు భజించెనుగోర్కెఁ; యతించితీవిధిన్
దానసుఖంబుగల్గునని తథ్యముసెప్పితి వేంకటేశ్వరా! 9

ఉ. అందినలేఖఁజూచి తమరంతగ ప్రేమరసంబు నాపయిన్
జెందఁగఁజేసి శీఘ్రమొరదించిరి పద్యముతోడ నాశిషం
బందెఫలించెఁగోరికలు హర్షపయోధిని మున్కవెట్టితిన్
డెందమునందు మిమ్మెపుడు దీర్చిభజించెద దైవరాయనన్.

ఆరోగ్య వేంకటేశ్వర శతకము.

మ. భవదత్యంతకృపారసంబుఁ జిలుకన్ బ్రాప్తించె నారోగ్యవై
భవకాంతుల్, ప్రసరించెబుద్ధి, తనరెన్ భాగ్యంబు, లోలోపలన్
దెవులున్ బోఁదొడఁగెన్ సుఖంబుగలిగెన్ దేజస్సుహెచ్చెన్ [వెసన్
నవనీతంబగు నీహృదబ్జమెపుడున్ నాయందునిల్వన్ గదే. 1

శా. భావంబందుననిన్ను సద్గురునిగా భావించి పూజించెదన్
నీవేనన్ను సముద్ధరింపగల సుస్నేహప్రభావంబునన్
బ్రోవంగాఁగలమేటిమిత్రుఁడవు నాపూఁబోఁడియున్ మీఁరలే
దైవంబంచు భజించుచుండె నెపుడున్ ధర్మంబు గాపాడుచున్

మ. భవదత్యంతకృపాకటాక్షకల నాభాగ్యంబు నాకబ్బటన్
గవితాధోరణికొంతనాకు దొరకంగా మిత్రులంగూడి నీ
కవితాసారముగ్రోలుచుంటి నెపుడున్ గాలంబునెట్టంగ, సం
భవమయ్యెన్ గద తెల్విమీఁరటుల నాపైఁ బ్రకాశింపఁగన్.

శా. నీవేనాదగుదైవమంచు నెదలో నిక్కంపుసద్భక్తితో
భావంబొప్ప భజించుచుంటి నెపుడున్ బ్రావీణ్యమేపారఁగా
బ్రోవంగాఁదగువాఁడ భక్తుఁడను సమ్మోదంబునంజూడుమో
దేవా! తిర్పతివేంకటేశ్వరగురూ! దీనుండనుబ్రోయఁడన్.

గీ. గురుఁడుచూపిన త్రోవను నరుగుటే, శు
భంబు శిష్యునకనియెంచి భక్తి భావ
ములను సమకూర్చి వ్రాయంగ మొదలుపెట్టి
నాఁడ సౌఖ్యమ్ముగాంచుచున్నాఁడనిపుడు.

గీ. గురుఁడురచియించెననుచు నేనురచన నొన
రింప దొరఁకొనుటకు గర్వరేఖకలుగ
కాదు, యంతటివాక్సిద్ధి కలుగకున్న
మూఢ భక్తిచే భగవంతుఁబొగడరాదె?

చ. ప్రతిదినమున్ బరాత్పరుల భవ్యుల శ్రీయుత దేవదేవులన్
నతియునునేనునుంగలిసి చక్కఁగఁ గొల్చుచునున్నవారమో
యతులగుణాఢ్య! యైనను సమస్తమునీవని యాత్మలోన నెం
చితినిలువేల్పువౌట నిటు నిన్నుభజించితి వేంకటేశ్వరా! 17

మ. ఇలువేల్పై తగు వేంకటేశ్వరుఁడ వెంతేసిన్ సుఖానందముల్
కలుగంజేయుచు రోగబాధలటు కూలంజేసి మద్భార్యకున్
జలనమ్మొప్పఁగ రాని సౌఖ్యమును నిచ్చుల్ గూర్చి రక్షింపుమా
బలమున్ ధీబలమున్ వహించియెసఁగన్ బ్రార్థింతునిన్నే మదిన్.

చ. గురులపయిన్ వహించి సమకూర్చినభక్తియనిక్కమేని, నా
గురులనె దైవమంచుదగఁగొల్చిన భావమునిక్కమేని, దు
ర్భరమగురోగబాధలను బాపుమ నాదగుభార్యకున్ వెసన్
గురుబలమిచ్చిబ్రోవుమ నినున్ భజియించెద వేంకటేశ్వరా!

ఉ. నీకృపమాపయిన్ బఱపి నిత్యము సౌఖ్యముగూర్చుభాగ్యముల్
మాకునొసంగిరోగమును మాయఁగఁజేయుమ నాదుభార్యవేఁ
బోకలనీదునామమునె మందుగ భక్తిస్మరించుచుండు, లేఁ
బోఁకలపోవమార్గమును బోధనసేయుమ వేంకటేశ్వరా! 20

ఉ. నాతనయున్ సతీమణిని నన్నును నీకరుణాకటాక్ష వి
స్ఫీతసగౌరవోన్నత విశేషవిలాసరుచుల్ వహించి, సు
శ్రీతనరంగఁబ్రోవుమిఁకఁ జేరి నమస్కృతులిచ్చుచుంటి మి
ష్టేతగురీతిభక్తిమెయి నిమ్ముగఁజూడుమ వేంకటేశ్వరా! 21

ఉ. నీవమదీయదైవమని నిత్యము వేడుచు దోసిలొగ్గి సం
భావనఁజేసి భక్తిమెయిఁ బ్రార్థనసేయుచునున్నవాఁడ నో
దేవ! మహానుభావ! వెనుదీయకమానసతుల్ గ్రహించి, మ
మ్మీవె, కృపాకటాక్షమున నేపుగఁజూడుమ వేంకటేశ్వరా!

చ. తపములు సేయఁగాఁ దగిన దార్ఢ్యము లేదు శరీరమందునన్
జపములు సేయఁగాఁ దగిన సత్త్వగుణంబును లేదు మాయెడన్
విపులమనఃప్రమోదమున విశ్రుతి కెక్కిన నీస్వరూపమే
యెపుడు స్మరించుచుంటిమి, వహింపుము ప్రేమను వేంకటేశ్వరా!

చ. మొలకల బాధ చేఁ దనువు పూర్తిగఁ జిక్కె మదీయభార్యకున్
బలగుణముల్ క్షయంబుగని ప్రాణము మీఁదను నాస పోయెఁ గ
వలబలహీనమై బ్రదుకు వ్యర్థమటంచును రోఁత పుట్టఁగా
వలవల నేడ్చుచుండెఁ దగు ప్రాపును జూపుము, వేంకటేశ్వరా!

ఉ. ఔషధసేవలన్నియును సాంతముగా నడిపించినాను, ఆ
దోషమదెట్టిదో మదికిఁ దోఁచదు వైద్యశిఖామణుల్ సదా
పోషణఁ జేయు మందులను బోయుచునుండిరి ప్రాక్కృతంపు దు
ర్దోషము చేనవన్నియుఁ బ్రదోషములైనవి వేంకటేశ్వరా! 2

చ. విసువు జనించె నా మనము వేఁగుచునున్నది నాదుభార్యకున్
విసువు జనించె నెమ్మనము భీతికి దావలమయ్యె, మందులున్
విసమగుచుండె ధైర్యమును వీడుచునుంటిమి తోఁచదయ్యె న
బిసరుహనేత్ర! ప్రోవుమిఁక వేగమ సత్కృపఁ వేంకటేశ్వరా!

చ. సుతుఁడును రోగబాధలకు స్రుక్కుచునుండెను నాఁడు నాఁటికి
సతియును మిక్కుటంబగు విషాదముచేఁ గృశియించుచుండె, న
మతి చెడిపోయె భార్యకుఁ బ్రమాదము వచ్చునటన్న భీతిచే
నిష్కృతి తోఁపదెట్లయిన నీవె శరణ్యము వేంకటేశ్వరా!

చ. సతతము వీరికై తగిన చాకిరి చేయఁగలేక దార్ఢ్యమున్
బతితము నయ్యె నెద్దియును నాకు స్ఫురింపదు నాత్మలోనఁ గౌ
ద్ది తెఱవుః కాలమెట్టులో గతించుచునుండె భవత్పదంబునం
దతివినయమ్మునన్ బ్రణతి హర్షమొసఁగుము వేంకటేశ్వరా!

చ. తెప్పలనుమాటలేక గణుతింపఁగఁజాలిన శక్తినిచ్చి, యి
బ్భువనమునందు నా చిగురుబోణిని నాసుతునిన్ శుభంబుగా
నవిరళసౌఖ్యసంపదల నందఁగఁజేసి భవత్కృపా కటా
క్షవిధులచే నిరంతరముఁగావుము శ్రీయుత వేంకటేశ్వరా! 29

చ. ఎవరేది చెప్పినన్ వినుచు నెంతయు నౌషధసేవసేయుచున్
దెవులు తొలంపలేదని మదిన్ గడుదుఃఖమునందు మున్గుచుం
డి, నలయు ధైర్యమున్ గనక నెట్టుదునంటిని గాలమెట్టులో
యవిరళసౌఖ్యమీయుఁడగదా? యిలువేలుప! వేంకటేశ్వరా!

చ. పతిహితభక్తిచే నెలయు భామిని నాదగుభార్య; నన్ను స
మ్మతిసతిధర్మమున్ విడని మానిని చందముగూడియుండు, స
త్సతి, పతియన్న దైవమని తప్పక గొల్చెడుసాధ్విగాన శ్రీ
యుతమగు సౌఖ్యసంతతుల నొప్పఁగఁగూర్పుము వేంకటేశ్వరా!

ఉ. బాలుఁడు చిన్నవాఁడగుట బాలునితప్పులు దల్లిదండ్రులే
పాలనచేయఁగావలయు వాదముతోఁబనియేలనాకు? నా
బాలునిబ్రోవఁగాఁదగిన బాధ్యతనీపయిబెట్టినాఁడ, నే
లీలనుజూచెదో చెవుమ శ్రేయముఁగూర్పుము వేంకటేశ్వరా!

చ. జనకుఁడునున్నకాలమున సర్వసుఖంబులఁబొందినాఁడ, నా
జనకుఁడు స్వర్గమేగఁగ బ్రసవ్యములయ్యెఁ బ్రసక్తులన్నియున్
జనకునిఁబూజసేయుటది సత్యమటంచుఁ దలంచితేని నె
మ్మనమున శాంతిగూర్పుము ప్రమాదముగావుము వేంకటేశ్వరా!

ఉ. ఈ వెలుగంగరాని పనులెవ్వియుసేయుటలేదు, చేసినన్
బ్రోవఁగరానివెవ్వి? యిలఁబుత్రునిగాంచెడు తండ్రిరీతి నా
భావముమాత్రినన్ దుదకు భారమునీయదిగానపైఁచి, యే
త్రోవనుబోవుచో శుభము దోఁప్పఁడునప్పుము వేంకటేశ్వరా!

ఉ. నీమముతోడ నీపదమునేమఱినమ్మి భజించుచుంటి, నా
కేమియునాశలేదు గమనించిన నాసతియున్ సుతుండునున్
బాములఁబొందకుండఁగనుమా, యలరోగపుబాధమాన్పుమా
సామముఁబోధసేయుము ప్రసన్నగుణాకర! వేంకటేశ్వరా! 35

చ. నినుభజియించుచుందునసవన్ భయభక్తియుతంబుగా సతం
బునునుతియించుచుంటిని ప్రపూర్ణమతిన్ భవదీయనామమున్
మనమునసీస్వరూపమునె మాటికిమాటికి నిల్పుచుందునో
వినుతగుణప్రభావ! ననువేగరుణింపుము వేంకటేశ్వరా! 36

చ. చదివితినాంగ్లభాష నటుసాంతముగా పయిఁగొంత తెన్గు నా
సవిమలవేంకటేశ కవిచంద్రునియొద్దఁ బఠించినాఁడ, స
మ్మదమున నారసింహకవిపూజ్యుని శ్రీయుతరామనాథునిన్
వదలక కొంతనేర్చితిని నన్నెటుచూతువొ వేంకటేశ్వరా! 37

ఉ. పంచమవేదమైతగు భారతమంతయు నాంధ్రభాషలో
మించిరచించె నెంతయును మేలగురీతిని కృష్ణమూర్తియం
చంచితకీర్తిగాంచిన సమర్థుఁడటంచునుతించినాఁడ, నే
వంచనసేయ నెవ్వరిని వర్ధిలఁజేయుము వేంకటేశ్వరా! 38

చ. తెనుఁగునఁగైతముబ్బుటకుఁ దీర్చిపఠించితి వారిగ్రంథముల్
మనమునమాటిమాటికి నమస్కృతులిచ్చుచు, వారినామముల్
పనివడి భక్తిభావములు బర్వగజేసిజపించుచుంటి, నే
యనువుననైనఁబ్రోవఁదగదా? యిలువేలుప వేంకటేశ్వరా! 39

చ. చదువఁగలేదుశాస్త్రములు సమ్మతినేర్వఁగలేదు వేదముల్
చదువఁగలేదుకావ్యములు చక్కనిధోరణిలేదొకింతయున్
జదివినవిద్య కొంచెమయినన్ భయభక్తియుతంబుగాఁగ నీ
సదమలపాదపద్మమును సమ్మతిఁబట్టితి వేంకటేశ్వరా! 40

చ. తిరిగితి నెల్లదేశముల దిక్కులకేగితి నీదుపాదసే
వ గొనితి దివ్యతేజము సమంచితభక్తిని మ్రొక్కితిన్ గిచ్చి, నే
సరిగితి నాదుదేశమునకంతట నీకరుణాకటాక్షమున్
బరఁగుటఁ బుత్రలాభమున వర్ధిలుచుంటిని వేంకటేశ్వరా! 41

ఉ. అంతట నాకుమారుఁగని సాంతము సంతసలాభమొంది నీ
చెంతకువచ్చినంతటను చేకొనినట్టి సుభాగ్యమంచు నే
నంతట నీదునామము సమస్తశుభప్రదమంచుఁ బిల్చి నా
నెంతయు నాకుమారునటులే, యిదిసత్యము వేంకటేశ్వరా!

ఉ. పుట్టినయింటికిన్ మిగుల పుణ్యముగూర్చెడు మేలుబంతియై
మెట్టినయింటికిన్ శుభమునిచ్చెడురీతిఁజరించు సాధ్వియై
పట్టిన ప్రాణనాథు పదపద్మము వీడని భామయైదినాల్
నెట్టుచునుండె నాసతిగణింపుము శ్రీకర వేంకటేశ్వరా! 43

చ. బలమటువచ్చినంతట శుభప్రదమౌనటు నీదునామమం
దలి మధురాక్షరంబులను దప్పక భక్తిభజించుచుండు నా
లలన, యిదేప్రమాణవిధులన్ వచియించితి నిన్నుసమ్మతిన్
లలితపదంబుచేరుటకు సన్నిటుబ్రోచెదొ! వేంకటేశ్వరా! 44

ఉ. నాదగుభార్య నీపదముసంతసవార్ధిలునను మ్రొక్కులిచ్చుచున్
వేదనబాధచేమిగుల వేఁగుచు స్రుక్కుచునుంటి దైవమా
బాధలుబాపుమాయనుచు భక్తియుతంబుగ మ్రొక్కుచుండె, నీ
వే, దయఁజూపఁగావలయు వేగమబ్రోవుము వేంకటేశ్వరా! 45

చ. దినదినమున్ క్షణక్షణము దేవనిగా భవదీయనామమున్
బనివడి భక్తిభావమటు వర్తిలఁజేసిజపించుచుండె, నే
దనమునుజూంపలేక వరదా! ననుగావుమయంచు నేడ్చుచుం
డె, నయనిధేయ! బ్రోవుమగణించిన ప్రేమని వేంకటేశ్వరా!46

చ. వయసునఁ జిన్నదంచన నబద్ధము లేవొకయింత రోగనియున్
జయమును బొందఁగాఁదగు ప్రసక్తియుఁ గాంచఁగ లేదొకింత, కీ
ర్తియు గడియింపలేను సుదతీమణి, కావున నిప్పుడైన నన్ బ్రో
చి, యలసుభాగ్యసంపదలఁ జేకుఱఁజేయుము వెంకటేశ్వరా! 47

ఉ. నిన్నెటు నమ్మనే నెప్పుడు నేతవు, ధాతవు, కర్తవంచు, లో
నెన్నినవారికందఱకు నిచ్చెదవీవు సుఖాభిలాషముల్
ప్రన్నను బ్రోచినాడవు సలాసపదంబును సందఁ జేయుచున్
సన్నుతమాతువో సతము సమ్మద నెమ్మది వెంకటేశ్వరా 48

చ. పతితుఁడ దీనుఁడన్ బరమభక్తుఁడ శ్రీయుత వేంకటేశుఁడే
సతతము దైవమంచు విలసత్పదముచ్చెద బ్రహ్మమంచు, శా
శ్వతసుఖముల్ వహింపఁగల శక్తినొసంగెడు దాతయంచు న
మ్మితి నటుగొల్చుచుంటి వినుమీ యిదిసత్యము వేంకటేశ్వరా!

చ. వృషమిఁ జనించినందులకు భోగములన్ మదిగాంక్ష సేయనిన్
వినువఁగరాని భాగ్యములు వేగముయిమ్మని బాధపెట్టనే
నడలుచునుంటి రోగమున నాత్మసుతుండటు బాధఁజెంద ని
ష్టము నిను వేఁడుచుంటి ముదమున్ సమకూర్పుము వెంకటేశ్వరా!

చ. తిరుపతికేగివచ్చితిని దర్శిచి భజించితి నిన్ను నాత్మ సం
భరితప్రమోదవీచికల మాటికిమాటికి దూఁగినాఁడ నే
మరక సదాభవత్పదము మానక కొల్చుచునుంటి నాసుతుం
డురయమునుసౌఖ్యమెప్పుడుగనున్ గృపఁదెల్పుము వేంకటేశ్వరా!

చ. అతిథులువచ్చినన్ మిగుల నాదృతిమైఁదగుపూజసేయనో?
సతతముసీపదాబ్జములు చక్కఁగఁగొల్చుట లేదొ? సత్యప
ద్ధతియె ప్రధానమంచు నటు తద్దయునేగుట లేదొ? యేలొకో
సతిసుతు బాధపెట్టెదవు సమ్మతిఁ బ్రోవుము వేంకటేశ్వరా! 52

ఆరోగ్య వేంకటేశ్వర శతకము.

ఉ. నీకరుణాకటాక్షమున నే సుతుఁడొప్పుచు సౌఖ్యమొందు న
స్తోకముగాని సౌఖ్యతతిఁ దూఁగును భార్యయు నాకునున్ సదా
వీఁకజనించునంత నినువీడక నిత్యము భక్తిఁ బెంపునన్
నీకుపచారముల్ సలుపనేర్తుము శ్రీయుత వేంకటేశ్వరా! 53

ఉ. పాపములెన్నియో మునుపపారముగా నొనరించినాఁడ, నే
నప్పుఁడ మూఢచిత్తుఁడను పావనశీలమదీయభార్య, యే
పాపముఁ జేయలేదు పసిపాపఁడు నాదగుపుత్రకుండు, నా
పాపము వారిపై వయిచి బాధలు వెట్టకు వేంకటేశ్వరా! 54

ఉ. ఎందఱో నీకటాక్షమున నిమ్మగు జీవితమందుచున్ సుఖా
నందముఁ బొందుచుండిరి మనమ్మున నీకృపఁ గానివేళలం
దెందగ వచ్చునే సుఖము? ఇందునె మోక్షపదంబు? గాన పే
ర్మిం దగ నూని ప్రోవుమిఁక వేఁగుచునుంటిమి వేంకటేశ్వరా! 55

ఉ. దానముసేయఁగాఁ దగిన దార్ఢ్యము నీయఁగలేదు నాకు, స
న్మానము చేగురూత్తముల నైన భజించెడు శక్తిలేదు, ప్ర
జ్ఞానిధియుం గనంబడదు జ్ఞానము పూజ్యము నీపదాబ్జమే
మానక కొల్చుచుంటిఁ జనుమానము నిమ్మిఁక వేంకటేశ్వరా! 56

ఉ. వేకువ లేచి నీస్మరణ వీడక చేయుచునుంటి నెప్పుడున్
నాకొమరుండు సౌఖ్యమున నాడుకొనం దగు భాగ్యమిచ్చుచున్
నాకును నాదుభార్యకు ఘనమ్మగు మోదముఁ గూర్చుమయ్య, నీ
వే కృపఁ జూపకుండిన మఱెవ్వరు ప్రోతురు వేంకటేశ్వరా! 57

ఉ. బాలుఁడు మూఁడువర్షముల ప్రాయమువాఁడు శరీరపుష్టియున్
దాలక్షింపలేదు సతతమ్మును రోగముచేఁ గృశించుచున్
గాలము నెట్టుచుండె నొకకాలము సంతసమున బుష్టిఁ జేయఁడే
లీలను గాచెదో సుతుని ప్రేమవురాశిని వేంకటేశ్వరా! 58

ఉ. నీదగునాజ్ఞ చేత ధరణిన్ వెలుగొందు సమస్తవస్తువుల్
నీదుకృపావిశేషమున నే పవనుండునువీచు నీదయన్
మోదముగల్గు; ఖేదమునుబుట్టును నీదయతప్పినంతటన్
నాదయితామణిన్ సుతుని నన్నటుచూతువొ వేంకటేశ్వరా!

ఉ. నీరుడవాదిదేవుడవు డెల్లముగాఁగనిపించు భూత వి
స్తారములెల్ల నీహృదయసారసమందు, జగంబు నీకృపా
సారముచే వెలుంగు రసషడ్గుణముల్ గనిపించు నీయెడన్
వారకమమ్ముఁబ్రోవఁదగవా? యిలువేలుప వేంకటేశ్వరా! 60

చ. అనయముమద్గురూత్తముల నాత్మభజింతుఁబరోపకార మ
న్నను వెనుదీయనెప్పుడును న్యాయముదప్పను బంధుపూజలం
దును దగుశ్రద్ధఁబూనుదును దోషములెంచెడువాఁడగాను, స
ద్వినయమువిస్తరిల్ల నినువేఁడుచునుంటిని వేంకటేశ్వరా! 61

ఉ. ధర్మముదప్పవేళలను దండనసేయఁగరాదె నన్ను నే
కర్మమెఱుంగరాని యలకాంతనువేఁచెదవేల? పుత్రుఁడున్
నిర్మలకాంతిచే నెగడునేయని నిన్నెదఁ గొల్చుచుంటి, దు
ష్కర్మముగూర్చఁబోక కృపఁగావుమ శ్రీకర వేంకటేశ్వరా! 62

ఉ. ఇంతగవేఁడుచుంటి నిను నెంతయుఁ బ్రార్థనసేయుచుంటి, నా
యింతియునిన్ను నాత్మభజియించుచునుండెను భక్తిపెంపు న
త్యంతముసూపి, నాసుతుఁడు దార్ఢ్యముగాంచెడుశక్తినిచ్చి, నా
యింతికిసౌఖ్యమిచ్చి కరుణింపుము నన్నిఁక వేంకటేశ్వరా! 63

ఉ. స్వాంతమునందు నీప్రతిమ వర్తిలఁజేసినుతించుచుంటి న
శ్రాంతముభక్తితోడననురాగముసూపుచుమమ్ముఁబ్రోవుమా;
యంతముఁజేయుమాదుతితమంతయుఁ గోపముసంహరింపుమా
యింతగవేఁడినన్ గృపయొకింతయురాదొకొ? వేంకటేశ్వరా!

ఉ. నిన్నెదనమ్మి శ్రీపతిని నేశతకంబు రచింపఁబూనితిన్
నన్నిటువంటి పూర్తియగు సంతతశక్తి నొసంగిప్రోతువో?
మన్ననసేతువో ప్రియము మాటికిసేతువొ? చెప్పవేఁడెదన్
విన్నపమాలకించి నను వేగరుణింపుము వేంకటేశ్వరా! 71

చ. అటునదియాటుపద్యములు వ్యాకులచిత్తముతో రచించితిన్
గరిమఁ బ్రియమ్ముఁజేసి నినునమ్మితిగావున సంభ్రమంబుతో
నటునదియాటు చెప్పిన మనమందున హర్షముపొంగివచ్చె, నీ
కరుణనుగాంచినన్ గొదవకల్గునె? నాకిఁక వేంకటేశ్వరా! 72

చ. శతకము వ్రాయ నెంచితిని సత్యముఁజెప్పెద నీకటాక్ష ధీ
ధృతిప్రసరించినన్ గలుగదే? తగునట్టు రచింపఁ బూనినన్
సతతము నిన్ను నమ్మిన, లసత్పదమున్ లభియింపదే తుదిన్
యతనముఁజేసితీగతిని హర్షముగూర్పుము వేంకటేశ్వరా! 73

చ. శతకము వ్రాసినంతట ప్రశాంతముగల్గునటంచు నమ్మితిన్
శతకము వ్రాయఁగాఁదగిన శక్తియు నాయెడ లేదుగాని, స
మ్మతి నినుఁ గొల్చినంతట సమంచితధైర్యముగల్గె నీకటా
క్షితతులు చిల్కినంతటఁ బ్రసన్నతగాంచితి వేంకటేశ్వరా! 74

ఉ. భోగముఁ గాంక్ష సేయ పరిపూర్ణసుఖంబును కాంక్ష సేతు, ను
ద్యోగముగాంక్ష సేయను మహోన్నతదివ్యపదంబుఁ గోరఁగా
రాగములూపఁజేసి మిగుల రాగముఁ జేసియు నెంబు రేగతిన్
రాఁగలరోయిబుల్ మునుఁ బొందొకో? శ్రీకర వేంకటేశ్వరా! 75

ఉ. భారము నీపయిన్ వఱచి భార్యయుఁ బుత్రుఁడు నన్ సుఖంబులన్
వారకగాంతురంచు మదినమ్మితి నీశతకంబు వ్రాసితిన్
గోరితి నింతకాలమును నీ వరమొక్కటి నిన్ను సౌఖ్యమే
కోరితిగాని వేఱొకటి గోరఁగ లేదుగ వేంకటేశ్వరా! 76

చ. అనుపమభక్తితత్పరతమైఁ దగుసేవలు చేయుచుంటి నీ
ఘనయతిఁ బూని నిన్నెపుడు గోరి భజించుచునుంటి నవ్యరం
బున భవదీయనామమునఁ బుత్రునిఁ బిల్చుచునుంటి నిచ్చలున్
నినుఁ గొనియాడుచుంటిఁ గరుణింపుము నన్నిఁక వేంకటేశ్వరా!

ఉ. వేయివిధంబులన్ నిను బవిత్రమనమ్మున గొల్చుచుంటి న
న్నోయికి మాయంచు హీనమానుచలాలన సేయరాదె. యా
వ్యాయముతోడఁ బోషింపఁగ నవయ్య నతీసుతులన్ సుఖంబుగా
శ్రేయము వేగ నాకు దయసేయుము శ్రీపతి వేంకటేశ్వరా! 84

ఉ. వేఁడుచునుంటి నిన్నుఁ గృపఁ జూపుమటంచు నాపయిన్
బోఁడిమి యున్ సుఖంబును బ్రపూర్ణముగా దయతోడ నివ్వ యే
నాఁడును నిన్నుఁ గాపని మనమ్మున నమ్మి మెలంగి; దహ్యయం
దాఁపఁగఁ జేయు మా భవదనంత ప్రసక్తిని వేంకటేశ్వరా! 85

చ. సిరియును సంపదల్ గలిగెఁ జేతనదగ్గెతమానమునేర్పు సు
స్థిరతరసౌఖ్యసంపదలచేఁ దుదఁదాఁగెను భాగ్యమిచ్చినన్
మఱిమఱి సేయఁ బ్రార్థనలు నాకిఁక యబ్బినఁ జాలు నెమ్మదిన్
మఱవక నిన్నుఁ గొల్చెదను మాటికిమాటికి వేంకటేశ్వరా! 86

ఉ. మాటికి మాటికిన్ సుతులు మాంద్యము చేఁ గృశియించుచుండినా
బోఁటియు రోగబాధలను బాఱఁగ నక్కె సుఖంబు లేదు; యిం
కేటికి జీవితంబనుచు నెంతయు రోఁతజనించెనా కు, న
న్నేటికిఁ బుట్టఁజేసితొ గ్రహింపఁగ నేను వేంకటేశ్వరా! 87

ఉ. గుటుచునుంటిఁ గాలమెటొ కమ్మనకుండ శరీరబాధకున్
మంటలు వెట్టుచుండెఁ గృపమాపయిఁ జూపఁగ రాదొ? మంటికిన్
గంటికి నేకధారలొలుకన్ బ్రవహించెడు బాష్పపూరముల్;
జంటపు బొందఁ గాఁపఁగదె సారసలోచన వేంకటేశ్వరా! 88

ఉ. పద్యములన్ రచింపఁగ శుభంబగునంచు లిఖించినాఁడనే
గద్యము వ్రాయకిల్లు శతకంబు రచించి నుతించితిన్ గదన్
హృద్యము గాఁగ నీకథలనేపలుమారు విశేషభక్తితో
సద్యశమున్ వహించెద ప్రసక్తినొసంగుము వేంకటేశ్వరా! 95

చ. పదుపడకొంచెమాట నినుసన్నుతిఁజేయ దొసంగులుండు, నే
సదగ్రహియించియున్ మిగుల హర్షముతో నినుఁగోరి సంస్తుతిం
చెద దోసగుల్ ప్రమాదమునఁజెందిన నీవది లెక్కసేయకే
సదమలప్రేమఁజూతునని సాగితినిట్టుల వేంకటేశ్వరా! 96

చ. తిరుపతి వేంకటేశ కవిశేఖరుఁడు చూపిన మార్గమందునే
సరిగ నశేషమంచు మనమందున నెంచి రచించినాఁడ, నీ
శ్వరు నస్తుతించి వ్రాసితిటు వారది నాకనుబంధఁగాన దే
వే గనసీవయున్ రచన తెనుఁగఁజేసితి వేంకటేశ్వరా! 97

ఉ. వారటువ్రాసిరో యటులవ్రాసెడు శక్తియు లేదు నాకు, న
న్వారికివారు ప్రోచుటను నన్నెద శిష్యుని రీతి నెంచుటన్
వారిపయిన్ వహించు నలభక్తియె నన్నిటు ప్రోత్సహించుటన్
నేరచియించినాఁడ నిదినిక్కము నమ్ముము వేంకటేశ్వరా! 98

ఉ. వారికృపావిశేషమున వ్రాయఁగఁజాలితి నానమస్కృతుల్
వారికినిచ్చెదన్ మిగుల భక్తిని ప్రేమలతోడ నామదిన్
వారిస్వరూపమే నిలిపి వారలె దైవసమానులంచు వి
స్తారముగా భజించెదను సౌఖ్యముఁగాంచఁగ వేంకటేశ్వరా! 99

చ. పరగుణధాముఁడై వెలసి భవ్యచరిత్రను గాంచి ధాత్రిలో
పరమలనిచ్చువేల్పనుచు భాగ్యనిధాన ప్రమూర్తియంచు సు
స్థిరతరకీర్తిగాంచుచుఁ ప్రసిద్ధి వహించినవానినెప్పు నే
మరక భజించెదన్ చిలకమర్తి నృసింహుని వేంకటేశ్వరా!100

చ. తెలుఁగునఁ గైతముల్ రచనఁదీర్చుమహాత్ములఁజూపినన్నెదన్
దనయునిరీతిఁజూచి సతతంబు కవిత్వవిశేషధర్మముల్
మనమున కెక్కఁ బోధనలు మాటికిమాటికిఁ జేసినన్నుఁ బ్రో
చినయలరామనాథకవిసింహుని గొల్చెద వేంకటేశ్వరా! 101

ఉ. రాజకులక్ష్మరాట్ప్రభువు రాగమునిమ్ముఁగ గౌరవించి నా
పైఁ జలికెన్ దయారసము; వర్ధిల జేయఁగ రత్నమాంబ న
న్నోజగ్రహావిశేషమున నున్నతసత్పదముంనిల్పి వి
భ్రాజితభోగభాగ్యములనన్ దగనిచ్చెను వేంకటేశ్వరా! 102

చ. తనయునిరీతి నన్నెద సతంబు ప్రియంబుగఁ జేసిచూచి, బ్రా
హ్మణులన భక్తియుక్ గలిగి మన్ననసేయుచుఁ బ్రోచుచుండె స
ద్వినుతయశంబుఁ గాంచె గుణవిశ్రుతరాణియనంగ బేరువ
చ్చెను సుఖమిచ్చి నన్ను దరిజేర్చుమ శ్రీపతి వేంకటేశ్వరా!

చ. కొదవనుమాటలేదెపుడు కొల్లపురమ్మున రత్నమాంబనా
కొదవినభాగ్యమున్ దినుచు నోజదలిర్ప శుభప్రదమ్ముగా
ముదమున నున్నవాఁడఁ బరిపూర్ణసుఖంబు నొసంగినంతటన్
వదలక నిన్నుఁ గొల్చెదను భక్తియుతంబుగ వేంకటేశ్వరా! 104

ఉ. దీక్షవహించి వ్రాసితి నిదే శతకంబు భవత్సహాయమ
ప్పేక్షణకోరుచున్నది గ్రహింపుము నాస్తుతిప్రేమవాక్యముల్
ఈక్షణమే భవత్కృపవహించిన భాగ్యము గల్గెనేని మే
మక్షయసౌఖ్యసంపదల నందినవారమె వేంకటేశ్వరా! 105



శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీమత్పరదేవతాయైనమః.

# ఆరోగ్య రాజరాజేశ్వరీ శతకము.




# ఆరోగ్య రాజరాజేశ్వరీ శతకము.

శా. శ్రీనారాయణి! నీదయాకలనచే క్షేమంబునన్ జూచి, నా
మీఁదన్ బ్రేమరసంబుఁజిల్కఁ గవనంబే భాగ్యమంచిచ్చుటన్
మోదంబొప్పరచింపఁగల్గితిని సంపూర్ణంబుగా నీవనా
కాధారంబని నమ్మియుంటిఁ గనుమంబా! రాజరాజేశ్వరీ! 1.

శా. ధ్యానంబందున నీపదాబ్జములె సంభావించి పూజించి స
ద్జ్ఞానంబందున భక్తినిల్పి యెదలోఁ దాత్పర్యమే పారఁగా
నీనామస్మరణంబె దైవమనుచు మిగులన్ నేర్పొప్పఁగా మ్రొక్కెదన్
సేవల్ చేయుచునున్నవాఁడ నెపుడున్ శ్రీరాజరాజేశ్వరీ! 2

శా. ఒక్కొక్కప్పుడు సంసృతిన్ దగిలి మాయామోహపాశంబులన్
జిక్కుల్ చెందుచు మాయలీలలఁబడిన్ జీకాకులన్ జెంది, యే
ఫక్కిన్ గానఁగలేక మూఢగతిన్ బొల్మాలితిన్ తల్లి! వే
చక్కన్ జేయుము నామనోవిషయముల్ శాసించి రాజేశ్వరీ! 3

శా. నీవే తల్లివటంచుఁ దండ్రివనుచున్ నీవే గురుండంచు నా
దైవంబంచు సమస్తమంచు నెడఁదన్ దాత్పర్యమొంతేనియున్
దైవారంగ భజించుచుంటి నెపుడున్ రక్షించి ప్రాపంగదే.
శ్రీవర్ధిల్లఁగఁజేసి సౌఖ్యమిడుమన్ శ్రీరాజరాజేశ్వరీ! 4

శా. నిన్నే నెమ్మనమందు నిల్పి సతమున్ నేర్పొప్పఁ బూజించి నీ
సాన్నిధ్యంబును గోరుచుంటిఁ ద్వరలో సంప్రాప్తునిం జేసి వే
మన్నింపంగదె నా దోసంగులను సంభావించి లాలించుచున్
విన్నాణంబగు నీపదాబ్జభజనం బేసేతు రాజేశ్వరీ! 5

శా. మాయాలీలలఁ జిక్కి లేశమును నీమాటన్ స్మరింపంగలే
దాయాసంబును జెందుచుంటి వినుమంబా! ధైర్యమున్ మాటనా
కాయంబందున లేదు వేఱగతియున్ గన్పింపదా యోర్ లస
చ్ఛ్రేయః ప్రాప్తినొసంగి ప్రోవఁగదవే శ్రీరాజరాజేశ్వరీ! 6

శా. సారాసారవివేకమున్ దెలియఁగా సామర్థ్యమున్ లేదు వి
స్తారంబై నయశంబుగాంచనయితిన్ ధర్మంబుఁ జేయంగలే
దారూఢప్రభఁ గాంచనైతి మనమందానందమున్ లేదు త
ల్లీ! రాణించెడు జీవితంబొసఁగుమా శ్రీరాజరాజేశ్వరీ! 7

శా. రాణిన్ వేంకటరత్నమాంబ జననిన్ శ్లాఘించి సౌభాగ్యసం
ధానం బందితి లోటులే దెపుడు సంతానప్రమోదంబహా
నేనందందగు భాగ్యమిచ్చితివి నిన్నే గొల్తునెల్లప్డు, సౌ
ఖ్యానందంబును గూర్చుమింక జగదంబా! రాజరాజేశ్వరీ! 8

శా. నేరంబున్న యెడన్ క్షమించి యెటులో నీవే దయన్ బ్రోచి వి
స్తారంబై నకటాక్షదీధితుల నశ్రాంతంబుఁ జిల్కింగ ని
న్నారాధింతు మనంబులోన నతి మాహ్లాదంబునం దూఁగఁగా
శ్రీరమ్యంబగు సత్పదంబొసఁగుమా శ్రీరాజరాజేశ్వరీ! 9

శా. ప్రారబ్ధంబున దోషముల్ కలిగె సంప్రాప్తించె దాసం మహా
దారిద్ర్యంబను వ్యాధిగాన మదిలో ధైర్యంబునున్ బోయె, నా
ధారంబెద్దియు లేదు నీదు కరుణాతాత్పర్యమే నాకు శో
భారమ్యంబగు దిక్కు నీ శరణమే ప్రాపంబు రాజేశ్వరీ! 10

మ. జనసంబంధినదాదినేఁటిదనుకన్ సంసారమేనమ్మి స
ద్వసితాసౌఖ్యమెశాశ్వతంబనియెదన్ భావించితిన్ మూఢతన్
నినుసజ్ఞానముచే స్మరింపనయితిన్ నేరంబుసైపంగదే
యనురాగంబునఁజూడరాదె? జగదంబా! రాజరాజేశ్వరీ! 11

శా. నేనెల్లప్డు విరాగమార్గమున సంధింతున్ గదా నెమ్మదిన్
నేనెల్లప్డువికాసబీజముఁలె సంధింతున్ గదాయిష్ట సౌ
ఖ్యాసందంబును గల్గకుంపుటకునంబా! కారణంబెద్ది? ని
న్నేనెంతేని భజించుచుంటిమదిలో నెవ్వేళ రాజేశ్వరీ! 12

మ. చదువన్ లేదల వేదశాస్త్రములు సత్సాంగత్యమూలేదు, నీ
పదపద్మంబులెనమ్మినాఁడ సుగుణపాత్రుం బెటోకగార్చి న
న్నెదపోషింపంగదమ్మనాదొసఁగుమన్నింపన్ గదమ్మా! మునుల్
వెదకంజేనిలసత్పదంబిదుమ దేవీ! రాజరాజేశ్వరీ! 13

మ. తపముల్ చేసెడిశక్తిలేదు మదిలో దార్ఢ్యంబులేదెంతయున్
జపముల్ చేయఁగ దానధర్మగుణముల్ సల్పంబ్రయత్నింపఁగా
నిపుడేమూను ధనంబులేని కతనన్ హింసింపఁగారాదు యే
విపరీతంబగు తోవఁబోనిపదమే వీక్షింతు రాజేశ్వరీ! 14

మ. జనసంబందుట జ్ఞానమందుటయు సంసారంబునందుంట నం
దనులంగాంచుట పెద్దచేయుటయు విద్యాబుద్ధులన్ జెప్పటన్
ధనమార్జించుట పెండ్లిసేయుట యిటే ధర్మంబునేగున్ గదా
నినుఁగొల్వందగుకాలమేది? చెపుమా నిక్కంబు రాజేశ్వరీ! 15

మ. నినుఁగొల్వం సుఖమందఁగాఁగలరు నిన్నేనమ్మిసౌభాగ్య సా
ధనముల్ గాంతురు ధర్మమార్గవిధులున్ దధ్యంబుగాఁగల్గు, నె
మ్మనమందున్ నినుఁబూజచేసినయెడం బ్రాప్తింపదేముక్తి; నీ
చనవున్ గల్గినవేళలందున సమస్తంబుందు రాజేశ్వరీ! 16

శా. ఇల్లున్ గట్టియొకండు సౌధమును నిర్మించిన్ బరుండున్ సుసం
పల్లాభంబునుబొంది హర్షమును గూర్పంబూనుచుండీ సిరుల్
కొల్లల్ గాగ ధనంబు గూర్చుచురుగా సుక్షింభరార్థంబుకై
తల్లీ! నీపదముందుఁ జేర్పఁదగదా? ధ్యానింతు రాజేశ్వరీ! 17

శా. ఆచారమ్ములుమంటగల్పి కులధర్మాచారమున్ రోసి దు
ర్ధీచాతుర్యబలమ్ముబూని తగవందే కాలమున్ బుచ్చుచున్
నీచాత్మల్ గుణధర్మముల్ విడుచుచున్ స్వేచ్ఛావిహారాత్ములై
యేవోటున్ గనరానిదేమిరసమో? హీనంబు రాజేశ్వరీ! 18

శా. వాదంబందునఁగాలమున్ గడపి సద్వాక్కుల్ విసర్జించి స
మ్మోదంబున్ గనలేక ధర్మవిధులన్ బోనాడి మూఢాత్ములై
యీధాత్రిన్ నశియించిపోవుదురుగా యేమిన్ గనన్ లేకయే
వాదంబున్ సలుపంగఁబోను జగదంబా! రాజరాజేశ్వరీ! 19

మ. మునులున్ ధర్మపరుల్ విశుద్ధచరితుల్ పుణ్యాత్ములున్ జ్ఞానులున్
గనఁగాలేని భవత్పదాబ్జమెటులేఁ గాంక్షింపఁగా నేర్తు? నో
జననీ! మూఢుఁడ జ్ఞానహీనుఁడను సత్సాంగత్యమున్ లేనటై
నను నీపాదముఁబట్టినాఁడ గుణమెన్నన్ జూడు రాజేశ్వరీ! 20

శా. శ్రీలన్ గాంతివహించు నీపదములన్ సేవించుచుండంగ స
న్నేలా? మాటికిమాటిమాటికిని రక్షింపన్ బ్రయత్నింపవో
బాలారత్నమ! నీవదిక్కనుచు నిన్ భావింతు నెల్లప్పుడున్
మేలందందగు సత్కృపాకలన నన్నేలంగదే మ్రొక్కెదన్. 21

శా. ఏపాండిత్యము లేదునాకు మనమందీనాఁడు సంతోష మొం
తో పుట్టన్ రచియింపఁగల్గితిని నోహా నీసహాయంబుచే
లోపంబున్నయెడన్ క్షమించినను నీలోఁ జేర్చి రక్షింపవే
పాపైయుందున [illegible]ము స[illegible]ద్రి జగదంబా! రాజరాజేశ్వరీ!22

మ. జననంబందినదానికిన్ ఫలము కాసంతైన నేఁబొందలే
దనిలోఁ గుందుచునున్నవాఁడ జననీ! వ్యామోహమగ్నుండనై
తిని నీపాదముపట్టి చెప్పితిగదా తీవ్రంబెటో పోయెఁగా
న నిదానంబున నిన్నుఁగొల్తునెపుడున్ నాయందు నీవుంచుమా.

మ. భవదత్యంత కృపాకటాక్షకలనా భాగ్యంబుచే తల్లిరో!
కవితాధోరణి కొంత నాకు దొరకంగా సద్ధియాధారమం
చెవిమో పద్యములల్లుచుంటిఁ బొరపాట్లెన్నేని వోర్తుంగదా
యవిలో నెంచక మంచిభావములు నాకబ్బన్ బ్రసాదింపుమా.

మ. శరుణన్ లోనవహించి మంచిపనులన్ గావింపలేదెప్డు మే
లరయంగాదగు నీదునామమును జిహ్వన్ నేస్మరింపంగనై
తి, రసోత్పాదకమెప్డు నీవలన నేతీపాకు నంచేసహా
యెఱుఁగన్ జాలని మందభాగ్యుఁడను తల్లీ! రాజరాజేశ్వరీ! 25

మ. తలఁపన్ గుండెలు ఝల్లుమంచు సదరున్ ధర్మంబులన్ ద్రోసి రాఁ
గలసౌఖ్యంబుల కుబ్బుచుందు సకటా! కష్టంబులేగల్గు వే
ళల డెందంబటుడిల్లపోవు సమతన్ లాలించు భావంబు నే
నిలఁగాంచన్ సమకూర్చిపోవఁగదవే యెల్లప్డు రాజేశ్వరీ! 26

మ. సతులున్ బుత్రులు బంధుమిత్రులును సంసారంబులెంచంగ శా
శ్వతమా? ప్రాణములుండుదాక ధనసద్భాగ్యంబులన్ గాంచఁగా
సతిమోదమ్మున దేవులాడి తమవారంచెంత్రు; ప్రాణంబు వో
వుతఱిన్ గష్టమువచ్చువేళ నొకచూపున్ జూప రెవ్వారలున్.

మ. జగతిన్ బుణ్యముదెచ్చుకీర్తి ధనమున్ సంపాదనన్ సేయలే
ము, గణింపందగు పుణ్యకార్యతతులన్ దోరంపు సద్భక్తితో
తగుసక్తేనొసరింపనైతి నకటా! ధర్మంబుఁ బోనాడితిన్
దెగుపన్ గాంచితి సత్యమున్ నుడివితిన్ నీతోడ రాజేశ్వరీ! 28

మ. చదువన్ లేదొకధర్మశాస్త్రమయినన్ సాంతంబుగా శ్రద్ధతో
విదితంబౌనటు నీపదాబ్జముల సేవింపంగ లేదెంతయున్
మదమాత్సర్యములందుఁ జిక్కువడి నేమంబేమియున్ లేక నీ
పదయుగ్మంబును బట్టినాఁడఁ గరుణింపన్ రాదె రాజేశ్వరీ! 29

మ. జననం బెత్తినదాదినేఁటివఱకున్ సంసారమే శాశ్వతం
బని కాంతారతియే సుఖంబని ధనం బార్జించుటే గొప్పటం
చు నెదన్ మూఢతగాంచి పూనితిసటుల్ నోరారనిన్నిప్పు భ
క్తినిదానంబున నే స్మరింతు ననురక్తిన్ జూపు రాజేశ్వరీ! 30

శా. నీవే దిక్కని గొల్చుచుంటి నెడఁదన్ నిక్కంబుగా నమ్మి స
ద్భావంబుల్ దనరార భక్తికలనా తాత్పర్యమున్ బూని నా
దైవంబీవనుచున్ సదా తలఁచెదన్ ధర్మానురక్తిన్ భవ
త్సేవాభాగ్యములిచ్చి ప్రోవఁగదవే శ్రీరాజరాజేశ్వరీ! 31

మ. తనువే శాశ్వతమంచు నెంచి ధనకాంతామోహమందున్ దగు
ల్కొని సత్కార్యములాచరింపనయితిన్ లోభక్తిభావంబునన్
నినునెప్డున్ స్మరియింపనైతి నకటా! నీనామమే దిక్కటం
చు నెదన్ భావనసేతుఁ బ్రోవఁగదవే శోధించి రాజేశ్వరీ! 32

శా. ప్రాకట్యంబగు భక్తిన్ గొలిచి సద్భావంబులుప్పొంగఁ నీ
వే కా! దిక్కని నమ్మినాఁడనుగులన్ హృద్వ్యాధి నీరూపమ
స్తోకంబైన ప్రియంబుఁ దాల్చి త్వరలోఁ జూపంగఁ బ్రార్థించెదన్
నీకారుణ్యము నాపయిన్ బఱపుమా నిన్నంతు రాజేశ్వరీ! 33

శా. తల్లీ! నీకృప నాపయిన్ బఱపుమా తాత్పర్యమేపార నా
యుల్లంబందున నిన్నుఁ బేర్కొనుచు నోరారన్ జపంబెప్డు శో
భిల్లం జేయుచు భక్తిమెసతము సంప్రీతిన్ విలోకించి సం
పల్లీలావిభవంబుతోఁ గొలిచితిన్ భక్తుండ రాజేశ్వరీ! 34

మ. కలకాలంబొకరీతినేగుమనుచుఁ గారుణ్యముఁ వీడి, నా
తలపై భారము వెట్టితో సుతిసతీ తాత్పర్యమంచుఁ మహీ
తలమందుఁ జనంబువ్యర్థమగుటఁ ధర్మంబె? నీపాదముల్
గొలువన్ గల్గు ఫలంబునేగతిని నాకున్ గూడు రాజేశ్వరీ! 35

మ. ననునీమానసమందునుంచి తగు విజ్ఞానంబుద్దై వారఁగ
న్గాని దీర్ఘాయువొసంగి భాగ్యమలరన్ గూర్పంగ మేల్చేసి నా
యనుఁగుం బుత్రునిఁబ్రోచినాసతికిఁ బూర్ణారోగ్యమీయంగఁగ
ల్పనసేయంగదె సత్కృపాకలననిన్ భావింతు రాజేశ్వరీ! 36

మ. మతిమంతుండనుగాను యుక్తియును సమ్యగ్దీప లేదెంతయున్
సతతమ్మున్ నినుభక్తిగొల్చుటకునైనన్ శక్తియున్ లేదు న
న్నతిపేర్మిన్ గరుణింపరాదె? జననీ! యానందముఁ గూర్చి న
మ్మతిరక్షించినఁగాని లభ్యమగునే? భక్తప్రభావోన్నతుల్. 37

మ. కలకాలంబును పేర్మిమమ్మానుచు లసత్కారుణ్యభావంబునన్
దలపింపన్ దగురీతిఁబ్రోవుము కృపాతాత్పర్యముఁ దాల్చి నా
వలనన్ నేరములున్నఁబ్రోవఁదగదా? వారింపఁగాఁజెల్లదా?
ఫలసంపత్తినిఁగూర్చి సౌఖ్యములిడన్ బ్రార్థింతు రాజేశ్వరీ! 38

మ. అపరాధంబులు పెక్కుచేసితిని నీస్వాంతంబునందింత ని
ష్కపటత్వంబునహించి పుత్రునివలెన్ గాపాడిప్రోవంగదే!
చపలత్వంబు త్యజింపఁజేసివిదపన్ జ్ఞానాప్తి కల్పించియే
విపరీతంబునుబొందకుండ జననీ! పేర్మిన్ ననున్ జూడుమా. 39

శా. విశ్వంబంతకుసేవకర్త్రివనుచున్ విజ్ఞానమేపారఁగా
విశ్వాసంబుననిన్నుఁగొల్చినయెడన్ బేర్మిన్ మహాలోత్సవాలై
యైశ్వర్యంబునుఁదూఁగుచుంద్రుసతమాహ్లాదంబునందూఁగియో
శశ్వస్సంగ్రహిదవ్యరూప! జననీ! శక్త్యంబ! రాజేశ్వరీ! 40

మ. ధనమన్నన్ యశమన్న భాగ్యమనినన్ ధర్మక్రియారంభ మ
న్ననుదానంబనినన్ తపంబనినఁ బుణ్యంబన్నఁ దీర్థంబుల
న్నను సాహాయ్యమనన్ గుణంబనిన నీనామంబటంచున్ వ్రతం
బునభక్తిన్ భజియించుచుంటిజననీ! మోక్షంబునీయంగదే.

మ. సకలమ్మున్ ద్యజియించి నీపదముగాంక్షన్ జేసి యెక్కాలమున్
వికలంబై నమనంబువీడిగొలుతున్ వేవేగమోక్షార్థులన్
సుకవిత్వంబునొసంగి సత్కృపమెసన్ సూత్రించిరక్షింపుమా
సకినిన్ బుత్రునిబ్రోవుమాసవయతన్ శాసించి రాజేశ్వరీ! 42

మ. ధనమార్జించుటె గొప్పయంచుసతమున్ ధర్మంబుసత్ప్రవ
ర్తనమున్ వీడి ధనాశలోఁదగులుచున్ బౌద్ధకర్మంబునన్
దనవర్ణాశ్రమమార్గముల్ విడుచుటే ధర్మంబటంచెంచి ని
న్ననయంబున్ భజియించుచుంటి జగదంబా! రాజరాజేశ్వరీ!

మ. అనయంబున్ విషయంబులందమనమందాసల్ పిసాళించి స
జ్జనసాంగత్యమువీడి ధర్మగుణమున్ సత్యంబునున్ రోసి దు
ర్జనసాంగత్యమె కాంక్షచేసి తిరుగన్ రాదెప్డు సంశుద్ధ వ
ర్తనమందున్ జరియించుబుద్ధి సమకూర్పన్ రాదె? రాజేశ్వరీ!

శా. జ్ఞానంబెంతయులేదు వేదగుణమున్ శాస్త్రంబులున్ నేర్వలే
దానందంబగు బ్రహ్మరూపమయినన్ స్వాంతంబునం దెంచనెం
తో నింద్యంబగు ఘోరకార్యముల నెన్నోసల్పినాఁడన్ ననున్
జ్ఞానంబందగఁజేసిప్రోవఁదగదా! జ్ఞానాంబ! రాజేశ్వరీ! 45

శా. అంబా! నీకరుణాకటాక్షమెదలో నాశింతు నెక్కాలమం
దుంబాటింతు భవత్పదాంబుజమె నన్నుం ధన్యునిన్ జేసెనం
చుం బాల్యంబుననుండినిన్నె గొలువన్ జొబ్బిల్లునాకోర్కె; సౌ
ఖ్యంబందందగు భాగ్యమిచ్చికనుమంబా! రాజరాజేశ్వరీ! 46

మ. కలలందైనను నీస్వరూపమునె యెక్కాలంబుఁగాంక్షింతు ధీ
బలమియ్యన్ ననుబ్రోవరాదె? సుఖసౌభాగ్యంబునేఁగాంచు స
త్కళలన్ జిమ్మ కృపారసంబుఁజిలుకన్ గా నేమిలోటుండు? భ
క్తులకేలేనిఫలంబె వారికయిడేకూర్పంగ? రాజేశ్వరీ! 47

శా. సంసారంబతినీచమంచెఱిఁగియున్ జ్ఞానస్వరూపాత్ములే
సంసారంబనుమాయలోమునుగుచున్ జాలించుకోలేక ప్ర
ధ్వంసాభావమునందు మూఢులగతిన్ ధర్మంబుఁబోనాడియే
హింసన్ చేయుటకైన జంకరుకదా? యిట్లేల? రాజేశ్వరీ! 48

మ. ఇలువేల్పంచును నిన్నుఁబట్టితిని నన్నేదారిరక్షించెదో?
బలమియ్యన్ యశమియ్యభాగ్యతతులన్ బ్రాప్తింపఁగానియ్యని
చ్చలునేనింతెద నీపదాబ్జమెలమిన్ సామర్థ్యమున్ బూని, నీ
కళయే యెద్దడయుంచుఁగొల్తునెపుడున్ గాంక్షించి రాజేశ్వరీ!

మ నినునేనమ్మినదాది సర్వసుఖముల్ నేర్పున్ యశంబున్ ధనం
బును భాగ్యంబును దివ్యభోగ తతులున్ మోదంబుఁ
[బూద్యత్త్వమున్
ఘనమౌ తెల్వి కవిత్వసంపదలు వేడ్కన్ గూర్చి రక్షించినా
వనినేనెంచెద నాత్మలోనజగదంబా! రాజరాజేశ్వరీ! 50

శా. ప్రారబ్ధంబనితప్పదెవ్వరికి నీప్రాపున్ లభింపంగఁద
ద్భారంబంతయుఁబోవు సౌఖ్యతతులున్ బ్రాప్తించునీపైనిఁనా
భారంబుంచితి నీయనుజ్ఞనెపుడున్ దాటంబ్రయత్నింపనా
నేరంబుల్ శమియించి ప్రోవుమనన్ శ్రీరాజరాజేశ్వరీ! 51

మ. చిరకాలంబునుండి నెమ్మనములో శ్రేయంబటంచెంచి నీ
చరణారాధనసల్పుచుంటి సతతమ్ సౌఖ్యంపువారాశిలో
దిరుగంజేయుము నీపదాబ్జయుగమందేన్నల్పుమోయంబ! స
త్వంమే మోక్షవిధానమిచ్చుమనుపన్ దప్పేమి? రాజేశ్వరీ! 52

శా. అంబా! నీవిలువేల్పవంచు మనమం దాసించుచున్ బూని ని
న్నుంబూర్ణంబగు మానసంబున భజింతున్ గావె సద్భక్తిమ
మ్ముంబోషింపకతీరదమ్మ సతతమ్మున్ మ్రొక్కుచున్నామమా
కుంబూర్ణాయువొసంగరాదె? ధనమున్ గుప్పించి రాజేశ్వరీ! 53

శా. మోదంబొప్ప భవత్పదాబ్జయుగమే మోక్షంబునియ్యంగ నా
డౌర్దైన్యంబు నుమాన్పి నీదుకృపయందన్ జాలుసంచెంచి ని
న్నేదైవారభజించుచుంటినెపుడున్ హెచ్చైనసద్భక్తితో
ఖేదంబున్ ఘటియింపకింక యనురక్తిన్ జూడు రాజేశ్వరీ! 54

శా. ఎన్నంజాలుదునీపదాబ్జయుగమే యెన్నాళ్ళకైనన్ ననున్
మన్నింపన్ గదె మాటిమాటికిని బ్రహ్మాసంచమానీదు పే
రెన్నన్ జాలు మదీయజిహ్వ; యెటులో యేలంగదే మమ్ము నీ
కన్నన్ దిక్కు మరేది? సత్కృపయు జిల్కన్ రాదె? రాజేశ్వరీ!

శా. నావంశంబునకీవు వేల్పవనుచున్ నావారు సద్భక్తులున్
దైవారన్ భజియింత్రు నిన్ను సతమున్ ధర్మానురక్తిన్ ధరిం
చీవే ప్రోవఁగ లేనికాలములయందెవ్వారు దిక్కౌదురో
ప్రోవం జెప్పుము ధర్మమార్గవిధులన్ బూజింతు రాజేశ్వరీ! 56

మ. భయమొక్కింతయులేక నిన్నెపుడు నాస్వాంతంబునందుంచి, మేల్
నయభక్తుల్ ప్రచురింపఁజేసి కొలుతున్ లక్ష్యంబు చూపించి ని
శ్చయమీసంగతి సన్నుటో మనువు మా సౌఖ్యంబులన్ గూర్చి బల్
జయమందందగు భాగ్యమిచ్చి దయతోఁ జాముండ! రాజేశ్వరీ!

మ. వనితాసంగమె మోక్షమంచు నెదలో భావించి మూఢుండనై
జననీ! నిన్నుభజింపలేదెపుడు సత్సాంగత్యమున్ జేయలే
దనయంబున్ దగుకాంక్షతోడ సుతసత్యాసందమత్తుండనై
వినయంబొప్పవచించినాఁడ నిజమున్ బ్రోవంటి రాజేశ్వరీ! 58

మ. జయమందఁ గలనంచు బుద్ధికలనా సామర్థ్యమున్నంత నీ
పయిభక్తిఁ బ్రకటించినిన్నిదను సంభావించుచుంటిఁ బరా
జయముఁ గూర్పకు నేనొనర్చుపనులఁ జ్ఞానాంబ! చిద్రూపిణీ!
భయభక్తిఁ నినుఁగొల్చుచుంటి జగదంబా! రాజరాజేశ్వరీ!

శా. ఎన్నోనోములునోచినాఁడ ధరయందెన్నో వ్రతంబుల్ సయం
బెన్నఁ సల్పితి దానధర్మగుణమందెంతేని యాసక్తి నిం
కెన్నోచేసితి నీపదాబ్జయుగిమే యేపారు సద్భక్తితో
నెన్నంజాలఁదు నెల్లవేళలను నిన్నే నమ్మి రాజేశ్వరీ! 60

శా. స్వాంతంబందుననిన్ను నమ్మిగొలుతుఁ శాంతంబునియ్యంగదే:
సంతాపంబునుజెందకుండమిగులఁ సౌఖ్యంబుగాంక్షించి ని
న్నంతో భక్తిమెయిఁ భజించెదసదా, యీబీదభక్తుఁ వెసఁ
జింతల్ మాన్పుచునెట్లొ ప్రోవఁదగదా? శ్రీరాజరాజేశ్వరీ! 61

శా. ఆయుర్దాయమునిమ్మటంచు నినునేనాశింపలేదెప్డు నే
యాయాసంబునులేని జీవితముఁనందాసల్ పిసాళించి మ
జ్జాయాపుత్రులఁగూడి నీదుపదముఁ సద్భక్తితోఁగొల్చితిఁ
సాయంబిచ్చి కృపాకటాక్షగరిమఁ నన్జూడు రాజేశ్వరీ! 62

శా. నిన్నే నమ్మిచరించుచుంటి నెడఁదఁ నిన్నే భజింతుఁ సదా
నిన్నే నేస్మరియింతు నిన్నె నయముఁ నేర్పొప్పఁబూజించెదఁ
నిన్నుఁ నమ్మినవారికెట్టిభయముఁ సిద్ధింపదెవ్వేళలఁ
నిన్నుఁ నమ్మనివారికెప్డు భయముఁ జేకూరు రాజేశ్వరీ! 63

మ. శతకంబుఁ రచియింపఁబూనితినెటో సామర్థ్యమున్నంత స
మ్మతితో వందనముల్ గ్రహించి కరుణింపఁ రాదె? యొక్కింతని
న్నతిభక్తిఁ భజియించుచుంట నిజమైనఁ నీదయఁ వేగఁజి
ల్కి టదాసందరసాబ్ధిలోఁదనుఁపుమా ప్రేమించి రాజేశ్వరీ! 64

శా. పద్దెమ్ముల్ రచియించినాడ నెటులో ప్రారబ్ధకర్మక్షయం
బిద్దానన్ సమకూరునంచు సుఖమందిచ్చల్ పినాళించి నీ
యొద్దన్ వ్రాలితి నెట్లు ప్రోచెదవొ? ప్రత్యూహంబులన్ బాపినా
ముద్దున్ దీర్చి క్షమించి ప్రోవఁదగదా? మోక్షార్థి రాజేశ్వరీ! 65

శా. నీకారుణ్యము మాపయిన్ జిలికినన్ నీకేమి లోటుండు? న
స్తోకంబై తనరారు సౌఖ్యతతులందున్ దూఁగఁగాఁ జేసి స
త్ప్రాకట్యంబగు కీర్తికాంతకలనా భాగ్యంబుఁ జేపట్టఁగా
వీఁకన్ బాలనచేసి ప్రోవఁదగదా? వేవేగ రాజేశ్వరీ! 66

శా. అమ్మా! నిన్నెదనమ్మి నీదుపదమే సంతతం బ్రయత్నింతుఁ బా
పమ్ముల్ నాశముఁ జేసి రోగభయముల్ బాపంగదే? నిత్యసౌ
ఖ్యమ్ముల్ గూర్పుమ వేగ మోక్షతతులన్ గల్పించి రక్షింపుమా
మమ్ముల్ నీపదమందు నిల్పి జగదంబా! రాజరాజేశ్వరీ! 67

శా. అంబా! నీదగు మాయలీల లెఱుఁగన్ స్వాంతంబునం దెంతొ నే
మంబున్ బూని భజించు యోగికయినన్ మల్లాడినన్ గాని శ
క్యంబున్ గాదను వేళలందు నెటు లేసంగదన్ బ్రయత్నింతు? మో
క్షంబీవే సమకూర్పఁగావలెనుమా శక్త్యంబ! రాజేశ్వరీ! 68

శా. పక్షంబుల్ తెగిపడ్డ పక్షికరణిన్ బ్రాల్మాలియున్నాఁడ నీ
శిక్షాసూత్రము చాలునింక నయినన్ క్షేమంబునన్ జూచినన్
రక్షింపంవలె నీకటాక్షతతులన్ నాపై నినిల్పంగదే
వీక్షింపంగదె సౌఖ్యమిచ్చి మిగులన్ బ్రేమించి రాజేశ్వరీ! 69

శా. నీరూపంబు దలంతు నేనెపుడు నిన్నే ధ్యాసముల్ సేతు దై
వారన్ గాగల భక్తియుక్తితతులన్ భాసిల్లఁగాఁ జేసినః
నీరన్ ముంచిన పాల ముంచినను నిన్నే సమ్మతిన్ తల్లి! నా
భారంబీవె భరింపఁగావలయు నంబా! రాజరాజేశ్వరీ! 70

శా. నీపేరుంచెద నాదుబిడ్డలకు నిన్నేనమ్మినాఁడన్ జుమీ
నాపై నీకరుణాకటాక్షతతులందన్ జేయుమో తల్లిరో!
నీపాప్రిపుఁగన లేనిజీవితమునందే సౌఖ్యమబ్బున్? వెసన్
పాపంబున్ నశియింపఁజేసి కనుమా, జ్ఞానాంబ! రాజేశ్వరీ! 71

శా. ఏవేదంబుఁబఠింపనైతి నెపుడున్ హృద్యంబుగా శాస్త్రబో
ధావిర్భావనిదానముల్ తెలియలేనైతిన్ లవంబేని, నీ
సేవాసక్తియెఱిక్కనాకు దోసఁగుల్ శిక్షించి మన్నించి న
న్నీ వేరక్షణసేయఁగాఁదగును జుమ్మీ! రాజరాజేశ్వరీ! 72

మ. దినముంజిత్తము పల్లవింప భయభక్తిన్ జూపి నీనామమే
మననంజేయుచునుంటి నెల్లపుడు బ్రహ్మానందమున్ బొందఁగా
నినుఁబూజించుచునుంటి నీపదములే నిక్కంబుగానమ్మితిన్
మనమందున్ గల కోర్కెతీర్చ గనుమంబా! రాజరాజేశ్వరీ!73

మ. తనువాబుద్బుదమెంచిచూడ, నిలలో తథ్యంబుగానిల్చునే
ధనమైనన్ సిరులన్నశాశ్వతములా? ధాత్రీతలంబందునే
మనియాశల్ పెనగొందునెమ్మనమునందంబా! నినున్ నమ్మి చే
సినసేవల్ గనుపించునిత్యమనుచున్ శ్రీరాజరాజేశ్వరీ! 74

మ. జననంబెత్తినవారికెప్పుడయినన్ జావంగధర్మంబునేఁ
జనువారిన్ గని దుఃఖమొందనెపుడున్ సత్యంబుగాఁజెప్పెదే
యనుమానంబునులేక వారికయి యాయాసంబులన్ జెందుటల్
చెనఁటుల్ చేసెను మార్గమిద్ది నిజమో శ్రీరాజరాజేశ్వరీ! 75

మ. భవదుఃఖంబులుపాపుమంచుమిగులన్ బార్థించుచుంటిన్ సదా
భవదంఘ్రిస్తుతిఁజేసిజేసి యెటులో పాపంబుదగ్ధంబుఁజే
సి, వివేకంబగుమార్గమందరుగఁగాఁ జేయంగఁ గారుణ్య దృ
ష్టివిశేషంబును నాపయిన్ బఱపుమా శ్రీరాజరాజేశ్వరీ! 76

మ. మునునేఁజేసినపాపమెంతగలదో! పుణ్యంబులేదో! లవం
బును, మోహాంధుఁడనై వివేకవిధులన్ బోనాడితిన్ గాక, యీ
జననంబందున దుఃఖముల్ గలుఁగునే? జ్ఞానమ్ముతో నిన్నుఁగొ
ల్చి, నయంబందఁగఁజేయుమింకనయినన్ శ్రీరాజరాజేశ్వరీ! 77

మ. నిగమార్థంబునునేర్వనైతినెపుడున్ నిన్నేమఁబూజించి మొ్రో
క్కఁగలేదెప్పుడు కాసమొందననుటల్ గాలంబుధర్మంబునం
దగనెట్లన్ బ్రయతింపనైతినిపుడో తల్లీ! నిరున్ నమ్మితిన్
సుగమున్ గల్పనసేయుమాసదయతన్ శోభిల్ల రాజేశ్వరీ! 78

మ. సిరుహృద్వీధినినిల్పిభక్తితతులన్ నేప్రొప్పవిర్మించి, నే
ననయంబున్ భజియింపమాననుగదా, యాలస్యమింకేల? చే
సినపుణ్యంబునకైనమెచ్చి శుభముల్ చేకూర్పరాదా? సుఖం
బనువొందన్ దనరారునట్లు జగదంబా! రాజరాజేశ్వరీ! 79

మ. తనునైర్మల్యధరాతలంబుపయినన్ దర్పంబుగానిల్చునో
ననునందాఁక మహాభయంబుగనకుండన్ జేయుమో తల్లి! నా
కు, నుపాయంబునుజూపి, యీవెనుకనిన్ గొల్తున్ నయంబొప్పజే
సినచిత్తంబుననిల్పిపోవఁదగదా శ్రీరాజరాజేశ్వరీ! 80

మ. లలితంబైన భవత్పదాబ్జయుగమున్ లక్ష్యంబుతోఁబట్టి ని
చ్చలుబూజింతునయమ్మసంగనిదియే సాక్ష్యంబునిచ్చున్ గదా
యిలలో సౌఖ్యముగాంచు జీవితముసందేగం గటాక్షించియా
వలనీదివ్యపదంబునిమ్ము జగదంబా! రాజరాజేశ్వరీ! 81

మ సతతాచారవిధానధర్మయుత సత్సాంగత్యమున్ సత్యమున్
ధృతియున్ భూతదయాపరత్వవిధులున్ తేజంబునున్ దెల్వియున్
మతియున్ శాంతముసోమ్పుధ్యానమునుసన్మార్గప్రకాండంబులం
దతుకన్ జేయుమునామబుద్ధిజగదంబా! రాజరాజేశ్వరీ! 82

మ. పలుజన్మంబులనందిపుట్టుతఱిఁ బ్రారబ్ధకర్మంబులన్
బలుపాపంబులఁజేసిపై నయముఁ బాధింపఁగా నేడ్చినన్
నలుసంతైననులాభముండదుగదా న్యాయంపుమార్గంబునం
దెలిమిన్ బోయెడురీతిఁజేయుటకుఁ బ్రార్థింతున్ నినున్ దల్లిరో!

మ. పరమంబై రసవత్తరంబయి సంపత్సారమై శ్రేయమై
నిరతానందమునై వినిర్మలమునై నిత్యంబునై భవ్యమై
సరసంబై మధురంబునై నెగడు సత్సారంబు నీపాదమున్
గరమొప్పన్ భజియింతు మోక్షపదమున్ గాంక్షించి రాజేశ్వరీ!

మ. ప్రమదంబొప్పభజింతు నిన్ను నెదలో భక్తిప్రభావమ్ముతో
సమరేంద్రాదులునైన నిన్ దెలియలేరన్నన్ మరెవ్వారు, నీ
మహిమన్ నిన్నెఱుఁగంగఁజాలుదురు? నామంబందఁబోధించుచున్
మమునీసత్కరుణాకటాక్షగరిమన్ రక్షింతువో రాజేశ్వరీ! 85

శా. ఆరంభించినకార్యముల్ కొనసాగునట్లానందమున్ గూర్చి నా
భారంబంతయునీవ గైకొనుచు సంభావింపుమమ్మా! భవ
త్కారుణ్యామృతవృష్టిజిల్కనయెడన్ గార్యంబులీడేరు, ప్రే
మై రక్షింపవె నాప్రయత్నములనంబా! రాజరాజేశ్వరీ! 86

శా. నీపాదస్మరణంబుమానవెపుడున్ నిన్నే భజింతున్ సదా
నాపై ప్రేమరసంబుఁజిల్కకనుమా నన్నీవు కాపాడి, నా
పాపంబుల్ నశియింపఁజేసి కృపతోన్ బాత్రంబుగల్పించుచున్
బ్రాపై రక్షణసేయుమిష్ట, జగదంబా! రాజరాజేశ్వరీ! 87

శా. దేవీ! పాపములేనొనర్చితిని భీతింజెంది నీపాదముల్
సేవింపందలపోసినాఁడ దోసఁగుల్ శిక్షించినాపైఁగృపా
ప్రావీణ్యామృతమింతఁజిల్కుమెడఁదన్ లాలించి రక్షించి ప్రే
మావిర్భూతవరంబునిమ్ము జగదంబా! రాజరాజేశ్వరీ! 88

మ. ననుఁబోషించెడుతల్లివీవయనుచున్ నాతండ్రివంచున్ గురుం
డనుచున్ జ్ఞానపదార్థమంచు నిరతంబానందసంధాయివం
చు నెదన్ భక్తినిదాల్చినిన్నుఁగొలుతున్ శుద్ధాంతరంగమ్ముతో
ననురక్తిన్ వహియింపుమింక జగదంబా! రాజరాజేశ్వరీ! 89

శా. తానంబుల్ వ్రతముల్ తపంబులు మహాధర్మంబులున్ దీర్ఘసే
వానిష్ఠానియమంబులైన నొనరింపన్ లేదు మూఢాత్ముఁడన్
నానా పాపములేనొనర్చితిని విజ్ఞానంబునున్ లేక నీ
వే, నన్బ్రోవవలెన్ జుమా సదయతన్ బ్రేమించి రాజేశ్వరీ! 90

శా. నీకారుణ్యమునాపయిన్ జిలికినన్ నిత్యోదయంబందెదన్
నీకున్ నిశ్చలభక్తిసేవతతులన్ నేర్పొప్పఁగాఁజేసెదన్
నాకోర్కెల్ నెఱవేర్చుమింక దయతో నన్నీవురక్షింపుమా
ప్రాకట్యంబగుసౌఖ్యమిమ్మ! జగదంబా! రాజరాజేశ్వరీ! 91

మ. త్వరలో నాదగుకోర్కె సత్ఫలమునొందన్ జేయుమోతల్లి! న
త్కరుణన్ దాల్చి భజింతునిన్ను నెదలోఁదాత్పర్యమున్ జూపి, న
ద్వరమొక్కండొనఁగన్ నుతించి జననీ! ప్రార్థించుచుంటిన్ నిరం
తరమున్ నాపయినీకృపన్ జిలుకరాదా? రాజరాజేశ్వరీ! 92

శా. ఏసామర్థ్యములేదునాకు నెటురక్షింపన్ బ్రయత్నింతువో?
యీసంసారముఁగన్నరోఁతగలుగున్ హేయంబటంచెంచెదన్
నీసాన్నిధ్యమునిచ్చిపాయమిడి నన్నీవేసతంబున్ వృథా
యాసంబున్ వహియింపకేమనువుమంబా! రాజరాజేశ్వరీ!93

శా. సేవింతున్ భవదీయపాదయుగమున్ క్షేమంబటంచెంచుచున్
దేవీ! నిన్నెదనమ్మినాఁడ ననురక్తిన్ జూపి రక్షింపుమా
నీవుండన్ భయముండబోదెవుడు సందేహంబునున్ లేదు త
ల్లీ! వైశంబదయన్ వహింపఁదగదా? శ్రీరాజరాజేశ్వరీ! 94

శా. నీతో సత్యముఁ జెప్పినాఁడ నెడఁదన్ నిన్నే జపింతున్ సదా
యోతల్లీ! కరుణాకటాక్షమునకున్ యోగ్యున్ననుం జేసి నీ
చేతోవీథిఁ దలంపరాదె? దోసఁగుల్ శిక్షించి ప్రేమించి ని
న్నే తాత్పర్యవిధిన్ స్మరింతు నెపుడున్ నేర్పొప్ప రాజేశ్వరీ! 95

శా. నాయందున్ దోసఁగున్న కాలములయందాజ్ఞన్ బ్రవర్తించి, య
న్యాయంబున్ దొలఁగించి న్యాయవిధులన్ నాయందు వర్తింపఁగాఁ
జేయన్ లేవె? మదీప్సితంబు త్వరలో సిద్ధింవసన్ బోవరా
దా? యమ్మా! వరమొక్కటిచ్చి జగదంబా! రాజరాజేశ్వరీ!

మ. ఉదయంబందున లేచికొల్తునిను నుద్యోగంబునున్ జేసి నా
మదినిన్నే భజియింతు నెల్లపుడు సన్మానించి పూజించి యిం
పొదవన్ జూడుమ నీకు మ్రొక్కెదను బ్రత్యూహంబులందున్ వెతల్
విదళింపన్ గదె నీకటాక్షగరిమన్ బ్రేమించి రాజేశ్వరీ! 97

మ. హృదయాంభోజమునందు నిన్నెపుడు ధ్యానింతున్ నయం [బొప్పఁగా
విదితంబై సవివేకమున్ గలిగి నీవే దిక్కటంచెంతు నీ
పదమున్ బట్టిభజింతు నిశ్చలమతిన్ భావించెదన్ దైవమం
చెదలో నెంచి సతంబు మ్రొక్కెదను రక్షింపంగ రాజేశ్వరీ! 98

శా. అజ్ఞానంబునఁ జేయుదుష్కృతములెన్నైనన్ శమింపన్ దగున్
విజ్ఞానంబును బోధఁజేయుమెటులో వేవేగ రక్షించి, నీ
యాజ్ఞన్ మీఱెడువాఁడఁగాను దయతో నాలింపుమా, మామకా
వజ్ఞల్ సైఁపుమ తల్లివోలె జగదంబా! రాజరాజేశ్వరీ! 99

శా. పెద్దల్ చెప్పిన త్రోవఁబోయితిని నే విజ్ఞానమున్ గాంచితిన్
విద్దెల్ కొన్ని గ్రహించియీపయినినున్ నేర్మిన్ దగన్ బూనుచున్
దద్దన్ గొల్చుచునున్నవాఁడ సతమున్ ధర్మంబుఁగాపాడి, నీ
వద్దన్ సంవసియింపఁజేయుమిఁక సంబా! రాజరాజేశ్వరీ! 100

మ. అరవిందోత్పలపారిజాత సుమకుందాశోక పుష్పంబులన్
వరలీలన్ గొనితెచ్చి భక్తియు మహాభాగ్యంబుఁ జేకూఱఁగా
కరపాళిన్ ఘటియించి పాదములమ్రొక్కన్ వేగ పూజించెదన్
సిరులన్ సౌఖ్యమునిచ్చి కావుమమమున్ శ్రీరాజరాజేశ్వరీ!101

శా. భక్తిన్ గాంచిభజించుచుంటినెపుడున్ భావంబులుప్పొంగ, నా
శక్తిన్ జూపితి నీకటాక్షగరిమన్ సత్యంబు నేఁజెప్పితిన్
ముక్తిన్ గాంచెదు మార్గమందరుగఁగాబోనిమ్ము మద్బుద్ధి, నా
వ్యక్తిన్ పద్యమువ్రాయుభావమునుమార్పన్ రాదు రాజేశ్వరీ!







శ్రీమత్పరదేవతాయైనమః.

# యోగ్యతాపత్రములు.



కడియము,

తూర్పుగోదావరిజిల్లా,

15–12–30.

శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడు బి. యే. గారిని నేను చాలనాళ్ళనుండి యెఱుఁగుదును. ఈయన రాజమండ్రిలో యల్. టి. కి వచ్చినప్పుడు వీలైనప్పుడువచ్చి నావద్ద విద్యారహస్యముల నభ్యసించుటచే మఱియు విశేషముగా నెఱుఁగుదును. అంతకు మున్నీయన మాకు ఏకలవ్యశిష్యుఁడేయైనను పై కారణముచే ప్రత్యక్షశిష్యుఁడుకూడనై యున్నాడు. భగవద్గీతావ్యాసంగమొనర్చి యందుఁ జక్కఁగాను తీర్ణుడై బహుమతిని పొందియున్నాడు. విద్యావిషయమున నీయనకెంత యోగ్యత యున్నదో అంతెయు వినయాది సుగుణముల పట్టునను గలదని నేను స్వయముగా నెఱుఁగుదును. ఈయనకు చిన్నతనమునుండియు నాంధ్రకవనముచెప్ప నలవాటుగలదు. అందలి లక్షణరహస్యముల నిటీవలననగా యల్.టి. పరీక్షకువచ్చినపుడు నాయొద్ద నభ్యసించెను. ఇటీవల 'వేంకటేశ్వరా' యను మకుటముతోడను, 'రాజేశ్వరీ' యను మకుటముతోడను రెండు శతకములను వ్రాసియున్నారు. ఇవిరెండును భక్తిరసపూరితములై మిక్కిలి భక్తుల కుపయుక్తములుగానున్నవి. ఆంధ్రాంగ్ల భాషలలో మంచి ప్రజ్ఞగలిగి యసమానమైన శాంత్యాదిగుణసంపత్తిగలిగి శోభిల్లు నిట్టియుపాధ్యాయుని హైకొన్న స్కూలుకదృష్టము. వర్ణనీయమని నాముఖ్యాభిప్రాయము.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి,

శతావధాని.

బ్ర॥ వాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారు. వీరిని నేను జాలకాలమునుండి యెఱుంగుదును. బాల్యమునుండియు వీరు మంచినడవడికలవారు. సర్వదా విద్యావ్యాసంగము తప్ప వీరికే యితర వ్యాసంగములులేవు. కష్టపడి చదివి పట్టపరీక్షం గృతార్థులగుటయే కాక మంచికవిత్వముచెప్పనేర్చినారు వీరికవిత్వము మృదుమధురముగానుండును. వీరు విద్యార్థులకు సుబోధకముగా విద్య నభ్యసింపఁ జేయఁగలరు. వీరిస్వభావము మంచిది. సత్కులప్రసూతులు. వీరి కాయురారోగ్యభాగ్యములు పరమేశ్వరుఁడనుగ్రహించుఁగాక.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి,
రాజమండ్రి,
3—4—29.

## TESTIMONIAL BY
## CHILAKAMARTY LAKSHMI NARASIMHAM GARU.

I have known Mr. V. Ramasubbarayudu for many years. He is a graduate and underwent training in the Local Teachers' College. He is well versed in Telugu also and can write good poetry. He will be a very useful hand to teach Telugu Composition and Translation for the High School classes in addition to English and History. He is an industrious and intelligent Young man with an excellent character.

RAJAHMUNDRY,
26—7—27. Chilakamarty Lakshmi Narasimham.

శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడు బి. యే. గారు రచించిన వేంకటేశ్వరశతకము, రాజరాజేశ్వరీశతకమును నేను చూచినాఁడను. కవిత్వము మృదుమధురముగాను, భక్తిరసభరితముగాను, శాన్త్యాదిరసయుక్తముగాను నున్నది. వీరును శమదమాది గుణసంపత్తి గలవారు. వీరికి ఈశ్వరుఁడు ఆయురారోగ్యైశ్వర్యములనునిచ్చుఁగాత.

కొల్లాపురం,<br>19–2–31.

చక్రవర్తి కవితార్కికసింహం,<br>గోపాలాచార్యులు,<br>శ్రీ జటప్రోలు సంస్థాన పండితులు.

I am glad to testify to the character and abilities of Mr. V. Ramasubbarayudu of Kovvur, who had been my fellow tutor for about a year in the service of the Zamindar of Teleprole. He is an efficient and earnest teacher who has always the best interests of his pupils at his heart. He is a good poet and scholar in Telugu.

His general character leaves nothing to be desired. I wish him every success in life.

PADMA VILLA,<br>Ootacamand,<br>19—4–28.

**M. RAMARAO,**<br>Principal Tutor<br>and Retired Headmaster.

శ్రీ

శ్రీమజ్జటప్రోలు సంస్థానాశ్రితులై రాజకీయ విద్యాశాలా ప్రధానోపాధ్యాయ పదవి నధిగమించిన వాజపేయయాజుల రామ సుబ్బారాయుఁడుగారు ఆంగ్లవిద్యయందు పట్టభద్రులయ్యును, ఆంధ్రభాషాభిమానులై, బుద్ధిప్రతిభాదులచే నాంధ్రగ్రంథ రచనాసామర్థ్యమును సంపాదించిరి. సత్కులప్రసూతులైన వీరికియ్యది కీర్తిదాయకంబై యున్నయది. అందు వీరు రచించిన శ్రీరాజరాజేశ్వరీశతకము, శ్రీవేంకటేశ్వరశతకమును నేను స్థాలీపులాకన్యాయమున చూచితిని.

ఇయ్యవి వీరి ఆస్తికతను భక్తిభావమును వైదుష్యమును వెలిబుచ్చుచున్నవనుట పునరుక్తము.

వీరికింగల యాంధ్రభాషాభిమానమును వృద్ధిపఱచి శ్రీ శ్రీ జగదీశ్వరుండు రక్షించుగాక.

వసం సీతారామశాస్త్రి,
శ్రీ జటప్రోలుసంస్థాన విద్వాన్.
25—2—31.

## 5

### ఆరోగ్య వేంకటేశ్వర శతకము, ఆరోగ్య రాజరాజేశ్వరీ శతకము.

ఇయ్యవి వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడు బి.యే. గారిచే రచింపఁబడిన గ్రంథములు. స్వకళత్ర పుత్ర భూయిష్టమగు తత్కుటుంబమున కనారోగ్యమేర్పడుటయు, వేంకటేశ్వర రాజరాజేశ్వరీదేవతల సంబోధించుచు నారోగ్యమిండని చేసిన వేఁడికోలే యీ శతకద్వయము. ఈయారోగ్యమార్గముకింకవీంద్రఘటాపంచాననులగు శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారిచేఁ బ్రదర్శితము. వారు కుమారునకారోగ్యము తప్పినందులకై చింతిల్లుచుఁ గామేశ్వరిపైఁ గొన్నివందలపద్యములు వ్రాసి తుదకర్భకు నారోగ్యవంతుని జేసుకొని యుండిరి. ఆరోగ్యకామేశ్వరియను తద్గ్రంథము మాయభినవ సరస్వతిలోనే ప్రచురింపఁబడియున్నయది. ఈయారోగ్య వేంకటేశ్వర రాజరాజేశ్వరీశతకముల నావేంకటశాస్త్రిగారే పరిచూచి సదభిప్రాయము గూడ నిచ్చియున్నారు. రామసుబ్బారాయుఁడుగారి సుగుణగణమును గొనియాడుచు నట్టి మహనీయునిచేతనే సదభిప్రాయ మొసఁగఁబడిన యీశతకములుచాల బాగుగానున్నవని నాయభిప్రాయము తెలుపుట పిష్టపేషణముకాకమానదు. కావున నిట్టి శతకయుగళ సమర్పణమున నైన పరితుష్టితో శ్రీవేంకటేశ్వర రాజరాజేశ్వరీదేవతలు రామసుబ్బారాయుఁడుగారి కుటుంబమున కారోగ్య భాగ్య మనుగ్రహింతురుగాక యని ప్రార్థించుచు విరమించుచున్నవాఁడను.

జానపాటి పట్టాభిరామశాస్త్రి,
శతావధాని,
ఎడిటరు అభినవసరస్వతి,
జానపాడు, గుంటూరుజిల్లా.
25—2—31.

NIZAM COLLEGE,
Hyderabad-Deccan.
26—2—1931.

I have known Mr. V. Ramasubbarayudu, B.A. for the last twelve years and had occasion to know him at close quarters. He is a self-made young man of remarkable perseverence and has a great capacity for hard work. His interests are many-sided but his field of specialisation lies in Telugu, Sanskrit and Pali. He is one of the very few Pali Scholars in the Madras Presidency and is a poet in Telugu. It is a great pity that he is not able to make use of his talents in that direction. But I find that he still takes a live interest in these languages and hope that he will have opportunites to make use of his knowledge of these languages. He is a diligent young man of excellent character. I wish him the best success in life.

**J. C. KAMESVARA ROW D. S. C.**

శ్రీరామసుబ్బారాయుఁడుగారితో నేను కొల్లాపురమునకు వచ్చి నదిమొదలు చక్కఁగా పరిచయముగలవాఁడను వీరిచే రచియింపంబడిన శ్రీవేంకటేశ్వర రాజరాజేశ్వరీ శతకముల రెండింటిని స్థాలీపులాకన్యాయముగా చూచినాఁడను. వీరికవితామాధుర్యము, కవిత్వమునందు పాండిత్యముగలవారే యెఱుంగుదురు. ఇతరులు సాధారణముగా భావింపకూడదు. ఇందుగల భక్తిసాంఖ్యాములను వినినదిమొదలు మాకుగల యానందమిట్టిదతి వ్రాయుటకు నలవికాదనుట నిస్సందేహము. ఇట్టి సద్భక్తి కవితా వినయాది గుణ పరిపూర్ణులగు యీసుబ్బారాయకృత శతకద్వయ మాచంద్రార్కస్థాయిగా ప్రకాశించుగాత.

ఇట్లు కోయల్ కందాళై అణ్ణన్,
రాజగురు కృష్ణమాచార్యులవారు, విద్వాన్,
శ్రీ జటప్రోలు సంస్థానం.
25—2—31.

శ్రీమత్పరదేవతాయైనమః.

శ్రీరస్తు. చి॥ వా॥ రామసుబ్బారాయుడుగారికి—

ఆశీర్వాదపద్యము

మ. లలి నిన్నున్ గని మెచ్చి నీకళత్రము మహాలక్ష్మిన్ సుతున్ వేంకటే
శుల [illegible] కత్వము బ్రేమఁగ సంశుద్ధాంతరంగమ్ముతోఁ
జలన మ్మొన్నఁడు లేని సౌఖ్య మిడి నిచ్చల్ రోగమున్నాట ద
ప్పులకున్ [illegible] యనుగ్రహించు నల శంభుం డాంబయున్ బుత్రులున్

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, శతావధాని

కడియం.

శ్రీరస్తు

ఆశీస్సీసము

సీ. [illegible] ద్యాయుతంబగు నా వివేకంబు
[illegible] జేరి [illegible] గనికయున్
సౌభాగ్యవతియైన సహధర్మచారిణి
[illegible] మహాలక్ష్మి యుం [illegible]
[illegible] పుత్రి [illegible] గంటి
బహుదేశముల మహోద్యోగముల్ [illegible]
[illegible] సౌఖ్యవంతుఁడై
బుధులచే [illegible]

ఆ. వాజపేయయాజవంశ వసంతుఁడై
వన్నె వాసిగాంచి వరలుఁగాత
సుతసతీయుతముగ శుభము నీ కగుగాక
సుజనగేయ రామసుబ్బరాయ !

డాక్టరు చిలకమర్తి లక్ష్మీనరసింహము

రాజమహేంద్రవరము.

## బ్రహ్మశ్రీ వేమూరి విశ్వనాథశర్మ యం. ఏ. యల్. టి. గారి

### ఆశీర్వాదము

శ్రీయుత రామసుబ్బారాయుఁడుగారు నాకు చిరపరిచితులు దేహారోగ్యముకొరకు దైవారాధనతో తృప్తి చెందెడివారీకాలములో అరుదు. ఇట్టి దైవభక్తిపరవశులగు రామసుబ్బారాయుడు గారిని వారి కుటుంబమును శ్రీ వెంకటేశ్వరస్వామి యవ్యాజప్రేమతో రక్షించుగాక.

### అభినందనము

బ్రహ్మశ్రీ రామసుబ్బారాయుడుగారికి

మిత్రమా!

౧. కృతులు రాజేశ్వరీ వెంకటేశ్వరశత
కములు, యుష్మద్రచితములు గాంచినాఁడ
నందు నవనీతకోమలంబై రహించు
నీదు హృదయాంబుజంబె వర్ణితమయయ్యె 1

౨. తెగకతీరనిరుజలు బాధించునప్పు
డౌషధము లౌపచారికంబగునె కాని
దేవతాసేవ యమృతమై దేజ మిచ్చు
దీక్షగలభక్తి శ్రీరామ రక్షసుమ్మి. 2

౩. విశ్వమంత్ర యుద్ధమునఁ గన్పించునట్లు
శతకములఁ దోఁచు నీదు సంసారసరణి
శైలి ధారాళమగుచుఁ బేశలత మించు
"సుకవి" వనఁదగుదువు రామసుబ్బరాయ! 3

౪. సరసజనమౌళి "అప్పయశాస్త్రి" గార
లరమఱికలేని మా మిత్రుఁ డగుచునుండ
మనకు సౌభ్రాత్రగుణమాధి యెనయు టేమి
చోద్య మియ్యెడ నో రామసుబ్బరాయ!

గీ. కలశపాథోధికరణి నిర్మలతవెలసి
యలఘుతరకీర్తి సంపదలావహిల్లి
వాజపేయయాజుల ఘనవంశమెప్పు
డారవి సుధాకరము ధాత్రినతిశయిల్లు. 4

మ. లలితాకారుని నీ కుమారుని మహాలక్ష్మిన్ ద్వదర్ధాంగిని,
ర్మలచిత్తున్ నిను రామసుబ్బసుకవిన్ బ్రఖ్యాతు రాజేశ్వరీ,
కలికాలాధిప వేంకటేశ్వరకటాక్ష శ్రీలు లాలించుతన్
బలమారోగ్యము దారసంపదలు సౌభాగ్యంబుఁ జేకూర్చుచున్. 5

డి. రాజశేఖరం
కవిసింహ. అవధానిపంచానన
వైస్ ప్రెసిడెంటు తాలూకాబోర్డు
బ్రహ్మానందిని ముఖ్యసంపాదకుల
ప్రొద్దుటూరు. కడపజిల్లా.

ఆశీర్వాదము

1 ఉత్సాహము. వాజపేయయాజి సాన్వవాయ! రామసుబ్బరా
యా! జనార్దనుండు యుష్మదర్ధదేవా లక్ష్మమన్
తేజమొసఁగి మనుపఁగలఁడు దీర్ఘకాలమవ్విధం
బోజ నీదు ముద్దుతనయునోము వేంకటేశ్వరున్.

ఉ. ఆయురుసేతయొకాచు భవదంగనయింకను సంతుగాంచెడిన్
ధీయుతుఁడౌచు నీ సుతుఁడు తేజరిలంగలవాఁడు డెందమం
దేయదొ బెంగఁబెట్టుకొని యేలతపించెదవయ్య రామసు
బ్బాయ! భజింపుమీశ్వరుని రక్షణసేయు భవత్కుటుంబమున్. 2

క. సూచింతు రుగ్రహచారము
చూచి మనీషులు ఫలంబు క్షోణీస్థలమం
దాచతురాననుని వినా
యేచతురుఁడు నిర్ణయించు నిదియిట్లనుచున్. 3

జానపాటి పట్టాభిరామశాస్త్రి, శతావధాని
జానపాడు, గుంటూరుజిల్లా.

I have known Mr. V. Rama Subbarayudu, B.A., for the last twenty years. From my personal knowledge of him, I can testify with confidence that he is a promising young man choke full of life and activity with many noble qualities of head and heart and with remarkable powers of patience and perseverance, which contributed not a little to his success in life, despite many obstacles due to the proverbial dispute between Lakshmi and Saraswati. His conduct and character have uniformly been excellent.

Since he graduated, he cultivated his vernacular to an extent which is amazing, while at the same time, discharging his duties as a teacher in the Jetaprole Samastanam in a way which won for him the good will and esteem of his pupils and his superiors.

He has lately published "Sri Venkateswara and Raja Rejeswari Satakams." poems exhibiting fine religious fervour and piety of a pathetic soul offering prayers to the deities and brightly written in such an easy, chaste and felicitious style that one cannot grudge the author his meed of praise. They deserve to be widely read by all Bhaktas.

I am hopeful that such a deserving votary of Saraswati will, ere long, win his spurs in the field of Telugu Literature by persevering in the path he has so well chosen.

May God shower his choicest blessings on him

*ajahmundry,*
21—4—31

P, V. SUBBA RAO, B.A., L,T., B,L.

స్నేహలతా కవితాసంఘము పుష్పము 27.

శ్రీమాతృదేవతాయైనమః.

# కవితాకాంతావిహారము.

[ఏకాశ్వాసము.]

గ్రంథకర్త:

కవిజనాశ్రయ

వాజపేయయాజుల రామసుబ్బారాయుడు, బి. ఏ.,

హెడ్ మాస్టర్,

శ్రీ లక్ష్మారాయ మిడిల్ స్కూలు,

అండ్

ప్రకాశకులు:

స్నేహలతాకవితాసంఘము,

కొల్లాపురం,

శ్రీ జటప్రోలు సంస్థానం.

1934.

స్నేహలతా కవితాసంఘ పుష్పము 27.

శ్రీమత్పరదేవతాయైనమః.

# కవితాకాంతావిహారము.



[ప్రథమాశ్వాసము.]

గ్రంథకర్త:

కవిజనారాధ్య

వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు, బి. ఏ.,

హెడ్ మాస్టర్,

శ్రీ లక్ష్మారాయ మిడిల్ స్కూలు,

అండ్

ప్రెసిడెంటు:

స్నేహలతాకవితాసంఘము,

కొల్లాపురం,

శ్రీ జటప్రోలు సంస్థానం.

శ్రీవైష్ణవ ముద్రాక్షరశాల, పెంటపాడు.

1934.

శ్రీమత్పరదేవతాయైనమః.

# తొలిపలుకు.

పాఠకమహాశయులార !

ప్రతిజీవికిని నిద్రయనునది ముఖ్యము. జీవకోటిపైకి మానవులు విజ్ఞానధనులగుటంజేసి యారోగ్యశాస్త్ర మనుసరించి నిద్ర ప్రధానముగఁ బరిగణింపఁబడుచున్నను ధర్మ మతిక్రమింపక నీటిబుగ్గలవలె నస్థిరమైన యీ ప్రాణమును విద్యుల్లతలవలె క్షణములో మాయమగు భోగభాగ్యములును శాశ్వతములని భ్రమింపక, యుదరపోషణార్థమై పగటికాలమంతయు వ్యావహారికపరిశ్రమలయందు వ్యర్థమగుటం జేసి, మిగిలిన రాత్రిభాగమే పరమార్థసాధకంబగు దైవతారాధనమై వెచ్చింపఁబడవలసినదగుటచే నట్టి సమయమును శక్తికొలఁది భక్తిమార్గమున వినియోగించుట సర్వవిధముల శ్రేయోదాయకమని నాఽభిప్రాయము. రాత్రిభాగము నిశ్శబ్దముగ నుండుటం జేసి కవుల కత్యంతప్రియముగనుండును. జ్ఞాను లిట్టియవకాశమును వృథఁబుచ్చరు.

ఈ చిన్నిగ్రంథము రాత్రిభాగమునం దుత్పత్తి యైనదనియు మహావేశసంభరితాత్ముండనై సరస్వతీసేవకన్న మిన్నయగు ధర్మము మానవులకు లేదని నిరూపించుచు నాశువుగ వ్రాయఁబడినదనియు నా యీవిషయము లన్నియుఁ గవితారసాస్వాదనిపుణు లెఱింగినవే

శా. ప్రారంభించినదాది నాశుకవితా ప్రావీణ్య మేపారఁగా
నారాయంచు నుతించుచందము ననా యాసంబుగా నిద్గ శృం
గారప్రక్రియఁ జెప్పు బుద్ధిగరిమన్ గల్పించినా విట్టులే
కారుణ్యంబున నన్నుఁ బ్రోవు మెపుడున్ గౌరీ! పరాదేవతా!

ఇట్లు, బుధజనవిధేయుఁడు,

**రామసుబ్బారాయఁడు, బి. ఏ.,**

శ్రీమస్స్వరదేవతాయైనమః.

# ఆశీర్వాదము.

శా. శ్రీసుక్షేత్ర కొల్లపురంపు రాజ్యరమ వాసిన్ మీరఁ బాలింపుచున్
శ్రీమంతంబగు కీర్తికిన్ నెలవునై యెల్లొందు రత్నాంబ స
త్పుత్రీమానానకటాక్ష వీక్షారుచుల్ దీపింప నన్ బ్రోచు వి
ద్యామాన్యుండనఁ బెంపు శేషగిరిరాయా! లోకులే దెందునన్. 1

శా. శ్రీరాజ్ఞీమణి రత్నమాంబిక కృపన్ జెన్నారు కొల్లాపుర
శ్రీరాజ్యంబున నున్నవారముగుటన్ స్నేహంబు దైవార నెం
తో రాజిల్లెడు భక్తిభావములు నీ కొప్పారె నా పట్టునన్
బ్రారంభంబులు వృద్ధిఁ జెందెను ధరన్ మైత్రీప్రభావోన్నతిన్. 2

ఉ. తాతయుఁ దండ్రియున్ జనిన దారినిఁ బట్టి మహోదయమ్మునన్
ఖ్యాతిగడించు సత్కృతు లనంతముగాఁ బొనరించుచుండుటల్
నీతికి లక్షణంబనుచు నీవటు సజ్జనమార్గవర్తివై
భూతలమందు మించఁగల భూరియశమ్మును నిల్పినావహో. 3

క. శివతారావళిలోనన్
గవితామాధురునిఁ గోరి గౌరవ మొప్పన్
గవిలోకము నుతియింపఁగ
భువి వెలయన్ జేసినట్టి పుణ్యుఁడ వీవే. 4

ఉ. శ్రీయుత తాంద్రవంశమున సిద్ధచరిత్రుఁడవై జనించి వా
లాయముగా కవిప్రవరు లన్ దగురీతిని నాదరించి లే

ర్ఘాయువునందె శేషగిరి । రాయ ! యశంబునుగన్న నీకు దీ
ర్ఘాయువు నొసంగి ప్రేమనెపు । డా గిరిజాపతి సత్కృపోన్నతిన్. 5

మ. సుకవీ కావ్యమటంచు నెంచి 'కవితా । కాంతాపహారంబు' పై
ననురాగమ్మును జూపియచ్చువడగన్ । యత్నంబుగావించి, పెం
పుగ కీర్తిన్ బ్రకటించినాడవు భవ । త్పుణ్యప్రభావోన్నతిన్
నినుగాపాడుత రామచంద్రుడెపుడున్ । వీక్షించి యెవ్వేళలన్. 6

శా. ఆలోచించితి నాదుపుస్తకము లా । స్వాదంబు సంధిల్లగా
నెచ్చెమ్మున్ గణియింప కెంతయును సం । ప్రీతిన్ విలోకించుచున్
హెచ్చౌకీర్తి గడించినాడవుగదా । యిప్పట్టునన్ ధాత్రిలో
సచ్ఛీలున గాంచుమింక బుధులో । స్తోయంచు నిన్ మెచ్చగన్. 7

చ. సుగుణములెల్ల ప్రోగుపడి । శోభిల నీవయి జన్మమందెనో ?
సుగుణములన్నియున్ వెదకి । సొంపుగ నీదగుతల్లి యుగ్గుపా
లుగ నొసరించి నీగళము । లో నిడి పెంచెనో ? యట్లుగాని దో
నగణిత సద్గుణంబు లహ । హా ! కనుపించు నె నీదుపట్టునన్. 8

మ. ధన ధాన్యాది విశేష భాగ్యతతి వి । ద్యాబుద్ధు లార్జించుచున్
జనులౌరా యని మెచ్చు వైఖరిని స । చ్చారిత్రమున్ గాంచి మిం
చిన యౌదార్యముజూపి సత్కవుల సూ । క్తిసుస్రుల్ తలన్ దాల్చు మో
యనఘా! శ్రీయుత తాండ్ర శేషగిరిరా । యా! నీకు దీర్ఘాయువౌ. 9

మంగళం.

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ సత్పరదేవతాయైనమః.

# కవితాకాంతావిహారము.

శా. శ్రీవాణీ కరుణాకటాక్షకలనా ♦ క్షీరాబ్ధి నోలాడుచున్
జేవల్మీఁగఁ గవిత్వమల్లుదు యశ ♦ శ్రీ వృద్ధిఁగావించుచున్
దేవారాధనతత్పరుండనయి ధా ♦ త్రిన్ గాలమున్ బుచ్చ స
ద్భావంబుల్ దయసేయుమంచు నెదలో ♦ భావింతుమూర్తిత్రయిన్.

ఉ. నిద్దురవీడి సన్నిటుల ♦ నిచ్చలు రాత్రులయందు వ్రాయఁగా
వద్దనియేల యందువు ♦ భామిని! బద్ధకముందు వేళ నా
పద్దెశ సంభవించునను ♦ వార్తలెఱుంగవో? నీవెఱింగియున్
దద్దయుఁ బట్టుపట్టుటలు ♦ ధర్మమె యెప్పటికేనియున్ సఖీ! 2

ఉ. ఈవిధినాకునై వగవ ♦ నేల దురంతవిషాదచిత్తవై
దైవము వ్రాసిపెట్టినది ♦ తప్పునె యెవ్వరికైనఁగాని న
న్నీవిధి నిద్రవీడి లిఖి ♦ యింపుమటంచు విధాతవ్రాసె నా
జీవితమిట్టులే గడచుఁ ♦ జెల్వరో! దీనికిఁ జింతయేటికిన్. 3

ఉ. నిద్దురపోవుచుండినను ♦ నిల్వదు నెమ్మనమందుఁ బ్రేమ నా
వద్దకురమ్మటంచు బల ♦ వంతముగా ననులాగుచుండు నే
నెద్దివచించినన్ వినక ♦ యిట్టులె మత్కవితాలతాంగి న
న్నొద్దికమీరఁ జేర్చి సర ♦ సోక్తులు వ్రాయఁగఁ జేయు నెప్పుడున్. 4

ఉ. నాకొకనాఁటిరాత్రి లల ♦ నా! కనుపించి మహోదయమ్మునన్
నాకవితాలతాంగి యొక ♦ నాఁడును మానకుమానకంచు నా
కేకవిధమ్మునన్ నుడివె ♦ నిట్టులె జీవితముండుదాక నా
పై కృతులన్ రచింపుమని ♦ భాగ్యము దాన లభించునం చొగిన్. 5

ఉ. మానక దానిపల్కులె ప్ర ♦ మాణములంచుఁ దలంచినాఁడ క
న్గొనలనాను భాష్పముల ♦ కున్ వశమౌచు సరస్వతీసతీ
మానిని యిట్లు పల్క నను ♦ మానసమదేటికి మానినీమణీ
ఈనియమంబునన్ నడువ ♦ నెంచితి నాళ్లు వెళ్లఁబుచ్చుచున్. 6

ఉ. మానుడు మానుడంచు నను ♦ మాటికి మాటికి మాపిమాపికిన్
మానిని! చెప్పనేల కొక ♦ నాఁటి ప్రసంగముకాదు కావునన్
మానుట నాకసంభవము ♦ మాని యొనర్చుప నేమిచెప్పుమా
మానెను హాస్య మింకొకని ♦ మానుగ నాకిఁకలైనఁ జిక్కెనన్. 7

చ. కలదొక చిత్రగాథ తెపు ♦ కంబుగ నిన్నరిహాస్యమిద్ది నే
నిల జనియించి పెద్దనయి ♦ హెచ్చుగ బుద్ధులునేర్చినంత నా
కలవడె దైవసంగతి స ♦ మస్తముఁ జెప్పెద నీకు భార్యవై
వెలిగెడుదానవౌట నను ♦ బ్రేమఁ దలిర్పఁగఁ జూచుచుండుటన్. 8

చ. తిరిగితి దేశదేశములు ♦ దీనికినై కడుచింతఁ బూని నే
నరుగనిచోట్లు లేవు వయ ♦ సంతయు నీగతిఁ జెల్లుచుండె సం
చెటిఁగి తదేకనిష్ఠఁ గొని ♦ యే జపమూనుచు సేయుచుండఁగా
పరమదయాళుఁడైన భగ ♦ వంతుఁడు దర్శనమిచ్చె నంతటన్. 9

ఉ. ఏనొనరించినట్టి జప ♦ మీవిధి సత్ఫలమౌ టెఱింగి నా
మానస మెప్పుడున్ సుకృత ♦ మార్గమునన్ జను భాగ్య మిమ్మటం
చే నపుడా మహాత్ముని భ ♦ జించితి నెక్కుడు భక్తి పెంపునన్
వాని పదారవిందముల ♦ వ్రాలుచు వందన మాచరించుచున్. 10

ఉ. అంతట లేవనెత్తి నను ♦ దంచితరీతినిఁ బుత్రుఁవోలె న
న్నెంతయు నాదరించి భయ ♦ మెంతయు వీడుమటంచుఁ జెప్పి న
త్యంతసుఖంబుఁగల్గు నదు ♦ పాయము జెప్పె నొకండు నాకు ని
శ్చింతమనమ్ముతో నతఁడు ♦ సెప్పిన దంతయు నేఁగ్రహించితిన్. 11

చ. మనుజునకున్ బ్రధానము స ♦ మంచితసౌఖ్యము దానిఁగోరఁగాఁ
జనినడ దేహమాత్రమును ♦ చామరకోటికి దాని నెట్లో గాం
చినమనుజుండు కష్టములఁ ♦ జెందడు పొందడు తాపమేదియున్
దినదినమున్ క్షణక్షణము ♦ దేవునిగా జప మూనిచేసినన్.12

చ. జపములకన్న మిన్నయగు ♦ సత్కృతులన్ రచియించుచుండుటల్
విపులమనంబుతోడ నర ♦ విందదళాక్షునిఁ గొల్చుచుండుటల్
కృపయును దాల్చి బీదలకు ♦ నెల్లపుడున్ దగుసాయ మిచ్చుటల్
చపలతలేని చిత్తమున ♦ సాధుజనాలికి మ్రొక్కుచుండుటల్.13

ఉ. ఈ పరమార్థతత్త్వగుణ ♦ మించుక నేవినినంతసంతలోఁ
బాపము తొల్గఁబాసెనని ♦ భావమునం దలపోసినాఁడ నే
నోపికతోఁ బదార్థమును ♦ నూరక నామనసార నెంచుచున్
దాపసు లేగుమార్గమును ♦ పదయుఁబట్టఁగ నిశ్చయించితిన్. 14

చ. వ్రతములపొంతఁబోక నుప ♦ వాసపరాఙ్ముఖుఁడై మెలంగుచున్
సతతము దీర్ఘసేవయును ♦ సంధ్యలువార్చుటయున్ ద్యజించుచున్
మితముగ మాటలాడుచు న ♦ మేయగుణాఢ్యులకెల్ల మ్రొక్కుచున్
కృతులను వ్రాయుచున్ గడుప ♦ నెంచితి జీవిత మిట్లు లోసఖీ! 15

ఉ. అప్పటినుండి నేటివర ♦ కాపరమాత్ముని ధ్యాన మించుకేన్
దప్పక సత్తపంబులను ♦ దానము ధర్మము లెన్నియేనియున్
మెప్పుగడించుపద్ధతు ల ♦ మేయముగాఁగ నొనర్చుచుంటి నో
యొప్పులకుప్ప! దేహబల ♦ మోర్చుకొలందిని సేవఁజేయుచున్.16

శా. ఈరీతిన్ బ్రతివాసరంబు నెదనెం ♦ తేనిన్ మహోత్సాహ మే
పారంగాఁ గవుభక్తిఁదాల్చి వరదున్ ♦ ధ్యానింపఁగా సత్కృప
శ్రీ రంజిల్లఁగఁజేసి దర్శనము ని ♦ చ్చెన్ నాకు దివ్యాకృతిన్
బ్రారంభించితి స్తోత్రపాఠములు న ♦ ర్థానందచిత్తంబునన్. 17

గీ. అంత నాభక్తి కెంతేని ♦ సంతసంగ
మందు మెచ్చికొనుచు నంక ♦ మందుఁ జేర్చి
వరమొకండు నాకిచ్చెఁ ద ♦ ద్భాగ్యమొసఁగ
సంత సజ్జ్ఞానలీలలు ♦ సంతరిల్ల. 18

మ. కలలోఁ గాంచినరీతి నెంచితిని త ♦ ద్గాథావినోదంబు లే
నిలజన్మించినదాది నింతవర కొ ♦ క్కింతైనఁ జేకూరలే
దల పుణ్యంబున లభ్యమయ్యె ననుచున్ ♦ స్వాంతమ్మునందెంచితిన్
విలసత్ప్రజ్ఞనుగాంచు పుణ్యమొకటే ♦ నిండారు సౌఖ్యంబునన్. 19

ఉ. ఆవరమెట్టిదంచు మన ♦ మందున శంక జనించు నేమొ నీ
కోవనితామణీ! వినుము ♦ నోపికఁబట్టి వచింతు నిష్ట సౌ
ఖ్యావహమైన జీవితము ♦ నందుటకై కవితాలతాంగికిన్
సేవ లొనర్పఁగావలయు ♦ నేనటులే యొనరింపఁబూనితిన్. 20

చ. ననువరియించె నంతట ను ♦ సమ్మగు వేడుక మీఱఁగా ముద
మ్మున ననుఁబోలరెం చెవరు ♦ పొందుగ నేనటులే వరించితిన్
మనసిజతాపభారమున ♦ మగ్గుచుఁ దాళఁగలేక యీపయిన్
గనఁబడె సౌఖ్యసంపదలు ♦ కాంతరో! వేఱుగఁ జెప్పనేటికిన్. 21

మ. కవితాకాంతయు నేనునున్ గలసి వే ♦ డ్కల్ పిచ్చలింపంగఁ ద
త్కవితాలీలలఁ దేలుచున్ మునుఁగుచున్ ♦ గాఢానురాగమ్మునన్
నవకాంతిన్ వెదఁజల్లు పుష్పలతికన్ ♦ నానాప్రకారమ్ములన్
భువిసంచారము సేయుచుంటిమెటులో ♦ మోక్షంబపేక్షించుచున్.

చ. సవతి తటస్థమాయెనని ♦ చానరో! కోపము జూపఁబోకు మా
కవియుట మానఁబోకు తమ ♦ కంబునఁ దీరికఁగల్గువేళలం
దవిరళ ప్రేమ నీపయిని ♦ హాయిగఁజూపెదఁ గాని ప్రేయసీ
కవనము వ్రాయువేళఁ బొడ♦గట్టదు సుమ్మి భవత్స్వరూపముల్.23

చ. నిను వరియించి వేఱొకతె ♦ నేనెటు లొల్ల వరించితంచు నె
మ్మనమునఁ గోపమూనకుము♦భామిని చెప్పెద నొక్క-వాక్యముల్
వినుము పితృప్రసిద్ధముగ ♦ నిన్ను వరింపక మున్నె దానిపై
మనసును బెట్టినాఁడ ప్రథ♦మంబున నాపయి నిన్నుఁగోరితిన్.24

ఉ. నాకొక నాతియున్నదని ♦ నాతిరో! వేఱుగఁ జెప్పనేటికో
లోకమెఱుంగు సంతయును♦లోల విశాల మృగాయతాక్షిరో!
నాకథ నీవెఱింగియును ♦ నమ్మిన నన్ను వరించుటేల? ఆ
పైకి నికన్ వహించుటది♦భావ్యమె లోకము నిన్ను మెచ్చునే?25

ఉ. నీకిప్పుడేది లోటు ధర ♦ నిన్ గలచిత్రము లన్ని చూపితిన్
గాక సుఖాన్నిష్టములు ♦ గల్గఁగ నీయ కనేకరీతులన్
జేకొని ప్రేమభావమున ♦ నిన్నెదఁ జేర్చితిఁ గౌఁగిలించితిన్
నాకవితాలతాంగివలె ♦ నమ్మితి నిన్నును నెమ్మనమ్మునన్. 26

ఉ. కాని యొకింత భేద మిది ♦ గప్పెదనన్న యదార్థవాక్యమా
దానికి నేమి సేతు గుణ ♦ ధర్మముబట్టి వచింపఁగాఁబడెన్
దీనికి నెమ్మనమ్మున స ♦ తీ! విలపింపఁగనేల? క్రైతలో
దానికి నేర్పుఁగల్గె నిను ♦ దాటఁగ వాదము పెంచనేటికిన్.27

ఉ. అయ్యది కారణంబు మన ♦ మర్పణఁజేయఁగ దాని కంతగాఁ
గయ్యమెఱుంగ దెప్డు నొక ♦ కాలమునందును గష్టపెట్టలే
దెయ్యెడనైన నన్ను వరి ♦ యించినదాది వినోదలీలలన్
నెయ్యముదియ్యముల్ సలిపి♦నేర్పునఁగీర్తిగడించె ధాత్రిలోన్.28

గీ. నాఁడుమొదలు నేఁటివఱ కే ♦ నాఁడునైన
బాధకం బనుమాట నా ♦ వ్వలేదు
ఎట్టి శుభముహూర్తమున వ ♦ రించెనొక్కొ ?
సకలసద్గుణసాంద్ర నా ♦ చంద్రవదన. 35

ఉ. దానివిలాసవైభవము ♦ దానిమనోహరరూపకాంతియున్
దానిప్రసన్నదృష్టియును ♦ దానిచమత్కృతియున్ ప్రభావమున్
దానివిశాలనేత్రములు ♦ దానియొయారము దానిఠీవియున్
దానిమిటారిపల్కులును ♦ ధాతకునైన వచింపశక్యమే ? 36

ఉ. దానికి నీకు సాటికల ♦ దా? యొకటైనను జెప్పుడన్న నె
ట్టానికగాను నీవిఁకల ♦ చెప్పుము బూనుచు మాటిమాటికో
మానిని! స్తోత్రపాఠములు ♦ మాను మానుము మానుమన్న నెం
చేసియు నాసలేక వది ♦ యుంచవ దేటికి? కృత్రిమాటలన్ .37

ఉ. మాటికిఁ బిల్చియుంచు నను ♦ నెల్లపుడున్ గసునింపఁ జేయఁగా
నాకికి నాలతాఁగెపయి ♦ నేలవహింతువు కిస్క దానితో
మాటలు సెప్పఁగాఁ గొను స ♦ మర్థతయున్నదె నీకు జెప్పుమో
బోటి వృథాప్రసంగములఁ ♦ బుచ్చెద వేటికిఁ గాల మింగతిన్ .38

శా. పాపంపున్ సుపలేల యీ సతిసిఁ జేఁ ♦ బట్టంగఁ గల్యాణముల్
ప్రాపించెన్ శుభముల్ ఘటించె ధన మా ♦ పాదింపఁగానయ్యె ని
ష్పాపుంగా నొనరించె సత్కృతులు స ♦ ల్పన్ జేసి సౌఖ్యంబు నా
కేపారెన్ మనమందు శాంతిఁ గొని తెం ♦ తేనిన్ సఖీరత్నమా! 39

మ. కవితారాజ్యము చేతికిచ్చె మిగులన్ ♦ గారుణ్యమున్ బూని దా
ని వినోదంబులు సెప్పఁగాఁదరమె వా ♦ ణీపీఠుణంబబ్బె దా
ని వరింపంగ ని కేమికావలయునో ♦ నీ రేజపత్రేక్షణా !
వివరింపన్ బనిలేదు చేనికయినన్ ♦ విజ్ఞానులౌ వారికిన్. 40

ఉ. అంతట చక్రవర్తి నయి ♦ హాయిగ భోగము భాగ్యమెల్ల న
త్యంతము పొందుచున్ సుఖము♦నందుచు మెత్తని పుష్పశయ్యలన్
వింతగు నందనంబులను ♦ నిండగు చందన చారుచర్చలం
దెంతయు నా సతిన్ గలసి♦ స్వేచ్ఛగ నాళ్లు బుచ్చుచుంటొగిన్.41

చ. పిలిచినయంతలోనఁ గనుఁ ♦ బ్రేమమునం జూపుచు వచ్చి నాదెసన్
నిలచి మనోహరాకృతిని ♦ నిక్కగఁ జూపుచుఁ బ్రాణనాథ! నన్
బిలచిన కార్యమేమనుచు♦ నెయ్యము దియ్యము నెంతయేనియున్
జిలుకుచుఁ జిల్కపల్కులను♦ జెప్పిన దెల్లను గూడఁగాంచినన్. 42

చ. మఱియొకనాఁటి రాత్రి క్షణ♦మాత్రము కన్నులు మూసినంత నా
కరమును బట్టి లేపి యుక్కు ♦ గాఢతమంబగు నిద్రఁ జెందఁగాఁ
గరము విషాదమయ్యెనని ♦ గాసిలిఁ జెందె నకేమి చెప్పుదున్
మఱువఁ దలంచినన్ మఱువ♦నాతని మాతృకాలమేసియున్.43

ఉ. నీకును దానికిన్ గలదు ♦ నీరజగంధి! యొకింత భేదమున్
నీకెఱిఁగింతు విన్మతన ♦ నే స్మరియింపఁగఁ జేయు నెప్పుడున్
నీకగు వంటి మూర్ఖతన ♦ గాంచినఁ గప్పుడుఁ బోదు కాన చీ
కాకగు జెంతలే డెప్పుడు ♦ కాంతరో! నీకు గొప్పయేకదా!44

చ. తనపనికన్న వేఱొకటి ♦ తప్పుగఁ జూచు సహింప దెప్పుడున్
బనిఁ గొని చేసి తేనికను ♦ పట్టును గన్నులఁ గట్టినట్లు; ఎం
తసి ప్రతిమాలువాఁడు కుల♦ధర్మము దప్పని సాధ్వి యాటచేఁ
దసవశమైతి నెల్లపుడు ♦ దానికి దాన సుఖంబు గల్గుటన్. 45

ఉ. స్నానము సంధ్యయున్ వదలి ♦ నాడను నిద్రయు మానివేసితిన్
మానితి సర్వకార్యములు ♦ మానినిఁ గూడినదాది నీవయిన్
మానితిఁ బ్రేమనుంచుట న ♦ మస్తసుఖంబులు ధారవోసితిన్
దానికిఁ గాన్కగా సఖియ!♦నాకును నీకును వాదమేటికిన్. 46

గీ: అగ్నిసాక్షిగ నిన్నుఁ బెం ♦ డ్లాడుకతన
పశువరాదింక నిన్నెప్డు ♦ పితృశీల
కాంతరాదింక సౌఖ్యంబుఁ ♦ గూర్చుచుందు
వగవనేటికి నీవింక ♦ వనితమిన్న. 47

ఉ. నిన్నువరించినంత తరు ♦ ణీ! గృహకృత్యములన్ని శ్రద్ధతో
నెన్నఁడు బద్ధగించక వ ♦ హించుటఁ జేసి యశంబునిల్చె; భా
గ్యోన్నతిఁ గాంచఁగల్గితిఁ బ్రి♦యోక్తులనొప్పెడు లక్ష్మివోలె సా
భ్యోన్నతిఁ గూడగాంచితి య♦థోచితరీతిని నైహికేచ్ఛలన్.48

మ. ఒకనాఁడో బంధులనాదరించు టెటులం ♦ జూపింతువేమో సఖీ!
యకలంకంబగు చిత్తవృత్తి నిపుడా ♦ యాచార వృత్తంబులన్
బ్రకటింపన్ బనిలేదుగాని గృహమం ♦ ర్యావల్ విలోకించుచో
సకలంబున్ భవదీయవృత్తిపయివన్ ♦ సాంతుష్టుగా నిల్చెడిన్.49

ఉ. అందుకుగాను నిన్ను మన ♦ మందున నిల్పితిఁ బెద్దభార్యగా
డెందమునందు నీవయిన ♦ యిందిరప్రియమ్మును దాల్చినాఁడ నా
నందముతోడ నిన్ను సద ♦ నంబున నిల్పితి నాలతాంగితోఁ
బొందికమీఱ నుండుమన ప్ర♦మోదము గూర్చుము సౌఖ్యమేర్పడన్.

ఉ. మానక మీరలిట్టుల్ కలహ ♦ మాడినవేళఁ బరిశాంతముండునే
మానసమందు నాకు లవ ♦ మాత్రమునైనఁ దదేకనిష్ఠతో
దేనినిఁగాని చేయుటకు ♦ దీరదుగావున మీర లిద్దఱున్
జ్ఞానగుణాఢ్యలౌచు నొక ♦ కాలమునైనను బాయఁబోకుఁడీ.51

చ. నినువిడనాడినట్లు నను ♦ నీవును వీడెదవంచు చెఱింగి నీ
కనుగుణమైన కైతమును ♦ నంతగఁ జెప్పఁగలేదు చెప్పినన్
బనులను గట్టిపెట్టుదువు ♦ నావలె నంతట నట్టికార్య సా
ధనము లభించఁబోదు వని ♦ తా! గృహధర్మము లాచరింపుమా.

గీ. భార్య లేకున్న సంతాన ♦ భాగ్య మెద్ది ?
సంతతిం గనలేని నరుని ♦ జన్మమేల ?
కవన మెఱుంగని వానికే ♦ ఘనత వచ్చుఁ
గాన ముఖ్యంబు లీ మూఁడు ♦ గాంత నాకు. 53

గీ. ఆ సరస్వతీకృపఁ గల్గి ♦ నంతఁ గల్గెఁ
గవిజనారాధ్య బిరుదునై ♦ భవము నాకు
సరయ శిష్యుల నిల్పితి ♦ నచ్చటచటఁ
గీర్తిఁ బ్రకటింపఁగా రెంచి ♦ కవివాణి ! 54

చ. నిలిపితి నాంధ్రదేశమున ♦ నేర్పలరారెడు శిష్యసంతతిన్
వెలఁగితి దేశదేశముల ♦ సిద్ధయశంబును గాంచి పెంపెయిన్
గొలిచితి లక్ష్మరాయ నృప ♦ కుంజరునిన్ గవితాలతాంగితో
వెలసితి నాట్సభన్ గవిత ♦ విశ్రుతికెక్కని కేమి కొఱతన్. 55

ఉ. కొల్లపురంబునందున న ♦ కుంఠితభక్తిని వెల్గశించి నే
నల్లన పెద్దవారలహ ♦ హా! యని మెచ్చఁగ సంఘమునందొగిన్
మెల్లనఁ గూర్చినాఁడఁ దరు ♦ ణీ! కవితానటి ప్రోత్సహింపఁగా
నెల్లవిధమ్ములన్ గణన ♦ కెక్కిన మిత్రులు నాదరింపఁగన్. 56

ఉ. దానిబలంబుచేతనె గ ♦ దా యొకసంఘము నుంచుచుం గూర్చి య
జ్ఞాన జయంబుఁ గాంచి సమి ♦ తద్వయుసత్కృతు లెన్నియేనియున్
మానక జేయుచుంటి మన ♦ మానసబలంబును బాసి యందుచే
దానికి నాంధ్రలోకమునఁ ♦ దక్కువగాని యశంబు నిల్చెడిన్. 57

ఉ. ఈ పొక సభ్యురాలవయి ♦ యీవిషయంబు నెఱుంగకుంటివే
యేవిషయంబుఁ గూర్చి లిఖి ♦ యింతు మొయయ్యదియప్పుడప్పుడే
శ్రీవిలసిల్లుఁ బత్రికలఁ ♦ జేరుటలేదె ? నృపాలచంద్రు లా
హా! వినియుండలేదనరె ♦ యట్టి యపూర్వ విచిత్రసంగతుల్. 58

శా. ప్రారంభించినదాది విఘ్నమెపుడున్ ♦ రానీక పోషింపఁగా
శ్రీరాజ్ఞీమణి రత్నమాంబ సతియున్ ♦ జేయూతనిచ్చెన్ గదా
శ్రీరమ్యంబగు "వైజయంతి" విభవ ♦ శ్రీకాంతిఁ జేకూర్చి వి
స్తారామోదము నింపదేమనకు కాం♦తా! యేటికీవాదముల్.59

ఉ. ఈ విషయంబు సంశయము ♦ నించుకగాని కొలంతలేక స
ద్భావముతోడ సన్నుతులు ♦ వర్యునిగా భజియించుచుండు శి
ష్యావళికిన్ వచించితి స ♦ మంచితబుద్ధి గ్రహించె సంతయున్
దాపిని నా "సరస్వతి" ము♦ఖమ్మున నీపరమార్థతత్త్వమున్.60

ఉ. నాయుపదేశవాక్యములు ♦ నానయముల్ స్మరియించి పేర్మితో
నాయడుగుల్ భజించి యొక ♦ నాఁడును మానక భక్తిభావముల్
నాయెడ నైనసంగతి సు ♦ నమ్ముగనిల్పు సరస్వతీసతిన్
శ్రీయును వాణియున్ గలసి ♦ చెల్వుగఁ జూతురుగాక నిచ్చలున్.61

ఉ. నేనును నా "సరస్వతి" యు ♦ నేర్పున జీవితముండుదాక యి
ట్లే నియమంబుఁ బూని లిఖి♦యింతుము రాత్రులయందు నిద్రయేన్
మాని విచారమేమి కిఁక ♦ మానిని! సత్కవితాలతాంగి మా
పై నెనరూని లోఁగగను♦పట్టదు మాకొకయించుకేనియున్.62

శా. కాంతా! యింతసుఖంబునిచ్చెఁ గవితా♦కాంతావిహారంబు నే
నెంతో కష్టమొనర్చి కాంచితి నిదే ♦ యేడేండ్లు పాలించితిన్
బంతంబున్ వహియించి మానుమనుచున్ ♦ మాట్లాడఁగాఁ జెల్లునే?
చింతింపన్ వలదింక దీనికొఱకై ♦ చీకాకులన్ జెందుచున్. 63

చ. తుదిపలుకుల్ వచింతునిఁక ♦ తొయ్యలి! శ్రద్ధనుబూని విన్మ నీ
కిది శుభముల్ ఘటించు నిది ♦ యొక్కడుభక్తిని విన్నవారికిన్
జదివినవారికిన్ గలుగు♦సౌఖ్యము మోక్షము నిందు నందునన్
విదితముగాఁగఁ జెప్పితిని ♦ వీడకు దీనిఁ బఠించుచుండుటల్.64

# స్నేహలతా కవితాసంఘమువారిచే ప్రకటింపఁబడిన గ్రంథములు.

---

| | | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|
| 1 | రాఘవశతకము | ... | 0 | 2 | 0 |
| 2 | మాధవశతకము | ... | 0 | 2 | 0 |
| 3 | ధ్రువచరిత్ర | ... | 0 | 4 | 0 |
| 4 | సరస్వతీశతకము | ... | 0 | 2 | 0 |
| 5 | సరస్వతీ రామాయణము | ... | 1 | 0 | 0 |
| 6 | పతివ్రతాశతకము | ... | 0 | 4 | 0 |
| 7 | భారతనీతులు (Approved.) | ... | 0 | 4 | 0 |
| 8 | హోసన్న భక్తినైరాశ్యములు | ... | 0 | 2 | 0 |
| 9 | వైజయంతీవార్షిక పత్రిక | ... | 1 | 0 | 0 |
| 10 | రామాయణ సంగ్రహము | ... | 0 | 4 | 0 |
| 11 | లక్ష్మీశారదాగీతములు | ... | 0 | 10 | 0 |
| 12 | లక్ష్మీశారదాసుభాషితము | ... | 0 | 8 | 0 |
| 13 | లక్ష్మీశారదాశతకములు | ... | 0 | 5 | 0 |
| 14 | వీరగాథలు | ... | 0 | 5 | 0 |
| 15 | సుకన్య | ... | 0 | 2 | 0 |
| 16 | బ్రహ్మపుత్రోపాఖ్యానము(అను)హోగాను చరిత్ర | | 0 | 3 | 0 |

వలయువారికి కవితా సంఘము రిపోర్టు ఉచితముగ పంపబడును. అందు సర్వవిషయములును గోచరము లగును. పై అన్ని గ్రంథములు ఒకేసారి కొనువారికి సంఘమువారిచే రచింపఁబడిన మఱికొన్ని గ్రంథము లుచితముగ నియ్యఁబడును.

అడ్రెసు :—ప్రెసిడెంటు : స్నేహలతా కవితా సంఘము,
కొల్లాపురం, మొనకొండ పోస్టు,
(కర్నూలుజిల్లా.)

శ్రీరస్తు.

శ్రీమహాబ్రహ్మణేనమః.

# కవిత్వము - దారిద్ర్యము.

ఇవి రెండును బుష్పంబును దావియునుబోలె, భార్యాభర్తల
వనువున, యన్నదమ్ముల భంగి కలసి మెలసి యున్నవను ప్రసక్తి
లోకవిదితమే. పూర్వ కవులవలె నీనాఁటి కవులు వరప్రసాదలబ్ధులు
కాకపోయినను వారికిఁగల దారిద్ర్యము మాత్రము వంశపరంపరగా
వచ్చుచున్నదో యనునట్లు కవియని పేరుపెట్టుకొన్న వారికందరికిని
లభించుచున్నది.

ఈమానవ ప్రపంచమున మానవుఁడే కార్యము తలపెట్టినను
నిర్విఘ్నముగ ముగియవలెను. కార్యసిద్ధి కలుఁగుటకై తగినంత బుద్ధి
బలమైనను, సర్థబలమైనను, సాహాయ్యమైన నుండవలెను. ఈకా
లపు కవులు కీర్తిలాభము కుక్కలి కొఱగానిదనియే నాభావము.
పూర్వకవులు కట్లుగాక, తగినంత ప్రోత్సాహమును బ్రోత్సాహము
కుఁదోడు ధనసాహాయ్యమును గలుగుటయేకాక వారికాలపు
రాజన్యులచే నాఁటికమున నవతరించిన దైవసమానులని పూజిం
పఁబడిరి. నాఁటిరాజులు వారిని భక్తితాత్పర్యములతో గొల్చుటయే
కాక వారికి సంసార దారిద్ర్యమును దొలఁగించు ధనధాన్యసంపత్తిని
కల్పించిరి. ఎట్టిపరిచారమును లేక సుఖానంద సంభరితాత్ములై, రాజా
ధిరాజులచే గౌరవింపఁబడి, వారి యాస్థాన విద్వాంసులై, కవులై,
గురులై వెలసిరి? బ్రహ్మలై యెవ్వ పూర్వకవి శిఖామణుల కసా
ధ్యంబులగు కార్యంబు లుండునా? 'ధనమూల మిదం జగత్' ని
కాదా? సాధింపరాని మహాసాధనము లన్నియు ధనసాధనముచే సాధిం

పవచ్చును గదా? అట్టిచో రాజాస్థానమం దున్నవారికి ధనమన్న 'సంకల్పితార్థపేటి' కదా. తన్మూలమ్మున మహావైభవ విభ్రాజితులై యేకొదవయును లేక యనేక సద్గ్రంథములను రచించి వన్నెయు వాసి యుం గాంచిరి. ఈనాటికవులు వరప్రసాదలబ్ధులు కాకపోవుట యటుండగా నెంతసమర్థత కలిగియున్నను నంతరాయము లెన్నియో కలుగుచు, దారిద్ర్యబాధలచే నలిగిపోవుచు నెట్టికార్యములయందును సంకల్పసిద్ధులు కాకున్నవారు. కాలవైపరీత్యముకూడ కొంతకారణ మని చెప్పవచ్చును. ఒకచో నివురుగప్పిన నిప్పువలె సత్కవిరాజము పరికాశించుచున్నను, వారి తేజఃప్రభావము గుర్తెఱుంగువారెవరు?

ఈనాఁడు విద్యాగంధమెఱింగిన రాజరాజనరేంద్రునివంటి రాజశేఖరుండును, కవితాసారమెఱుంగు శ్రీకృష్ణదేవరాయలవంటి నృపపుంగవుండును, కవితారసజ్ఞుండగు భోజరాజువంటిసత్ప్రభువును నుదయించినచో గవితాకంజాక్షి కమూల్యాభరణంబులను గట్టిపెట్టి, కవితాలతాంగులను జేబట్టి, కవితాకన్యాప్రదాతలను బంగరుపల్లకి నెక్కించి యూరేగించి వారికి బ్రహ్మరథము పట్టకపోదురా?

కవులు రాజుల నాశ్రయించుట, రాజులు కవిరాజుల బోషించుట విధ్యుక్తధర్మమై యున్నది. ఈబాంధవ్య మీనాఁటిది కాదు. తరతరములనుండియు వచ్చుచున్నది. రాజధర్మములలో నిది ప్రధానమైనది. ధనరాజులు విద్యాధనరాజులకన్న మిన్నయని తలఁచుట భావ్యముకాదనిరో?

'తద్ధనాధికులపట్టున గర్వము మానుటొప్పగుఁ'

అని వచించిన భర్తృహరివాక్యము సార్థకముచేయ నెంచిరో? శ్రీకృష్ణదేవరాయలు పెద్దనార్యు నెట్లుగౌరవించెనో విశదమే కదా! విద్యాగంధ మెఱింగినవానికే తత్ప్రభావమును దెలియఁగలదు. ధనమొక్కటె

నను నార్జింపవచ్చును కాని విద్యాధనము నార్జించుట సులభము కాదు. బహుజన్మకృత సుకృతతపఃఫలముచేతనుగాని విద్యలభించదు.

‘ విద్యలలోపల నుత్తమవిద్య కవిత్వంబు ’

కాన నది శ్రీసరస్వతీ కరుణాకటాక్ష శ్రీలచే లభించునుగాని యన్యథాసిద్ధింపదు. రవికాననిచోటుల కవి చూడగలడు. ఏవిషయమందెట్టిరసంబు చొప్పించవలయునో, యేపట్టున నేరసంబు జిలుకవలయునో సమయోచితంబుల నొప్పు మృదుపద జాలమునుబ్రోగుచేసి సమయానుకూలముగ, కవిత్వమతల్లి జనుల నానందార్ణవమగ్నులుగ జేయఁగల వాక్పుణ్యము కవికిగాక మఱెవరికి గలదు ?

ఇట్టి నవరసంబు లొలికించు కవితాసామర్థ్యము కలిగి, సర్వజనాకర్షణీయమై యెఱుగు శక్తిని గాంచిన సత్కవిరాజుల కేయూరాలల నుండి దొరలుచున్నదో గాని జలప్రవాహమున కడ్డుపడినట్లు వారి కవితాధారా ప్రవాహమున కడ్డుగనిలచి యీదుర్భర దుస్సహ దారిద్ర్యము వారిని వారిస్పృషిస దుఃఖము చేయుచున్నది.

ఎట్లో సత్ప్రబంధములు రచించినను ధనలేమిచే నట్టిగ్రంథరాజములు నచ్చుపడక మూలమూలల డాగవలసి యుండెను ఇట్టి సందర్భములో పూర్వకవులకు నట్టివిషయము సంభవమైనను, యీనాఁటి కవుల సరిపోల్చుట న్యాయము కాదు. ఒక్కొక్క కవి కొక్కొక్క శక్తియుండును. ఐహికాముష్మిక సుఖంబులిచ్చు శ్రీమద్భాగవతము రచించిన పోతనామాత్యుని దారిద్ర్య దుఃఖంబు తెలఁచుకొన్న నేమానవుని హృదయము నీఱు కాకుండును? కాని యీసందర్భమున నొక్క వాక్యము చెప్పవలసియున్నది. మహాకవులు తామెంత దారిద్ర్యబాధలచే గడుఁగడు స్రుక్కి తపించుచున్నను జేసాచి యెఱుంగరు. ఇది వారికి ఘోరశపథమై యున్నది. ప్రాణములనయినను గోల్పోవుట కిష్టపడినవారు కాని ‘ దేహి ’ యను శబ్దము వారినోటనుండి వెడల

లేదు. కవియనునట్టివానికది తగదనియే వారిభావము. అనేకమంది మహాకవులు ప్రకాశమానమైన రత్నములు వజ్రవైడూర్యములు సముద్రములో వణఁగిపోవునట్లు వారల యోగ్యతా, ప్రభానములువారు సజీవులై యుండగా లోకవిదితము కాకుండగనే మరణించిరి. కానిమ్ము సహజమగు కీర్తి నశింపదు కదా? అట్టివారు భౌతికశరీరము చాలించినను వారి కీర్తికాయము నల్దెసల నాఁటికినేఁటికి వ్యాపించుచున్నది కదా?

పాపము! భగవత్స్వరూపుండగు పోతనార్యుని దారిద్ర్యము వర్ణింప నలవికానిదని యీదిగువ నుదహరించిన బ్రహ్మశ్రీవడ్డాది సుబ్బారాయ కవిశేఖరుని పద్యమువలన వెల్లడియగుచున్నది.

సీ. రాజరాజేంద్ర సా ♦ మ్రాజ్య భోగములందు
నన్నయభట్టు పా ♦ ల్గొన్న వాడు
మనుమసిద్ధిశ కృ ♦ మాచక్రి మరుదార
దిక్కన్న తనచేత ♦ దిప్పినాఁడు
వీరభద్రారెడ్డి విరివియా ♦ విభవంబు
శ్రీనాధుఁడెంతో భు ♦ జించినాఁడు
రాయలయొద్ద గా ♦ రవమొంద పెద్దన్న
యెక్కుడందలము నా ♦ రేగినాఁడు

గీ. వెరగుపడనేల? వారిక ♦ విత్వమునకు
బ్రదుకుపై యాసగూడను ♦ బాడుసేయు
ఘోర దారిద్ర్య దుఃఖంబుఁ ♦ గుడుచుచకట
యేగతిని బల్కెఁ బోతన్న ♦ భాగవతము?

“ బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్ ”

“ఇమ్మనుజేశ్వరాధముల” కియ్యనని ప్రతిజ్ఞ బట్టుటచే పోతన్న దారిద్ర్య మనుభవింపవలసి వచ్చినదిగాని లేకున్న తక్కినవారివలె నేరాజునో యాశ్రయించి నట్టిబాధలకు లోనుగాక పోవును. కాని కృతులనమ్ముట హేయమనితలచు పోతనార్యునివంటి వేదాంతునికి జేనెడు పొట్టకై పరుల నాశ్రయించుట చెల్లదుగదా! అటులే జీవితాంతమువరకు తనప్రతిజ్ఞ నెరవేర్చుకొని ధన్యుడైన పోతనామాత్యుని కేమిలోటు ఘటించె? “జాతస్య మరణం ధ్రువం” పుట్టినవాడు దేనాటికో గిట్టకమానడు అట్టిచో జీవితమున ప్రధానమగు యశస్సును బాడొనరింపనేల? కవిత్వము రచించుటకు మనకుపూర్వకవు లెట్టి యాధారములో నడచియుందురు వారినే సర్వవిధముల నాధారముగా తీసికొనుట న్యాయ్యము.

సప్తసంతానములలోను శాశ్వతమై, ఖిలముగానిది యాచంద్రతారార్కము శోభితమైనది సత్కృతి యగుటంజేసి రారాజులు తమకీర్తి శాశ్వతముగ నుండుటకై కవుల నాశ్రయించి కృతుల రచింపజేసి తమ్ముకాలమున ధన్యులగుచుండిరి. ఇది యదార్థము గానిచో నాగరశ్రీమంతుడై “సప్తాంభోధి వేష్టిత భవత్సకల ద్వీపకలాప భూపమకుటాంచత్పద్మరాగోజ్జ్వల ప్రకటానర్గళ నిర్గళత్కిరణ శుంభత్పాదుడైనట్టి” కృష్ణదేవరాయు లేడ? పెద్దన్న యేడ? సమానప్రతిభను గాంచు టేడ?

ఈదిగువ నుదహరించిన పెద్దనార్యుని చాటుధారయే శ్రీకృష్ణదేవరాయలు పెద్దన్న నేరీతిగ పెద్దగ తద్దయు గౌరవించునో దీనికి సాక్ష్యమిచ్చుచున్నది.

సీ. ఎదురైనచో దన • మదకరీంద్రమునిల్పి
కేలూత యొసగి యె • క్కించుకొనియె

మనుచరిత్రం బందు ♦ కొను వేళఁ బురమేఁగఁ
బల్లకి తనకేలఁ ♦ బట్టి యెత్తె
బిరుదైన కవిగండ ♦ పెండేరమున కీవె
తగుదని నాడు పా ♦ దమునఁ దొడిగె
కోటగ్రామాద్య ♦ నేకాగ్రహారము
లడిగిన సీమల ♦ యందు నిచ్చె

గీ. ఆంధ్ర కవితా పితామహా ♦ యల్లసాని
పెద్దన కవీంద్ర యనినన్నుఁ ♦ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివి ♦ కేఁగలేక
వసుధ బ్రతికితి జీవచ్ఛ ♦ వంబనగుచు.

అట్టి చిత్రంబు లీనాఁ డెచ్చటైనను గలవా? అంతటి గౌరవము లభింపకున్నను దలదాచుకొనుటకైనను గొంత దయారసము వెదజల్లువారున్న చాలుగదా!

కవులకున్న భారమును విస్తరించి తద్భారమోయంగఁగాఁగల నృపుఁడొకఁడున్న చాలని శ్రీతిరుపతి కవిచంద్రములు రచించియే యుండిరి గదా!

సీ. చదువఁగా వలె శబ్ద ♦ శాస్త్రాదికమ్ములను
వీక్షింపఁగావలె ♦ విద్యలెల్లఁ
జూడఁగావలె రాజ ♦ చూడామణుల సభల్
పొందఁగావలె మహా ♦ భోగములను
వినఁగఁగావలె పూర్వ ♦ విద్వచ్చరిత్రముల్
దర్శింపవలె సుఖం ♦ దఃప్రశంస
తిరుగఁగావలె దేశ ♦ దేశాల వెంబడిఁ
బడవలె బడరాని ♦ పాటులెల్ల

గీ. కవులు కవులన్న మాత్రాన • కవులు గారు
ఎంతభారమ్మొ గండాక • పేశ్వరులకు
నెఱుఁగకుందురె? సినాంట్రి • నృపతిసూనులు
శ్రీయానంద గజపతి • క్షితితలేంద్ర!

మ. కవితామాధురిఁ గ్రాగ్రహించి "యిది శ్లా • ఘ్యం బిద్ది శ్లాఘ్యంబుగా
దు విశేషం బిట నిర్విశేషమిట మా • ధుర్యంబిటన్ వహ్వారే?
కవిరాజా!" యని మెచ్చి యిచ్చు నృపుడో • కండ్లైన గన్పట్టనచో
గవినై పుట్టుటకన్న పాప ఫలమా • కంబుండునే? భూవరా!

పూర్వకవులయందుఁగల దారిద్ర్యమునం దెట్టి సమభాగములు పంచుకొనిరో యట్లే వారి గౌరవ శ్రీ ప్రతిభా విశేషములయందును నేఁటికవులు పాల్గొన్నవారు. అంతేగాని, యుదరపోషణార్థమై కవులమని యీనాఁటి కవులును బయలుదేరినవారు కారు. వారి వలె వీరును సర్వదా సత్కరింపఁబడుచునే యున్నవారు.

శ్రీతిరుపతికవులసాధారణ పాండితీగరిమ కలవారై, సత్కవిరాజులై, నానారాజ సందర్శనార్థులై, కృతార్థులై సన్మానింపబడిరను విషయము మనము కన్నులార చూచినదే కాని యతిశయోక్తి కాజాలదు గదా? కేవలము ప్రభుకటాక్షశ్రీలనే కోరినవారనియు, ద్రవ్యాసక్తి దక్క కీర్తియే ప్రధానముగా తీసికొని రాజదర్శనార్థులై వెడలినవారనియు యీ దిగువపద్యములు క్రమముగ వెల్లడించుచున్నవి.

ఉ. ఏనుఁగు నెక్కినాము ధర • ణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినాము స
న్మానము లందినాము బహు • మానములన్ గ్రహియించినార మె
వ్వానిని లెక్కపెట్ట కని • వారణ దిగ్విజయం బొనర్చి ప్ర
జ్ఞానిధులంచు బేరు గొని • నారము నీవలనన్ సరస్వతీ.

ఆ. ఎట్టిదానికైన • నిలలోన వెలఁజెప్ప
వచ్చుగాని కవుల • పద్యములకు

ప్రభుకటాక్షమునకు • బరికింప వెల లేదు
గాన రామభూప! • దాసి నిమ్ము.

సీ. అనుభవించితిమి దీ • వ్యద్భోగములను రా
జాధిరాజులకన్న • నధికము గను
సంచరించితిమి రా • జ్యస్థానముల పూర్వ
కవులకన్నను నిరా • ఘాటముగను
ఆర్జించితిమియింత • యతిథులకిడి మేము
ననుభవింపఁగజాలు • నట్టివృత్తి
రచియించితిమి వచో • రమణీశిరోమణుగంస
వంతమౌ లైనపరి • బంధములను

గీ. రాజమిత్రుల మదిగాక • రాజబంధు
గులము కవిరాజులము పదు • గురుకలట్టి
కొలమువారము మాకెందు • కొదువ లేదు
కీర్తికై రాకజూమి వన • పత్రిభూప.

సీ. తగ నాత్మకూరు సీ • తారామభూపాలుఁ
డేన్గు నెక్కించి యూ • రేగఁజేసె
గద్వాల రామభూ • కాంతుండు గౌరవ
స్ఫూర్తికై బంగారు • బిరుదు లిచ్చె
నానంద గజపతి • త్ర్యామ్నేశయును దగి
న కవీంద్రులించు మ • న్నన యొనర్చె
శ్రీరాజ గోపాల • కృష్ణయాచన్నృపాలుఁ
డవధానములంచు గౌ • రవము చూపెఁ

గీ. చెన్నపురిరాజ్యమందు వ • సించు రాజ
వరులు మిము గారవింపని • వారు గలరె?

జగమెఱిఁగిన బ్రాహ్మణునకు ♦ జందెమేల ?
సరస తిరుపతి వేంకటే ♦ శ కవులార !

శ్రీనాథుడు సంస్కృతాంధ్ర కవితాసామ్రాజ్య సింహాసనాధ్యక్షుఁడయ్యు నాంధ్రకవితా ప్రపంచమును జగజ్జేగీయమానంబుగ పరిపాలించి, యాంధ్రకవితామతల్లిని ఆసేతుహిమాచలపర్యంతము బంగరు తూఁగుటుయ్యాలలో నూరేగించియు, మితిలేని కానుకలను, వెలలేని రత్నభూషణాలంకారములను బిరుదరాజంబులను బడసి నిర్మలయశశ్చంద్రికల నల్దెసల వ్యాపింపఁజేసి రాజాధిరాజులచే సన్మానంబులను బొంది యాంధ్రకవికాలలామకు వివిధమణిమయ మాణిక్యాంబరములు గట్టఁబెట్టి యాంధ్రకవితా దేశమునకు బెద్దయని పొగడ్తకెక్కి నన్నయ వాసియుం గాంచి ప్రకాశించుచు నాకసంబున వెలుంగు చంద్రబింబమున కీడువచ్చు సత్ప్రతిభను వెదజల్లినవాఁడయ్యు నవనావదశయందు ఘోరదారిద్ర్యము ననుభవించినట్టు లీక్రిందిపద్యములు తెల్పుచున్నయవి. తన ప్రతిభావిశేషముచే మహదైశ్వర్యమును గడించినను, తొలుదొల్త నావరించిన దారిద్ర్యదేవత విడువదు కాబోలు. దీనిసిబట్టి కవియనువానికి దారిద్ర్యము తోడునీడవలె వెనువెంట నంటుకొనియుండును గాని వదలదని నిశ్చయమగుచున్నది. ఈకవిపడినపాట్లు తలచుకొన్న గుండెలు బ్రద్దలగుచున్నవి :—

సీ. కవిరాజు కంఠంబుఁ ♦ గౌఁగిలించెను గదా
పురవీధి నెదురెండ ♦ పొగడదండ
సార్వభౌముని భుజా ♦ స్తంభ మెక్కెనుగదా
నగరివాకిట నుండు ♦ నల్లగుండు
ఆంధ్రనైషధకర్త ♦ యంఘ్రియుగ్మంబున
దగిలియుండెను గదా ♦ నిగళయుగము
వీరభద్రారెడ్డి ♦ విద్వాంసు ముంజేతి
వియ్యమందెను గదా ♦ వెదురుగొడియ

గీ. కృష్ణవేణమ్మ గొనిపోయె ♦ నింతఫలము
బిలబిలాక్షులు దినిపోయె ♦ దిలలుఁ బెసలు
బొడ్డుపల్లెను గొడ్డేటి ♦ మోసపోతి
నెట్లు చెల్లింతుఁ దంకంబు ♦ రేచనూర్లు.

సీ. కాశికావిశ్వేశుఁ ♦ గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లే ♦ రాయఁడిచ్చుఁ
గైలాసగిరిఁబండె ♦ మైలారువిభుఁడేగ
దినవెచ్చ మేరాజు ♦ దీర్పఁగలఁడు
రంభఁగూడెఁ దెనుంగు ♦ రాయరాహుత్తుండు
కస్తురి కేరాజు ♦ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁడయ్యె వి ♦ స్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని ♦ పంక్తిఁ గలదు

గీ. భాస్కరుఁడు మున్నె దేవుని ♦ పాలి కరిగెఁ
గలియుగంబున నిఁక నుండ ♦ గష్టమనుచు
దివిజ కవివరు గుండియల్ ♦ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ ♦ డమరపురికి.

ఆహా యీవాక్యములు హృదయపుటభేదన మగుచున్నవిగదా! ఇట్టి వచనంబులు మహాకవివాక్కుననుండి వెడలవలసివచ్చెను గదా!

ఆంధ్రకవులటుండ సంస్కృతకవిరాజులు పడ్డపాట్లు వారికేయెఱుకగాని యిట్టిదని వర్ణింపఁ జాలము. దారిద్ర్యదేవత కాళీవరప్రసాదలబ్ధుండై 'త్వమేవాహం' అని కాళికాదేవిచేతనే బహూకరింపఁబడిన కాళిదాస మహాకవికిని తప్పదయ్యె. 'మాఘే మేఘే గతం వయః' అను మల్లినాథ సూరి వచనార్హమైన మాఘకావ్యకర్తయగు మాఘమహాకవికిని తటస్థమయ్యె.

శ్లో. జాతే జగతి వాల్మీకౌ కవి రిత్యభిధా భవత్,
కవీ ఇతి తతో వ్యాసే కవయ స్త్వయి దండిని.

అను లోకోత్తరప్రశంసకు బాత్రుఁడగు దండిమహాకవికిని దాపుర మయ్యె. వీరు వారననేల? దారిద్ర్యదేవత సామాన్యకవులనే వరించుచుండ నసాధారణ ప్రజ్ఞాదురంధరులగు మహాకవులను జేబట్టకవిడచునా? తుదకు మాఘకవి ప్రాణములనుగూడ నపహరించె. పాపము! ఈకవి సంతుష్టహృదయుఁడయ్యు నింటివద్ద భార్యాపుత్రుల వేదనలచే పీడింపఁబడి కుచేలునిచందాన యాచనావృత్తిచేత కాకున్నను పోవలసిన దుస్థితిరాగా నెటో రాజాశ్రయమును గాంచినవాఁడయ్యె. ఆరాజును సకలసద్గుణ సంపన్నుండును, ధర్మావతారుండును, విద్యావినయాభిరాముఁడును నగుటచే నాకవి కొట్టిసత్కారమిచ్చిన నాతని విద్యకు సమానమగునా యని సందేహడోలికల నూగులాడుచు నెట్టకేలకు నాలోచనామగ్నుఁడై సత్కారమియ్యకనే వానిని పంపె.

అయ్యో! తుదకు సామాన్యసన్మానమునకైనను నర్హతలేకున్నదా? అబ్బా! దారిద్ర్యపరిభావ మెంతబలమైనదో? యని వగచుచునే మాఘకవి ప్రాణములనువదలె. ఈవృత్తాంతమెఱింగి, రాజు విచారాక్రాంతుండై 'తానొకటి తలచిన దైవమొకటి తలచె' నని దుఃఖించి వాని భార్యాబిడ్డలకు తగిన ధనధాన్యసంపత్తి కల్పించి రక్షించె. కాని తనజీవితకాలములో మాఘకవికి మాత్రము దారిద్ర్యమే శరణమైనది.

పర్షియా ఉర్దు మహాకవులును నిట్టిబాధలకు లోబడినవారే. 'సాది' అను మహాకవికృత గ్రంథములు నేటివరకును మన భారత గ్రంథమువలననే పంచమవేదమనబడుచు విరాజిల్లుచున్నవి. శ్రీమద్రామాయణ మహాకావ్యమువలె నీతులచే నలరారుచు, శ్రీమద్భాగవతంబుకైవడి భగవానుని లీలావిశేషంబులచే నొప్పిదమైయున్నది.

కాని " సాది " మహాకవి యంతటి సమర్థుండయ్యు ఘోరదారిద్ర్యి మనుభవించె.

ఆలీమ్, హాలీం యను ప్రసిద్ధచరిత్రకారుల జీవితములును చిరస్మరణీయంబులే. నవలలు వ్రాయుటలో నుర్దుభాషయందు వీరికన్న మిన్నలు లేరు. హాలీం మహాకవియయ్యు మరణానంతరకర్మల నాచరించుటకైనను తగిన ద్రవ్యములేనివాడై మరణించెను. మహాకవుల చరిత్రము లిట్లులున్నవి. రతన్ నాక్ అను కవిశేఖరుండు ' ఫసానె ఆజాద్ ' అను నవలారాజంబుచే లోకమునపూజింపఁబడుచున్నవాడు.

ఇందలి కథాభాగము చిన్నదైనను తన భాషాజ్ఞానము పెద్దది గనుక యీకథకు వన్నెలు చిన్నెలు గల్పించి నవరసంబులు జిలికించి రచించిన మహాకావ్యమువలె రచించినాఁడో యనున ట్లొక మహా ప్రబంధమురీతి రచించినాడు. ఆనవల నాలుగుభాగములుగ భాగింపబడినను నొక్కొక్క దానిలో 1000 పేజీలు కలవు. మొత్తమువీద రమారమి 4000 పేజీలుగల యిట్టి గ్రంథరాజము మరేభాషయందును గానరాదని యే నానమ్మిక. అనగా నవలలో నింత పెద్దగ్రంథము లేదని నాభావము. ఇది 1908 సంవత్సరమున ముద్రింపఁబడినది. ఇక్కాలపు నవనాగరికత, దేశకాలపరిస్థితులు నందుఁగల మార్పు కథానాయకుండగు ' ఆజాత ' మహాపురుషుని ధీరోదారసంపత్తియు, గాంభీర్యాదిగుణంబులును, నౌదార్యప్రభావంబును సత్యవాక్పటిమయు శ్రీరామచంద్రునివలె నేకపత్నీవ్రతుండనఁదగు హేతువులును గల్పించి రచింపఁబడిన ముద్దులుమూటఁగట్టు నవలారత్నమా యని చెప్పదగు సద్గ్రంథము. అట్టి మహానీయుఁడును దారిద్ర్యదుఃఖంబుల గుడువ వలసివచ్చె.

ఈదారిద్ర్యము కవుల నేల నాశ్రయింపవలయునని తర్కించి యిందుకు కారణము లూహించి ' ఆలీమ్ ' యనుకవి తన జీవితచరి

త్రిలో నిష్టా రచించెనని నామిత్రులొకరు వక్కాణించిరి. ఆభావ మిచట వెల్లడించి యందుపై నాయభిప్రాయమును రచించుచున్నా డను.

కవులు పడరానిపాట్లు బడి, గురుకులవాసము చేసి క్రమముగ శిక్షనుబొంది సంపాదించిన కవిత్వముగదా. అట్టి సర్వోత్కృష్టమైన విజ్ఞానమును క్షణమాత్రములో నశాశ్వతంబగు భోగభాగ్యముల కాశించి మారుత్రోవల నుపయోగించుచుండుట యదార్థముగదా ? కానిచో నస్థిరమైన యీ స్రుక్కెడు ప్రాణమునకై నిన్ని బాధల బాల్ప డవలయునా ? ఆకో ? అలమో ? తిని నిర్మలాంబువులఁ ద్రాగి, వాయుభుక్కులై, కాలము గడపుకొనరాదా ? నిత్యమై, సత్యమై, పరబ్రహ్మస్వరూపమై విరాజిల్లు మహాపదార్థమును దెలుసుకొనుట యందే కాలమును బుద్ధిని నియోగింపరాదా ? సామాన్యజనులను రాజాధిరాజులకన్న మిన్నలనియు, రారాజులను బ్రహ్మ విష్ణు మహే శ్వరులకన్న నెక్కుడుగను, సామాన్యస్త్రీలను మహాపతివ్రతా శిరో మణులగు సీతా సావిత్రి యనసూయలకన్న గొప్పగను కల్పనజేసి యదార్థమును గప్పిపుచ్చి, గోరంత గొండంతచేసి రచించుటచే మానవధర్మము నశించినదనియు, నిజస్వరూపము లడంగిపోవుచున్న వనియు దన్మూలమ్మున సత్యహాని కలుగుచున్నదనియు, నద్దాన పాప ఫుపొగు పెద్దదై దారిద్ర్యమను మహారోగముచే కవులు పీడింపఁ బ డుచున్నారనియు సమర్థించె. 'ఆతిష్' యొక్క భావము గొప్పది. అదియటులుండ నీవిషయము సూక్ష్మముగ నాలోచించిన రాజాధి రాజులయెడ లక్ష్మీసరస్వతులు వైరంబులుమాని సంచరించుచున్నా రుకదా. కృష్ణ భోజరాణ్మణులు మహావిద్వాంసులై, మహాకవులై యుండుటచేతనే గవితాగంధ మెఱింగినవారై యానాఁటి కవులను సత్కరించిరి. అట్టిచో దారిద్ర్యము వారినేల నేచలేదు ? మహారా

జాంతఃపురంబుల దేవేంద్రభోగము లనుభవించుటమాని, కుటీరముల నివసించు పేదకవుల నాశ్రయించిన లాభమెంతకలుగు ? దీనికిఁగల హేతువు కవులవలె నొరులనాశ్రయించు దుర్భాగ్యము వారికి పట్ట లేదు గనుక యింద్రుఁడవు చంద్రుఁడవని యితరుల వర్ణించు నవసరము వారికి గలుగలేదు. అట్టి నిదర్శనములును గానరావు. అందుచే వారు ధన్యులై, పూతాత్ములై, కృతార్థులై మోక్షసుఖములను బొందరైరి. పరోపకారార్థమై పాటుపడుటయందె వారు గాంచిన కవితావిజ్ఞానమును సార్థకము చేసుకొనిరి. కేవలము కవులన్ననో యట్లుగాక నిరాధారులగుటచే నొరులపై నాధారపడి వారిజీవితములను ధారపోయవలసిన వారైరి,

అందరును పోతనామాత్యులు కాగలరా ? అందుచే సమయానుకూలముగ రస మొప్పించి వారిహృదయాకర్షణమే ప్రధానమని భావించుచు వారిసంకెళ్లచే బంధింపఁబడి తదనుకూలముగ కైతము సెప్పి కాలము వెళ్లబుచ్చుచుండిరి. కేవలము పేని వారిని పొగడుటయందె తమకాలమును వెళ్లబుచ్చుటలేదుకదా ? తాము మరణించినను తమ యశస్సు మరణించకుండునటుల పెక్కుగ్రంథములను రచించుచున్నారుగదా ? ఇట్టి కవికృతగ్రంథము లనేకములుండుటచేతనే యనేకచరిత్రలును, మహాపురుషుల జీవితచరిత్రలును, రారాజుల సత్పరిపాలనావిధానంబును, నాఁటి పరిస్థితులును మనకు తెలుసుకొనుటకు నవకాశము కలుగుచున్నది. పరాత్పరునియందును బుద్ధిలయముచేసి పద్యరూపమున తన్మహిమను గానము చేయుటకు కవికి నవకాశమున్నటుల మఱేరికిని లేదు. ఎన్ని పద్యసహస్రంబులు కేవలము భగవంతునిపై దొర్లునో చెప్పఁగలమా ? బ్రహ్మజ్ఞానపర్యంతము తెలుసుకొనినగాని యనుభవమునగాని ప్రకృతిని వర్ణింపఁజాలరుగదా ? కవులన్న బ్రహ్మలని తలచుటకు సందేహమేల ? పరా

ష్ణుని లీలావతారంబుల వర్ణించు సద్గ్రంథరాజంబు లెన్నికలవో ? అందుచేతనే భగవంతుని స్మరించుటకును, గొల్చుటకును, ధ్యానించుటకును కవులకే నెక్కుడు వీలగుచున్నది. అట్టి సందర్భమున తననుగురించి యెవరుకీర్తింతురో వారియెడల నత్యంతానురాగము కలవాడై వారిమేలును గోరి వారికే బహుచిక్కులను నెక్కుడుగ గల్పించి వారికి దారిద్ర్యము ప్రధానముగ నిత్తుననియు, వారలె తనస్వరూపమెఱింగినవారలనియు శ్రీకృష్ణభగవానుఁడు భగవద్గీతలలో నుడివెను కదా !

అందుచే కవులు భగవత్ప్రియులై దారిద్ర్య మనుభవించుచున్నారని నానమ్మకము. అశాశ్వతంబులగు భోగభాగ్యములతో పనియేల ? క్షణభంగురంబులగు సంపదల కాశింపనేల ? విద్యుల్లతవలె మాయామగు జీవితమునకు ధనకాంక్షయేల ? దారిద్ర్య మునుంటచే తనే భగవంతునియందు దోషస్పూర్తైనను మనబుద్ధి నియోగించి ధ్యానించుటకు నవకాశము కలుగుచున్నది. దుఃఖసమయంబున భగవంతునుద్దేశించి తిట్టినను భగవన్నామ్యము నుచ్చరించినందులకై భగవంతునికి ప్రియమేయగును. ఏకారణముచేతనైనను క్షణక్షణమును భగవంతుని యెడబాయక తలంచిన మోక్షకారణమని యీదిగువ పద్యంబులు బోధించుచున్నవి.

ఆ. అలుకనైన జెలిమినైనఁ గామంబున
నైన బాంధవమున నైన భీతి
నైనఁ బగిలి తలఁప నఖిలాత్ముఁడగు హరిఁ
జేరవచ్చు వేఱు సేయఁ డతఁడు.

క. వైరానుబంధనంబునఁ
జేరిన చందమున విష్ణుఁ జిరతరభక్తిం
జేరఁగరాదని తోఁచును
నారాయణ భక్తియుక్తి నాచిత్తమునన్.

శా. కామోత్కంఠత గోపికల్ భయమునం ♦ గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ ♦ సంబంధులై వృష్ణులుం
బ్రేమన్ మీరలు భక్తి నేము నిదె ♦ చక్రింగంటి మెల్లన న
ద్ధామధ్యానగరిష్ఠులైన వారి జెం ♦ దఱవచ్చు ధాత్రీశ్వరా.

ఏమార్గముచేతనైనను కవులు శబ్దధ్యానపరాయణులై ధన్యులగుచున్నారని చెప్పుట సమంజసమని నా అభిప్రాయము. ఉత్ప్రేక్షాతిశయోక్తులతో గూడి సరసయుక్తమై యొప్పు కావ్యమే సద్గ్రంథముకదా. అట్టి సరసమైన కవిత్వము చెప్పు కవియే కదా కవి. అట్టిచో నూహా కల్పనచేసి చమత్కారమైన పదలాలిత్యముతో రచించుటయే ప్రధానము గాని తదితరంబులు గావు. అందుచే పొగడి కవిత్వము చెప్పుటచే దారిద్ర్యము గలుగుచున్నదనిగాని, యున్నది లేనిదానివలె, లేనిది యున్నటుల పొగడి రచించుటచే గలుగుచున్నదనిగాని చెప్పుట సమ్మతమని తోచదు. ఇది కేవలము మహాదోషమన్న కాళిదాసాదిమహాకవులు కూడ నిట్టిదోషమునకు బాల్పడియుందురా? నరాంకితమే చేయని పోతనామాత్యుని కేల దారిద్ర్యము సంభవించె?

బ్రహ్మానందజనితంబులగు గద్యపద్యముల వ్రాసికొనుటకును తన్మూలమ్మున సర్వసౌఖ్యములను బొందుటకును కవిత్వమే ప్రధానమైనది. కవితానంద రసాబ్ధి నోలలాడు మహాభాగ్యముకన్న మిన్నయగు పదార్థము వేఱొకటి లేదు. ఇంతకంటె నభిలషించు పదార్థంబు వేఱొండు గానరాదు. ఇంతకంటె కర్ణపుటంబుల నాకర్షించు మఱొండు సంగీతరవంబు లేదు. ఇంతకంటె నయనచకోరంబుల కింపగు ప్రాణంబు లేదు. ఇంతకంటె సౌందం బమందానందంబు గావించు ఇంద్రమహేంద్రజాలంబు లేదు. ఇంతకంటె కర్ణంబులు పవిత్రంబుగ జేయు పుణ్యంబు లేదు. ఇంతకంటె జిహ్వేంద్రియంబుల నలంకరించు జీవనంబు లేదు. ఇట్టి సౌభాగ్య భాగ్యవిభవశ్రీ సంపదం జేబట్టుట కవి

యను వానికి బహుసుకృత సుకృత తపఃఫలంబులచే లభించిన దివ్యదో్భగంబుగదా! రాజరాజులు మెచ్చు విద్యయే విద్య. అందుచే రాజాస్థానపదవి నభిలషించి, సంపాదించి కవులు కృతార్థులై, ధన్యులగుచుండిరి. అట్టులని నాటికవులుగాని నేఁటికవులుగాని యాత్మగౌరవమును జంపుకొని కేవల ముదరపోషణార్థమై పాటుపడినవారు కారనియు, పూర్వరాన్నమణులవలెనే నేఁటి రాజశిఖామణులును గవుల నాదరించుచుండిరనియు, వారివారి మహాత్మ్యములను బట్టి మున్ముందు రాజాధిరాజులచే సన్మానింపబడి, సగౌరవపూర్వకంబుగ బహూకరింపబడి కృతిపతికిని కృతికర్తకును నుభయలోకములయందును శాశ్వతకీర్తిని సంపాదించు కృతులను రచించిరనియు నీదిగువ గ్రంథరాజంబుల వెలయు పద్యంబులు ప్రమాణంబులై చెప్పుచున్నవి.

## —♦ శ్రీమదాంధ్రమహాభారతము. ♦—

1. చ. అమల సువర్ణశృంగఖుర ♦ మై కపిలంబగు గోశతంబు ను
త్తమ బహువేదవిప్రులకు ♦ దానముసేసిన తత్ఫలంబు త
థ్యము సమకూరు భారతక ♦ థాశ్రవణాభిరతిన్ మదీయచి
త్తము ననిశంబు భారతక ♦ థా శ్రవణప్రవణంబకావునన్.

2. క. జననుత కృష్ణద్వైపా
యనముని వృషభాభిహిత మ ♦ హాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధిక ♦ ధీయుక్తి మెయిన్.

## —♦ శ్రీ భీమేశ్వర పురాణము. ♦—

1. సీ. వినిపించినాఁడవు ♦ వేమభూపాలున
కఖిలపురాణవి ♦ ద్యాగమములు
కల్పించినాఁడవు ♦ గాఢపాకంబైన
హర్షనైషధకావ్య ♦ మాంధ్రభాష
భాషించినాఁడవు ♦ బహుదేశబుధులతో
విద్యాపరీక్షణ ♦ వేళలందు
వెదజల్లినాఁడవు ♦ విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాం ♦ గణములందుఁ
గీ. బాకనాటింటివాఁడవు ♦ బాంధవుఁడవు
కమలనాభుని మనుమఁడ ♦ విమలమతివి
నాకుఁగృపసేయు మొకప్రబం ♦ ధంబునీవు
కలితగుణగణ్య శ్రీనాథ ♦ కవివరేణ్య.

2. గీ. సప్త సంతానములు నాకు ♦ సంభవించె
నొకప్రబంధంబు వెలితిగా ♦ సుకృతగరిమ
నా వెలితి మాన నాపేర ♦ నంకితముగ
శివపురాణంబు తెనుఁగుగాఁ ♦ జేయు మొకటి.

## —♦ వసుచరిత్రము. ♦—

1. మ. నను శ్రీరామపదారవింద భజనా ♦ నందుణ్ జగత్ప్రాణనం
దన కారుణ్య కటాక్ష లబ్ధ కవితా ♦ ధారా సుధారాశి సం
జనితైకైక దినప్రబంధ ఘటికా ♦ సద్యశ్శతగ్రంథక
ల్పను సంగీత కళారహస్యనిధిఁ బి ♦ ల్వంబంచి వల్కెం గృపన్.

గీ. తరులతాకాది సంతతుల్ ♦ ధరణి నెచట
నిలిపి రచటనే యుండు వా ♦ నికిని గృతిసు
ఖంబునను విశ్వవిఖ్యాతి ♦ గాన కృతియె
సంతతివతంస మది మాకు ♦ సంఘటింపు.

---

## —♦ స్వారోచిషమనుచరిత్రము. ♦—

కం. భువనవిజయాఖ్య సంస
ద్భవనస్థిత సింహపీఠి ♦ బ్రాజ్ఞులగోష్ఠిం
గవితామధురిమ డెందము
దవులం గొలువుండి సదయ ♦ తగ ననుం బల్కెన్.

గీ. సప్తసంతానములలోఁ బ్ర ♦ శస్తి గాంచి
ఫలము గాఁగనునది ధాత్రిఁ ♦ గృతియ కాన
కృతిరచింపుము మాకు శి ♦ రీషకుసుమ
పేశల సుధామయోక్తులఁ ♦ బెద్దనార్య.

---

## —♦ కథాపూర్ణోదయము. ♦—

ఆ. ప్రియము సంధిలంగఁ ♦ బిలిపించి బహువస్త్ర
భూషణాది దాన ♦ ములఁ గరంబు
సంతసం బొనర్చి ♦ యెంతయు గౌరవ
మెసఁగ మధురఫణితి ♦ నిట్టు లనియె.

శా. నీచే నొక్క మహాప్రబంధము కడుం ♦ నిర్ణిద్రసారస్యలీ
లాచిత్రంబగుదాని నో యనఘ వాం ♦ ఛ[illegible]ంబు సేయించుకో

మాచిత్తంబు న వేడ్కయుండునది నీమాధుర్యధుర్యోరువా
గ్వైచిత్రిం సఫలంబు సేయుము సుధీవర్గంబు లోహా
యనఁగ.

## పాండురంగమాహాత్మ్యము.

1. క. నను రామకృష్ణకవిఁ గవి
జన సహకారావళీవసంతోత్సవ సూ
క్తినిధిఁ బిలిపించి యర్హా
సనమున గూర్చుండఁ బనిచి చతురత ననియెన్.

2. క. యశము గలిగించు నీకృతి
విశదోక్తులఁ బాండురంగ విభు చరితఁ జతు
ర్దశ భువన వినుతముగ శుభ
వశమతి నాపేర నుడువు వరతత్త్వనిధీ!

3. మ. పలుకుం దొయ్యలిమోలిచాంతి కెంపుం బాగాలు నయ్యంతిచె
క్కులఁ గ్రోలుం దెలనాకు లయ్యువిద పక్కుల్వంటి కప్రంపుఁ బ
ల్కుల తోడం గూడి చవిడియుం బొసఁగె నాకుం బద్య నాభార్చనా
కలనా పావన హస్తకంకణ ఝణత్కారంబు తోరంబుగన్.

---

## పద్మపురాణము.

1. క. అపరమేశ్వర మకుట
వ్యాపృత గంగాపరీవాహ వరకపిలా స
ల్లాపుఁడగు కవిసింగనఁ
జేపట్టక కీర్తిగలదె శ్రీమంతులకున్.

## —• ఏ లా మా హా త్మ్య ము. •—

1. క. ఏలాపది వేలాభువి
నీలీలల నిఖిలసుఖము • లెనసెడి నాక
ద్యోలమహాత్త్వమ్మును వినఁ
గా లోలత మించె సుకవి • కల్పితకృతిగన్.

2. ఉ. కావున నన్నదీమహిమ • గా నొకచిన్నకృతిన్ రచించి యం
దేవియునేనిఁ బుణ్యకథ • లేరిచి కూర్చి మదంకితమ్ముగాఁ
గావను నన్ను జేయఁగల • భారము మీయదియంచు గ్రపుం
దావినొసంగు వీటి కల • గౌతమయమ్మగు తట్టఁబెట్టినన్.

---

## —• బు ద్ధ చ రి త్ర ము. •—

1. మ. ఘనుఁడాతండొక నాడనూనమగు వేడ్కంగొల్వుగూర్చుండి మ
మ్మును శ్రీమత్పరదేవతామహిమ సం • భూతాశుధారా కవి
త్వ నితాంత ప్రతిభావిశేష రచితా • పార ప్రబంధానుబం
ధములన్ దివ్యశతావధానములన్ • దర్కించి సల్పెం గృపన్.

2. ఆ. ఇద్ధతేజుఁడైన • బుద్ధదేవు చరిత్ర
మశ్వఘోషముఖులు • ననుసరించి
యస్మదంకితముగ • నాంధ్రకావ్య మొనర్పుఁ
డనుచు వీడ్యమిచ్చె • నాదరమున.

---

ఇవ్విధంబున రాజులు కవిరాజుల సత్కరించుచుండిరి. కవిరాజులు రాజాధిరాజులచే సన్మానంబులందుకొనుచు, తదాస్థాన విద్వాంసులై యలరారుచు, నిరుపమాన గౌరవాతిశయంబులచే శోభిల్లుచుండ, దారిద్ర్య దుఃఖంబుచే గుందుచుండిరని వగవనేల? జీవి

కాంతమునగూడ శాశ్వతమైన కీర్తి నిలచియుండునుగదా? అట్టి మహాద్భాగ్యంబు లభించుచుండ సత్కృతులమూలంబున తరతరములవారును తరించుచుండ, నొక్క దారిద్ర్యదుఃఖంబు వేఁచిననేమి? 'నావిష్ణుఃపృథివీపతి' యను న్యాయంబున కొందరు కవులు రాజులకు సత్కృతులనిచ్చి ధన్యులగుచుండిరి. మఱికొందఱు వారివారి పురాకృత పుణ్యవిశేషంబున కేవలము భగవంతుఁడు వారిస్వప్నముల యందు సాక్షాత్కరించి సత్కృతి తనపేర నంకితమిమ్మని వేఁడుటయు నద్దాన తమకావ్యములు భగవదర్పితములుచేసి పునర్జన్మములేని జన్మసాఫల్యమును గాంచి కృతార్థులగుచుండిరి. ఇట్టి నిదర్శనంబు లనేకంబులు గలవు. ఇట్టి భాగ్యము కవులకే విశేషముగ లభించినది. వేయేల? కవులన్నిటను ధన్యులని చెప్పవచ్చును. భాగవతాది సద్గ్రంథములయందే నిదర్శనములు గానవచ్చును. అయినను సుచ్చునకొక్క పద్య ముదహరించెదను.

క. ఘన రుక్మాంగదచరితముఁ
దనకిమ్మని భీమశివుఁడు • దానర్థింపన్
గనుటయె ప్రౌఢకవి మల్లన
కనయము నణిమాది శుభము • లందుటగాదే.

ఆహా! ఇంతకన్న మించుభాగ్యంబు మఱొండు లేదుకదా. భగవత్సాన్నిధ్యమున నిలచుశక్తిప్రభావములను గాంచిన కవులయదృష్టమే యదృష్టము. ప్రపంచమునందు దేనికైనను సాటి మఱొండు చెప్పవచ్చునుగాని విద్యామహత్వంబునకు వేఱొండుసాటిలేదు. దాని మహిమాతిశయంబు లిట్టివని వర్ణింప నలవికాదు. తదానందమే యానందము. అందు కవితామాధురిగ్రహించినవాని భాగ్యంబుభాగ్యంబు. వానిజన్మయే జన్మ. వేయేల? వాఁడె మానవుఁడు.

శ్రీమంతంబగు నీభరతఖండమునందలి యాంధ్రదేశమున ననేక మహాకవులు వెలసినారు. వారివారి ప్రజ్ఞావిశేషంబులచే సద్గ్రంథముల రచించి నిర్మలకీర్తిచంద్రికలు శాశ్వతముగ వ్యాపించునట్లు ప్రకాశింపజేసిరి. అందువలననే నేఁటివరకు నాంధ్రభాష మేరతప్పక కట్టుబాటు గలిగి చెల్వొందుచుండె. "కవితా యద్యస్తి రాజ్యేన కిం" అను నమృతవాక్య మీనాఁడు పుట్టినదికాదు. ఆంగ్లేయమహాకవులుగూడా కవియనువానికి నగ్రస్థాన మిచ్చిరి. ఏసభయందైనను మొదటితాంబూలమును గ్రహించుటకు కవియే పాత్రుఁడు. కవులు భాషాగురువులు. నైసర్గిక మహాత్త్వ తత్త్వరహస్య స్వరూపంబుల నెఱింగి సుధారసధారల నింపుకృతులచే ప్రపంచమున నిరంకుశాధిపత్యమును వహించి సంచరించుచున్నవారు. స్వేచ్ఛయన్న వారిదే.

శ్లో. నియతికృత నియమరహితాం
హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం,
నవరసరుచిరా మాకృతి
మాదధతీ భారతీ కవే ర్జయతీ.

కవియనువాఁడు దేశదేశాంతరములకు బోవు సామర్థ్యము గాంచకున్నను, తోడఁబుట్టిన దారిద్ర్యమహాదుఃఖంబుచే తనకాలపువారిచే నగౌరవింపఁబడకున్నను, బీదతనమ్మున నైకిరీటలేకున్నను సహజమగు కవిశాశక్తి యణంపఁబడదు కదా.

శ్లో. అమ్భోజినీ వనవిహారవిలాస మేవ
హంసస్య హన్తి నితరాం కుపితో విధాతా
నత్వస్య దుగ్ధ జలభేద విధౌ ప్రసిద్ధాం
వైదగ్ధ్యకీర్తి మపహర్తు మసౌ సమర్థః.

తనకవిత నిరంకుశ ప్రతిభచే భేదించుకొని ప్రపంచమం దంతటను వ్యాపింపగలదు. ఇన్నిమాటలేల ? కవితాప్రసక్తి జ్ఞానమునకును,

మేమనగా కృతులనిచ్చుటదోషముకాదు. భోగేచ్ఛలన్నియుతుచ్ఛ ములని సంభావించుటచే ద్రవ్యాసి కాశించక కృతుల నరాంకితము చేయక పోతనార్యుడు భగవదర్పితము చేసి కృతార్థుడయ్యె. లెక్కి నకవులు కృతులనిచ్చుటలో పెద్దభావమును వహించిరి. వారైహి కేచ్ఛల నాశించి కృతుల నమ్మినవారుకారు. కేవలము భోగార్థము నిచ్చినవారు కారు. కొంత భూభాగమున కధికారము వహించి ప్రజా సంరక్షణార్థము పాటుపడు మహనీయులలో బ్రహ్మాంశము కొంతయు న్నదని గ్రహించిరి. గొప్పగొప్ప భావములను వెల్లడించుచు సత్య ధర్మ శౌచవిధులతో నలరారు గ్రంథరాజములు నట్టిపూజార్హులగు రాజశిఖామణులు కోరినంత వారికి కృతినిచ్చుట దోషము కాదనియు తన్మూలమున నట్టి మహాత్ముల కోరికను నెరవేర్చినవారగుటయే కాక జన్మజన్మములకును శాశ్వతమైన కీర్తిని సంపాదించుకొనవచ్చుననియు నిహమందును కొంతవరకు సౌఖ్య మనుభవింపవచ్చుననియు భావించి కృతులనిచ్చిరి. వారివారిగ్రంథములు ధర్మోక్తుల చాటుచుండుటచే ప్రతియుగమువారికిని యుపాదేయములైనవి. అందుచే కృతిభర్తలును కృతికర్తలును ధన్యులగుచుండిరి.

స్వార్థపరిత్యాగులై కృతులవ్రాసి నరాంకితము చేసిరని చెప్పి యంతమాత్రమున వారలకు మాలిన్యమాపాదించి సుకృతగతులు లేవని చెప్పుట సాహసవాక్యమని యే నాతలంపు. నరాంకితము చేయని పోతనార్యున కెట్టి సద్గతులున్నవని మనము నమ్ముచున్నామో కృతు లనిచ్చిన సత్కవీశ్వరులకును నట్టిపుణ్యగతులు తప్పక లభించునని నా నిశ్చయము.

ఈదారిద్ర్యము కవి యొకనియందే పుట్టలేదు. కవియనువా నినే యంటిపెట్టుకొని యుండలేదు. ప్రపంచమునం దుద్భవించిన ప్రతిమానవుడును బాల్య యౌవన కౌమార వార్ధకదశలకు లోనై

ాపభేదములను గాంచునట్లు తనదశ మాఱినప్పు డిట్టిదారిద్ర్య మను
వింపక తీరదు. ఏవస్తువునకును స్థిరత్వము లేదు. ఈదారిద్ర్యము
ాలిక శరీరసంబంధమైనది. కాని మోక్షపదమునకు భంగము వాటి
ునది కాదు.

ఒకచో దారిద్ర్యమున్నదని యొప్పుకొన్నను కవులు దానినం
ాకనే చరించిరి. ఆనందపారవశ్యమున రసయుక్తమైన కవితారచన
యుండే కాలము గడపుచు తన్మయులై దారిద్ర్యదుఃఖమును మఱ
పుచుండిరి. సాధారణమనుష్యుల కిట్టి ప్రజ్ఞావిశేషములుండవు గనుక
ారిద్ర్యదుఃఖంబును దాటనేలేరు. ఏనాటికైనను, దేనిని దాటు
ాకైనను కవియనువాఁడే సర్వవిధముల సమర్థుఁడు. కనుక యేసం
ముమునందైనను కవియనువాఁడే యున్నతస్థానమును నలంకరించుటకు
ాతుఁడు.

వేయేల? కవిజన్మమే జన్మము.

"Full many a gem of purest ray serene,
The dark unfathomed caves of ocean bear,
Full many a flower is born to blush unseen,
And waste its fragrance in the desert air."

(Thomas Gray.)

"Poverty quenched their lofty aspirations, labour
nd want numbed the soul naturally sensitive and
oled the blood that once ran hot in their veins."

"Slow rises worth by poverty depressed.',

(Johnson.)

"There is many a rich stone laid up in the
owels of the earth, many a fair pearl in the bosom
: the sea that never was seen, nor never shall be seen."

(Bishop Halls' Contemplations.)

" There kept many charms concealed from mortal eye,

Like roses that in deserts bloom and die. "

(Pope's Rake of the Lock.)

Poverty freezes the very life stream of genius· For instance, Oliver Goldsmith the great novelist travelled over Europe earning a precarious living with his flute or by begging. He was ever in debt and in distress. The life of Maculay the great essayist was reduced to such straits that he had to sell his Camdridge gold medal.

The great pœts are teachers. Their whole teaching may be thus summed up :—

" To console the afflicted, to add sunshine to daylight by making the happy happier, to teach the young and the gracious of every age to see, to think and feel and therefore to become more actively and sincerely Virtuous. "

V. RAMASUBBARAYUDU, B. A.,

Headmaster,

Sree Raja Surabhi Lakshmaraya Middle School &

President, Snehalata Kavita Sangham,

KOLLAPURAM,

Jataprole Samastanam.

1931.

స్నేహలతా కవితాసంఘ పుష్పము 25.

శ్రీ వాగ్దేవ్యై నమః.

# రామాయణ సంగ్రహము.

గ్రంథకర్త:

పత్రి విశ్వేశ్వర శాస్త్రి,
తెలుగు పండితుడు.

శ్రీ లక్ష్మారాయ మిడిల్ స్కూలు,
కొల్లాపురం,
శ్రీ జటప్రోలు సంస్థానం.

శ్రీ వైష్ణవ ముద్రాక్షరశాల, పెంటపాడు.

1934.

 [వెల రు 0-4-0 లు.

స్నేహలతా కవితాసంఘ పుష్పము 25.

శ్రీ వాల్మీకయే నమః.

# రామాయణ సంగ్రహము.

గ్రంథకర్త:

సత్రి విశ్వేశ్వర శాస్త్రి,

తెలుగుపండితుడు.

శ్రీ లక్ష్మీరాయ మిడిల్ స్కూలు,

కొల్లాపురం,

శ్రీ జటప్రోలు సంస్థానం.

శ్రీ వైష్ణవ ముద్రాక్షరశాల,

పెంటపాడు.

1934.

 [వెల రు 0–4–0 లు.

# తొలిపలుకు.




విద్వాన్, యస్. విశ్వనాథశాస్త్రిగారు, యం. ఏ.,

ఆంధ్రగీర్వాణ ప్రధానోపన్యాసకులు,

నైజాం కాలేజి, హైదరాబాద్.




శ్రీజటప్రోలు సంస్థానాధీశులకు సుఖావాసమగు కొల్లాపురమునఁగల శ్రీరాజా వేంకట లక్ష్మారాయ మిడిల్‌స్కూలులో నాంధ్రాధ్యాపకులును, స్నేహలతా కవితాసంఘ సభ్యులలో నొక్కరునునగు శ్రీయుతులు పస్త్రి విశ్వేశ్వర శాస్త్రిగారు రచించిన యాంధ్ర రామాయణ సంగ్రహమును నూటపదారుపద్యముల చిన్ని సంపుటమొక్క వ్రాతప్రతి నామూలాగ్రముగఁ జూచితిని. సంస్కృత శ్లోకము జరియందుఁ బుడిఁగాననగు శ్రీరామాయణ సంగ్రహమున కిది యించుమించు సరియైన యాంధ్రీకరణము. శ్రీశాస్త్రిగారాంధ్రమునఁ గృషిసల్పనెంచి యొనర్చిన ప్రథమ ప్రయత్న మీయనువాద రూపముం దాల్చినది.

అనువాద మనుట నింకలి భావముల నెక్కువగాఁ దడవఁ జనదు. తొలి ప్రయత్నమున నే యిట్టి పద్యాత్మకంబగు రచన యుత్సాహమున కాలవాలము. భాషపైఁగల యధికారముం జూడ స్వతంత్రరచనకుం బూనుకొన్నఁ గళాసౌష్ఠవం బలవడి తెనుఁగుతల్లి కలంకారము లొండురెండు చేకూరఁ గలవను నాశ వొడముచున్నది.

ఇందలి వస్తు వతిపవిత్రము. ప్రయత్న ముభయ తారకము. ఎంద రెన్నివిధముల కీర్తించినను విసువు జనియింపఁజేయని రామకథాసుధ నాని తనివిజెందు మానవుండు గలఁడే?

అట్టి రామకథను కొలది సమయములలో సంగ్రహముగ వినఁ జదువఁ జాలు సౌకర్యము గలుగఁజేసి భక్తి విశ్వాసములుగల యాంధ్రలోకమును పాపవిదూరముగ నొనర్పఁజాలెడు నీకవిప్రయత్నము ప్రశంసాపాత్రము. నాదరణీయమును. నాటపద్యాష్టకాన్క వెట్టి శ్రీరామ పదపంకేరుహంబుల నీకవి యర్పించె. అందుఁ బాల్గొని యాంధ్రలోకము తరించుఁగాత!

ఇతోధిక కావ్యకల్పనా చాతురి నీకవి యశోకాంతులను జేపట్టి యలరారుఁగాత!



శ్రీవాణ్యై నమః.

# రామాయణ సంగ్రహము.

—శ్రీః—

[బా ల కాం డ ము.]

శ్రీ రామచంద్ర పద సర
సీరుహముల మ్రొక్కి యిష్టసిద్ధులు వెలయన్
శ్రీరామాయణ సంగ్రహ
మే రచియించెదను బాల హితబోధలకై. 1

శ్రీలకుఁ దావలంబగుచుఁ జెల్వగు కోసల దేశమందు మో
క్షాలయ పట్టణాగ్ర గణనాఢ్య నయోధ్యను రాజధానిగా
నేలుచు నుండె నేలవలె నీతఁడె శాశ్వత మంచు లోకులెం
తో లలిఁగొల్వఁగా దశరథుండను రాజు గుణాభిరాముఁడై. 2

కౌసల్యయు సుమిత్ర కైకేయి యని మువ్వు
రతనికి భార్యలై యలరి రందు
రాజిత సుగుణాభిరాముఁడు రాముఁడు
జననంబు నొందె కౌసల్యయందు
భ్రాతృచరణ భక్తిభరితుఁడు భరతుఁడు
ప్రభవించె కైక గర్భంబునందు
మహిత లక్షణులు లక్ష్మణుఁడు శత్రుఘ్నుఁడు
నుదయించిరి సుమిత్ర యుదరమందు

రాముపాదరజము సోఁకి పవిత్రయైన
ముని గౌతము భార్య యహల్య పూజ
సలుపఁ గైకొని వారు మిథిలకు నరిగి
జనకునకుఁ దెల్ప వచ్చిన పని సతండు. 9

. శివ చాపంబును జూపిన
నవలీలఁగ విఱిచె దశరథాత్మజుఁడు విదే
హావనీపతిధవుఁడు గుటుం
బసిశిష్టునిఁ గోసలాధిపతిఁ బిలిపించెన్. 10

మ. జనకక్ష్మాపతి రామచంద్రునకు భూజాతన్ ద్విలోకైకమా
తను సీతన్ నిజపుత్రి నూర్మిళ సుమిత్రాపుత్రుఁడౌ లక్ష్మణా
ఖ్యునకున్ గూర్చి జగత్ప్రతీతముగ సత్యుత్సాహుఁడై మంగళ
ధ్వని తంతేనిఁ జెలంగఁ జేసెను మహోత్సాహందుఁ గళ్యాణముల్.11

గీ. ద్విగుణితోత్సాహుఁడగుచు విదేహ నృపతి
నిజ సహోదరుఁడౌ కుశధ్వజుని సుతల
మాండవీ శ్రుతకీర్తుల మాన్య గుణవ
తుల నొసంగెను భరత శత్రుఘ్నులకును. 12

చ. సుతులు నిజానురూప గుణశోభిత దారలఁ గూడి కొల్వసం
చితుఁడయి కోసలాధిపతి స్వీయ పురంబున కేగుచుండ భూ
పతి విజిగీష నచ్చటికి వచ్చిన భార్గవరాము రాఘవుం
డతిసులభంబుగా గెలువ నాతఁడు గౌఁగిటఁ జేర్చె నాత్మజున్.13

గీ. ఈవిధి విజయలక్ష్మీ సమావృతుండు
నగుచు సాకేత పురమున కరగి యందు
సరస శృంగార సల్లాప జలధిఁ దేలి
జానకినిఁ గూడి శ్రీరామ చంద్రుఁడుండె. 14

## గద్యము.

ఇది శ్రీ వాణీ కరుణా కటాక్షలబ్ధ కవితా విచిత్ర పత్రికుల
పవిత్ర పురుషోత్తమ శాస్త్రి పుత్రి విశ్వేశ్వర ప్రణీ
తంబైన రామాయణ సంగ్రహమందు
బాలకాండము సర్వము
సంపూర్ణము.

శ్రీవాణ్యై నమః.

# రామాయణసంగ్రహము.

## [అయోధ్యాకాండము.]

క. ఘనమగు సంతసమున నిజ
జనకుని యానతిని భరత శత్రుఘ్నులు తే
కొని నయమునన్ యుధాజితుఁ
డను మాతులుని పురమునకు నరుగఁగ నంతన్. 1

గీ. దశరథుఁడు రాజ్యభార ఖేదమును మిగులఁ
జెంది రాముని బట్టాభిషిక్తుఁ జేయఁ
దలఁచి యున్నంత మంథరాకులిత చిత్త
యగుచు కైకేయి దుర్భాషలాడె పతిని. 2

చ. అనయము సత్యపాలకుఁడవై తగుచో మును శంబరాజి ని
చ్చిన వరయుగ్మమం దొకట శ్రీరఘురాముని సత్వరంబుగా
వనమునకన్పు మొండొకట పార్థివుఁ జేయుమ మత్కుమారుఁ గా
దనిన విషంబుఁ గ్రోలి యిదె ప్రాణము వీడెద నీవు చూడఁగన్. 3

క. ఈలీలఁ బరుష భాషల
నాలించిన తత్క్షణంబ హా యని ధరపైఁ
గూలెను మూర్ఛిలి ధరణీ
పాలుఁడు పవిభిన్నపక్ష పర్వతమువలెన్. 4

చ. పలికియు కొంకునట్టి యలవాటిసుమంతయు లేక కన్నపు
త్రుల విడలేక యా దశరథుం డలరాముని కాన కంపఁగా
వలదని యెంత వేడినను బట్టిన పట్టును కైక వీడఁగా
దలఁప దొకింతయైనను బడంపడి నాథుఁడు శోక మొందఁగన్. 5

చ. వనమున కేగుచుంటి సెలవా జనకా యని పాదవందనం
బును బొనరించి లక్ష్మణుఁడు భూసుతయున్ దన వెంట రాగ స్యం
దనమునఁ జేరి శాద్వల పథంబునఁ బౌరుల మోసగించుచున్
జనియె నిశీథకాలమున జాహ్నవి చెంతను రాముఁడంతటన్. 6

గీ. అచట వెలయునట్టి గుహుని సహాయమునను
సమరిసది దాటి చిత్రకూటమున కరిగి
యందు సౌమిత్రికృత సపర్యలను గొనుచు
సీతయును రాఘవుండును జెలఁగి రచట. 7

క. ఘనమైన పుత్రశోకం
బున దశరథ విభుఁడు స్వర్గమునకుం జనినం
తనె దూత మంత్రులాజ్ఞన్
చని భరతుని తోడితెచ్చె సరభస గతితోన్. 8

చ. జరగిన దుష్ప్రవృత్తుల నిజంబుగఁ దెల్పఁగ విన్నతోడ మై
మఱచి ధరాస్థలిన్ బడి క్రమంబుగఁ దెల్విని గాంచి లేచి యా
భరతుఁడు పెద్దలెల్ల రిది భావ్యము గాదని తెల్పఁ గైక మం
థరలను దూఱఁబోక కులధర్మముగా సలిపెన్ బితృక్రియల్. 9

ఉ. పౌరులు వెంటనంటి చనఁగన్ భరతుండెటో చిత్రకూటముం
జేరి రఘూత్తమాంఘ్రి సరసీరుహ యుగ్మమునందు వ్రాలె సీ
తారమణుండు నంతఁ దనతండ్రి గతించిన వార్త వీనులన్
దూరఁగ దుర్భరంబయిన దుఃఖమునన్ విడిచెన్ జలాంజలుల్. 10

చ. భరతుఁడు వచ్చి పాదములపైఁ బడి వేఁడుచునున్న ధర్మమా
ర్గరతుఁడు గాన రాముఁడు పురంబునకుం జనకున్న నన్న యు
త్తరువు నొకింతయేని జనదాటక రాముని పాదుకాద్వయం
బురుతర భక్తిఁ గైకొని యయోధ్యకుఁ బౌరసమేతుఁడై చనెన్.

ఉ. నందిపురంబుఁ జేరి రఘునందను చందము నారచీరలన్
గుందక దాల్చి పాదుకలకుం భరతుండటు రాజ్యతంత్రముల్
ముందుగఁ దెల్పుచున్ రఘుప్రభుం డల సీతయు లక్ష్మణుండుఁ గొ
ల్వం దయసేయువాసరములన్ గణియించుచునుండె నచ్చటన్. 12

గీ. సూర్యవంశపయోనిధి సోముఁడైన
రామచంద్రుండు మునిజనాశ్రమములందు
నతిథి సత్కారముల మహోన్నతిని బడసి
దండకావన దుర్గమ స్థలముఁ జేరె. 13

గద్యము.

ఇది శ్రీ వాణీ కరుణా కటాక్షలబ్ధ కవితా విచిత్ర పత్రికుల
పవిత్ర పురుషోత్తమ శాస్త్రిపుత్ర విశ్వేశ్వర ప్రణీతం
బైన రామాయణ సంగ్రహమం దయోధ్య
కాండము సర్వము
సంపూర్ణము.

శ్రీరామాయ నమః.

# రామాయణసంగ్రహము.

[అరణ్యకాండము.]

చ. అటవినిఁ బోవుచుండఁ బలలాశనుఁడైన విరాధు దున్మి య
చ్చట బిలమందు వైచి మునిచంద్రుల మ్రొక్కి యగస్త్యదత్తమా
పటుతర శక్రకార్ముకము భక్తినిఁ గైకొని భూమిపుత్రితో
నుటజమునందు రామవిభుఁ డుండెను బంచవటీ స్థలంబునన్. 1

గీ. రావణానుజయైన శూర్పణఖ వచ్చి
లలిత సద్గుణ సౌందర్య సలిల శరధి
దాశరథిఁ జూచి నాకు భర్తవగు మనుచు
జాలఁ బ్రార్థించె హేమంత కాలమందు. 2

ఉ. ఎంతయు వేడ దాశరథు లిర్వురుఁ దన్ను వరింపకున్న న
త్యంత రుషాకషాయిత హృదంతరయై ధరణీసుతన్ మహీ
కాంతు సతిన్ నిశాచరి యకారణ వైరమునన్ గ్రసింపఁబోఁ
గుంతముచేత లక్ష్మణుఁడు గోసెను వెంటనె కర్ణనాసముల్. 3

ఉ. ఆనన మెత్తి శూర్పణఖ యద్రిగుహాంతర సుప్త సింహముల్
మానసమందు భీతిల విలాప నినాదము జేయుచున్ జన
స్థానము జేరి యచ్చటి నిశాచరులన్ ఖర దూషణాదులన్
సేనలతోడఁ బంచె నిరసింపఁగ రాముని శత్రుభీమునిన్. 4

మ. దనుజానీకము వచ్చుచుండఁ గని సీతారక్షణార్థంబు త
మ్ముని సౌమిత్రిని నిల్పి యంత రఘురాముం డొక్కఁడే యేగి చే
ధనువున్ బూని శరౌఘ వృష్టి నల దైత్యవ్రాతమున్ దున్మి రాఁ
గని సీతాసతి కౌఁగిలించుకొనియెన్ గాఢంబుగాఁ గాంతునిన్. 5

గీ. ఆజనస్థాన మంత శూన్యముగ దోపఁ
బర్వెడుచు లంక కేగి శూర్పణఖ రావ
ణుని సభాస్థానమందు రోదనము జేసి
చెప్పి సకలంబుఁ బూసగుచ్చిన విధంబు. 6

క. దనుజ విభుండా శూర్పణ
ఖను వికృతాననను జూచి కటకట పడుచున్
జనకసుతను గొని వచ్చెద
ననుచున్ యతిరాజ భూమికాచ్ఛాదితుఁడై. 7

గీ. అపుడు మారీచుఁడు సువర్ణ హరిణ వర్ణ
ధరుఁడు దనకు సహాయ భూతముగ రాగ
భూసుతాకాంతు పర్ణశాలా సమీప
మునకు నరుదెంచి మరుగునఁ బొంచి యుండె. 8

చ. కనఁగొనినంతమాత్రమునఁ గన్నుల పండుగ సేయఁజాలు కాం
చన హరిణంబు దివ్వెల తృణంబుల మేయుచు సంచరింపఁగాఁ
గనుగొని సస్వవంచకముగాఁ దలపోయక దానిఁ బట్టి తె
మ్మని ధరణీజ మూఢమతియై నిజవల్లభు నంపె నంతటన్. 9

చ. కృతక మృగంబు చిత్రగతి రీతులఁ జూపుచు దూర మేగి దు
ర్మతులగు రాక్షసాధముల మాయ లటంచుఁ దలంచి రామ భూ
పతి విశిఖంబుచేఁ దునుమఁ బ్రాణము వీడుచు నా కురంగమున్
క్షితిఁబడి లక్ష్మణాగ్రజ సఖే సఖి మైథిలి యంచు నేడ్చెనన్. 10

గీ. ఆర్త నాదంబు విన్నంత నాత్మ పతి వి
పన్న సంత్రాస శీలుఁ డాపన్నుఁ డయ్యె
ననుచు మది నెంచి మొన్ని చెప్పినను వినక
చనుము చనుమని సీత లక్ష్మణుని బనిచె. 11

ఉ. ఈ సమయంబ మంచిదని యెంచి దశాస్యుఁడు మోసగించి సీ
తాసరసీరుహాక్షిని రథంబున నుంచుక సాగుచుండఁగా
నాఁతిఁ గావ సద్దము జటాయువు వచ్చిన వాని రెక్కలన్
గోసి విహాపుఁ జేయుచు నకుంఠిత లీలల నేగె లంకకున్. 12

మ. అవనీపుత్రిని విష్టప త్రితయ వంద్యన్ రామచంద్ర క్షమా
పతి సర్ధాంగి రమానతాంగమగు సీతన్ ఘోర దుర్వార దై
త్య వధూటీవృత గాఁగ శోకవన మధ్యన్ నిల్పుఁడీ యంచు దా
నవ రాజేంద్రుఁడు రాక్షసాధముల కాజ్ఞన్ జేసె తీవ్రంబుగన్. 13

గీ. అచట మార్గమ్ము నవ్వచ్చు ననుజుఁ జూచి
జానకీపతి యుద్విగ్నమానమతిని
చానఁ బర్ణశాలను లేమి చాల వగచి
వెదకుచుండిరి సీతకై విపినమందు. 14

మ. అరయన్ బోవుచు జానకీధవుఁడు శీర్ణాంగుండు గృధ్రేశుఁ డా
శరనాట్కృత్యము దెల్పి స్వర్గతుఁడుగాన్ శాస్త్రోక్త సంస్కారమున్
గరుణన్ జేసి కబంధు దైత్యు వికృతుం గావించి సౌమిత్రితో
నరిగెంపన్ జనెఁ బూతసీమ పిలుస త్వంపా సర స్థిరమున్. 15

—♦ గద్యము. ♦—

ఇది శ్రీవాణీ కరుణా కటాక్షలబ్ధ కవితా విచిత్ర పత్రికుల
పవిత్ర పురుషోత్తమ శాస్త్రిపుత్ర విశ్వేశ్వర ప్రణీతం
బైన రామాయణ సంగ్రహమందు అరణ్య
కాండము సర్వము
సంపూర్ణము.

శ్రీరామాయ నమః.

# రామాయణసంగ్రహము.

[కిష్కింధకాండము.]

గీ. ఋష్యమూకాద్రియందు సుగ్రీవుఁ డంత
వాలిభీతిని లీనుఁడై బాణచాప
ధరుల నిర్వుర రాజనందనులఁ జూచి
యగ్రజుని భృత్యులంచు భయంబుఁ జెందె. 1

చ. హిత మొనగూర్ప నాతనికి నెంచి యతీంద్రుని వేష మంజనా
సుతుఁడు ధరించి భూమిపతి సూనుల నిర్వురఁ జెంత కేగి యా
కృతిఁ గనినంతనే గుణమెఱింగెడు నేర్పరి గాన వారి సం
చితగతి తోడి తెచ్చి కపిశేఖరు మిత్రుల జేసె సంతసన్. 2

ఉ. పావన భూరిసత్త్వ మృదుపాద నఖాగ్రముచేత రాముఁ డా
దేవ విరోధి దుందుభుని దేహము లీలఁగఁ జిమ్మె సప్త సా
లావనిభృ ద్భుజంగ నిలయంబుల నస్త్రముచేతఁ ద్రుంచె సు
గ్రీవుఁడు విశ్వసించి భళిరే విజయం బగుసంచు నెంచఁగన్. 3

క. సురపతి పుత్రుసితోఁ గపి
వరుఁ డతిఘోరముగఁ జేసె బవరంబును వా
రిరువురిలోనన్ భేదం
బెఱుగన్ లేకురక రాఘవేంద్రుఁడు నిలచెన్. 4

గీ. వాలి బలము సహింపక పారివచ్చు
నానతగ్రీవు సుగ్రీవు సూనదామ
భూషితగ్రీవు నొనరించి పోరు సేయఁ
బొమ్మనుచు రాముఁ డనిపె ధైర్యమ్ము సెప్పి. 5

ఈలీలన్ సుగ్రీవుం
డాలమునకుఁ జనఁగ భూరుహాంతర్హితుఁడై
వాలిన్ గురు బల శాలిన్
గోలన్ గొని రామవిభుఁడు గూలన్ జేసెన్. 6

తారయు వానర గణమును
దారేయుఁడు ధరణి సుతుఁడు దద్భర్తృ ధరి
త్రీరమణ జనక సోదర
మారణ దుఃఖార్ణవమున మగ్గిరి మిగులన్. 7

అల మొనర్చి పిమ్మట నిజాగ్రజుఁ డౌట సురేంద్ర పుత్రుఁడౌ
వాలికిఁ బారలౌకికము వానర నాథుఁడు జేసె నంత భూ
పాల పదంబు నాతనికిఁ బట్టము గట్టుచు మాల్యవంతమున్
శైలమునందు రామనృపచంద్రుఁడు పుచ్చెను ప్రావృషాహముల్.

రాముని యాజ్ఞ లక్ష్మణుఁడు రాజ్య సుఖానుభవ ప్రమత్త శా
ఖామృగ నాథునిన్ బిలువఁగా జనుదెంచి యతండు వానర
గ్రామణులార భూసుతను గన్గొని మాసములోన మీర లీ
ధామము జేరుడంచు శపథంబుగ నాన నొసంగె వారికిన్. 9

హనుమ జ్జాంబవ దాదిక
వనౌకసులు యామ్యదిశకు బలములతోడన్
జని యిరిణము ద్వాదశ యో
జన మితమిన్ జేరి మిగుల శ్రమయుతు లగుచున్. 10

౫. వనమున కేగి హేమమయ పాదపమైన స్వయంప్రభా గుహన్
వనచరులెల్లఁ జేరి మధుపానము సేయుచు కార్యముల్ మనం
బునఁ దలపోయకే సమయమున్ గడుపన్ దొడఁగన్ బ్రబోధమున్
బొనరుప వారిలో నొకఁడు మోదపయోధినిఁ దేలిరందఱున్. 11

గీ. ఆగుహాధీశ్వరి యగు స్వయంప్రభ యట
వానరుల రామదూతలగా నెఱింగి
ఫలము లర్పించి మీలితాత్ములుగఁ జేసి
క్షణములో వారి వింధ్యనగంబుఁ జేర్చె. 12

మ. సమయంబుల్ గడువంగ వచ్చె నెచటన్ క్ష్మాపుత్రికన్ గాంచమై
తి మటంచున్ గపిసేనలెల్లఁ గడు భీతిం జెంది ప్రాయోపవే
శము గావింప జటాయు రగ్రజుఁడు దా సంపాతి యాలంకలో
మహీనందన సీత యున్నదనుచున్ మార్గంబు చూపింపఁగన్.13

ఉ. పెన్నిధిఁ గన్న పేదవలెఁ బ్రీతిగ లంకకుఁ బోఁదలంచి వా
రాన్నిధిఁ గాంచినంత నవురాయని వానరులెల్ల భీతులై
యున్నెడ జాంబవంతుఁడు ప్రియోక్తుల వేడఁగ వాయుసూనుఁడం
తన్నిమిషంబులో నుదధి దాటెదనంచు వచించె వారితోన్.14

గద్యము. ♦

ఇది శ్రీ వాణీ కరుణా కటాక్షలబ్ధ కవితా విచిత్ర పత్రికల
పవిత్ర పురుషోత్తమ శాస్త్రి పుత్రి విశ్వేశ్వర ప్రణీ
తంబైన రామాయణ సంగ్రహమందుఁ
గిష్కింధ కాండము సర్వము
సంపూర్ణము.

శ్రీవాల్మీక్యై నమః.

# —♦ రామాయణసంగ్రహము. ♦—

[సుందరకాండము.]

---

మ. గురు వేగోద్ధతుఁడై మహేంద్ర శిఖరిన్ గుప్పించి లంఘించుచున్
సురసా సింహికలన్ మదం బణఁగఁగా సోలించి లంకాపురాం
తరమున్ జేరి మరుత్సుతుం డెచటనైనన్ జానకిన్ గానలే
కరయంగా జనియెన్ దినాంతమున దైత్యస్వామి శుద్ధాంతమున్.

మ. అతిమోదంబున రావణుం గలసి పర్యంకంబునందున్న ర
మ్యతమాకార విలాస నిర్జిత రతిన్ మండోదరిన్ జూచి గాం
చితి వైదర్భినటంచు నుబ్బి పిదపన్ జింతించి కాదంచు ని
శ్చితుఁడై కాంచె నతఁ డశోకవనికన్ సీతన్ నిశాటీ వృతన్. 2

క. కనుగొని భీకర దనుజాం
గనలు కనక సాలభంజిక యనందగు సీ
తను బెదరింపఁగ వినుచున్
వనచర వరుఁడుండె శింశుపా వృక్షమునన్. 3

ఉ. అంత నిశాంతమందున దశాస్యుఁడు మేల్కని వచ్చి మన్మథా
క్రాంత మనంబుచేతఁ గులకాంతను సీతను భార్యవౌచు శు
ద్ధాంతమునందు నుండుమని యాచన సేయఁ దృణంబుఁ బూని య
త్యంతము సీత నిష్ఠురము లాడఁగ నేగెను మానహీనుఁడై. 4

గీ. రాక్షస స్త్రీలు క్రోధ సంరబ్ధ లగుచుఁ
దర్జనము సేయ నాబాధఁ దాళలేక
ప్రాణములవీడ జానకి పాదపమున
జడను ముడివేయుచున్న తత్క్షణమునందు.

మ. హనుమంతుం డవతీర్ణుఁడై పిదప సాష్టాంగంబుగా పాద వం
దనముల్ భక్తి నొనర్చి రామవిభుదూతన్ గా నన్ జూడుమో
జననీ యంచన సీత వాని నపు డిచ్ఛావిగ్రహుండౌ దశా
ననుగా నెంచిన రామముద్రికను చిహ్నంబంచు నర్పించుచున్. 6

క. ఆ కాంతా రత్నమునకుఁ
గాకాసుర కథను దెలుపఁగాఁ దన పతి దూ
తే కావలెనని తలఁచిన
దై కపితోఁ బలికె నతిరహస్యము గాఁగన్. 7

ఉ. రాముఁడు నీవు లక్ష్మణుఁడు రండొక మాసములోన రానిచో
నేమరణింతు నంచు ధరణీసుత పల్కి యనర్ఘమైన చూ
డామణి చీరకొంగున దృఢంబుగఁ గట్టి యొసంగ వానర
గ్రామణి యంతటన్ సెలవుఁ గైకొని నేఁగఁగ హృష్టచిత్తుఁడై. 8

క. రావణుఁడు తన్ను నెఱుఁగన్
గావలెనని వాయుజుఁడు వనంబును విఱువన్
గా విని దశవదనుఁడు రో
షావృతుఁడై పనిచె రాక్షసానీకములన్. 9

గీ. అపు డసీతి సహస్ర సైన్యంబులను బ్ర
హస్త సుతు జంబుమాలి దశాస్యపుత్రు
నక్షుని యమాలయమ్మున కనిపి యంత
నాంజనేయుఁడు గన్పట్టె యముని పగిది. 10

మ. పవమానాత్మజు నింద్రజిత్తపుడు దా బ్రహ్మాస్త్రముల్ బూని జీ
వ విశిష్టంబుగఁ గట్టివేయ నతఁడా బంధంబులన్ బాపి దీ
నవిభాతిన్ శణరజ్జు బద్ధుఁ డగుచున్ గార్యార్థియై నిల్చి దా
నవ రాజేంద్రు సభాస్థలిన్ గనుగొనంగా నెగ ధైర్యంబునన్. 11

చ. పవన సుతుండు రావణుని బంగరు గద్దను మించియున్న నై
జ విజయ వాలపీఠమున జంకక కూర్చునియుండఁ జూచి నీ
వెవఁడవు నిన్నెవండనిపె నెచ్చట నుండు విటేల వచ్చి యుం
టి వనుచు రావణుం డడుగ నిక్కము జెప్పె సతండు వానికిన్.12

చ. కలఁడొక రాజనందనుఁ డఖర్వ మదోద్ధత దైత్య సంగర
స్థల సురరాట్సహాయకర చండ పరాక్రమ లబ్ధ కీర్తి కో
సల ధరణీంద్రు గర్భమున సర్వ నిశాచర భక్షణార్థమై
వెలసిన విష్ణుమూర్తి రఘువీరుఁడు రామసమాఖ్యుఁ డిద్ధరన్.13

సీ. తాటకానామ దైత్యాటవీ దాహదా
నక్రపీటయోనిగాఁ బరఁగె నెవఁడు ?
ప్రబల మారీచ సుబాహు ముఖ పలాశి
తూల వాతూలుఁడై గ్రాలె నెవఁడు ?
దర్పక దర్పిత శూర్పణఖాస్య వికార
కారి యటంచు మీఱె నెవఁడు ?
ఖరదూషణాది రాక్షస గణ కక్షాశు
శుక్షణి యనఁ బొడసూపె నెవఁడు ?

గీ. సాపరాధ విరాధ సంహారుఁ డెవఁడు ?
శాపితాంధ కబంధ నాశకుఁ డెవండు ?
నామహాత్ముండు లోక విఖ్యాత పూత
నాముఁడు గుణాభిరాముఁడు రాముఁ డలరు. 14

చ. హృదయమునందు రావణ ! స్మరింతువా లేదా ధనుర్గుణంబుచే
గదలఁగనీక బాహువులఁ గట్టుచు నిన్ జెరసాలలోన నాఁ
డదయత కార్తవీర్యుఁడను నర్జునుఁ డుంచిన వార్త, వాని దు
ర్మదము నడంచు తత్పరశురాముని గర్వమతండుగూల్చఁడే? 15

చ. మఱచితివేమొ కీటక సమంబుగ నెంచి సిరంబు లంఘ్రులన్
గరముల వాలరజ్జువునఁ గట్టిగ గట్టి సమస్తవార్ధులన్
వరుసగ నిత్యకృత్యమను వ్యాజముచే నిను ముంచువాని త
ద్గురుబలశాలి వాలి నొక కోలనఁ గూలఁగ రాముఁడేయఁడే? 16

ఉ. ఆ నరవర్యుఁ డొప్పు నిటు లాజ్ఞ నొసంగిన నీపురంబు వై
శ్వానర సాత్కృతంబు సలుపన్ బరికించెడు సోదరుండు ప్ర
జ్ఞానిధి లక్ష్మణుండు దిననాథ సుతుండు సఖుండు గొల్వఁగా
వానరసేనఁ గూడి త్రిదివప్రభు చందము మాల్యవద్గిరిన్. 17

ఆ. గీ. జంబుకంబు హరుల జాడఁ ద్రొక్కని భంగి
రాజసింహ యుగ్మ రహిత పర్ణ
శాలఁ జేరి కపట సంయమి వేషివై
మ్రుచ్చిలించి సీతఁ దెచ్చినావు. 18

ఉ. ఆ జనకాత్మజాత నరయన్ జనుదెంచిన వానరేంద్రు లం
దే జలధిన్ దరించి పురమెంతయు నారసి సీతఁ గాంచి నా
యోజను నీవెఱుంగుటకు నుజ్జ్వలమైన వనంబుఁ ద్రుంచితిన్
దేజముమీఱ దైత్యుల వధించిన దాదిగ నీవెఱుంగవో. 19

గీ. కుమతివై నీవు భార్యగాఁ గోరినట్టి
రఘువరుని పత్ని సీత నీ ప్రాణవాత
జాలము హరింపఁ బుట్టిన కాల భుజగ
కన్యక యటంచుఁ దల్పవుగా దురాత్మ. 20

ఉ. రావణ! నీవు జానకిని రామ నృపాలున కిచ్చి వేడుమా
కావుము కావుమం చటులఁ గాదను దేని భవత్పురంబు ర
క్షో విఘవాదిలాప రవ ఘోషిత దిక్తటమా నటంచు సు
గ్రీవుఁడు నీసఖుండు బలికెన్ హితవాక్యము లాలకింపుమా. 22

అని వాయుసుతుఁడు బల్కినఁ
దనుజేంద్రుఁడు వానిఁ జంపఁ దలఁపఁగ దూతన్
జనదు వధింపఁగ వీరుల
కనుచు విభీషణుఁడు బల్కె న్యాయముగాఁగన్. 22

రావణుఁడు వాలమునకు వస్త్రములు జుట్టి
తైలమున ముంచి యగ్ని తప్తంబు సేయు
పెఱిఁగి సీత పతివ్రత నేని నేను
పవనసుతుఁ గాల్పవలదని వహ్ని వేడె. 23

అనలుఁడు లూనలోమమునునైన దహింపక వెల్గుచుండఁ బా
వని కడు సంతసించి నిజబంధములన్ దెగఁ ద్రుంచి దైత్యులన్
బనిఁగొని చంపుచున్ బురము భస్మము సేయుచు వాలవహ్నిచే
జనకజకున్ సమస్కృతులు సల్పి సముద్రముదాఁటి వెండియున్.

సేమము సీతకంచుఁ గపిసేనకు మారుతి తెల్పినంత చే
తోముదమంది వానరులు తోకలఁ ద్రిప్పుచు గంతు లేయుచున్
రాముని కీప్రవృత్తి సచిరంబుగఁ దెల్పుద మంచు వాలిజా
జ్ఞా మదమత్తులై మధువనంబునఁ దేనెలఁ గ్రోలుచుండఁగన్. 25

వనపాలకుఁడు దధిముఖుఁడు
గని వారల నడ్డగింపఁగా భూరిదంతా
ది నిజావయవములఁ బ్రద
ర్శనమును గావించి గేలి సలుపుచుఁ గపుల్. 26

పాదములచేతఁ దన్నుచుఁ బండ్లచేతఁ
గొఱుకుచును జీల్చివేయుచు గోళ్లచేత
బాహువులచే చపేటముల్ బరపి వాల
దండములచేతఁ దరిమిరి పిండిఁ జేసి. 27

చ. వనచరు లెల్లఁ బర్విడుచు వచ్చి సలక్ష్మణుఁడైన రామచం
ద్రుని కటు నేను నేననుచు మ్రొక్కి నయంత మరుత్సుతుండు నేఁ
గనుఁగొనినాఁడ సీతను సుఖంబుగ నున్నదటంచుఁ దెల్పఁగా
ఘనముగఁ గౌఁగిలించుకొనెఁ గాంతను నెమ్మది సంస్మరించుచున్.

## —♦ గ ద్య ము. ♦—

ఇది శ్రీ వాణీ కరుణా కటాక్షలబ్ధ కవితా విచిత్ర పవిత్రకుల
పవిత్ర పురుషోత్తమ శాస్త్రి పుత్ర విశ్వేశ్వర ప్రణీ
తంబైన రామాయణ సంగ్రహామందు
సుందరకాండము సర్వము
సంపూర్ణము.

♦ శ్రీవాణ్యై నమః.

## రా మా య ణ స ం గ్ర హ ము. ♦-

[యుద్ధకాండము.]

క. దనుజేంద్రు పురవరంబున
జనకజ యున్నదని రామచంద్రుఁడు వినినం
తనె కనియెఁ దూణ యుగమున్
ధనువున్ బ్రళయాగ్ని సదృశ దాహక దృష్టిన్. 1

మ. ప్లవగాధీశుఁడు జాంబవంతుఁడును గోలాంగూల భల్లూక సై
న్య విశిష్టంబుగ వెంటనంటి నడువన్ రాముండు సౌమిత్రి యా
హవ వాంఛా ద్విగుణీకృతాంగబల ధైర్య భ్రాజమానాంజనా
భవతాకేయ రథాధిరూఢులగుచున్ బ్రస్థానమున్ జేయుచున్. 2

గీ. వనములు నదీనదంబులు పర్వతములు
దాటుచు మహేంద్రశిఖర కాంతారమందు
జేరి మార్గశ్రమంబు నశింప ఫల మ
ధూపహారంబు లొనరించుచుండి రంత. 3

ఉ. చారులచేత వానరుల సైన్యము దుర్జయమౌచు వచ్చె నా
వారిధి చెంతకం చెఱిఁగి పంక్తిముఖుం డపుడేమి చేయలే
కూరక నాత్మఁ జింతిలుచు నుండిన యంత నమాత్యు లెల్లరున్
ఘోరరణంబు సేయఁ బురికొల్పి రతండు ముదంబుఁజెందఁగన్.

గీ. జానకిని రామున కొసంగి శరణు వేడు
మనుచు హితమును బోధింప ననుజుఁడనుచు
దలఁపక విభీషణుని కాలఁదన్ని వెడలఁ
గొట్టెను దశాననుఁడు కొల్వుకూటమందు. 5

క. శరణు శరణంచుఁ బరువునఁ
బఱతెంచి విభీషణుండు పదముల వ్రాలన్
గరుణించుచు రామ మహీ
వరుఁ డతనికి రాజ్యమును బట్టము గట్టెన్. 6

చ. పలుమఱు మార్గ మిమ్మనెడు ప్రార్థన లెల్ల నుపేక్ష సేయఁగా
నలిగి ధనంజయాస్త్రమున నబ్ధిని రాముఁడు గాల్ప నంతలో
జలధియు రామపాదముల సాగిలి మ్రొక్కుచు మార్గ మివ్వఁగా
నలుఁ డొనరించె సేతువు ఘనంబుగ వానర సైన్య యుక్తుఁడై.

క. జలనిధి దాటి సువేలా
చలము ప్రవేశించు కపుల సంఖ్య లెఱుంగన్
దలఁచుచు శుక సారణ చా
రులు రా వారలను గపివరుఁడు బంధించెన్. 8

గీ. అంత నాదాశరథిని దయాశరథిని
శరణు వేడి విముక్తులై యరిగి వారు
తెలుపఁగ విని విద్యుజ్జిహ్వుఁ బిలిచి యాస్య
శాస్యుఁ డేమేమొ పలికె రహస్యముగను. 9

ఉ. రావణు పంపునన్ గపట రాము శిరంబు శరాసనంబు మా
యావి యొసంగఁ జూచి జనకాత్మజ మూర్ఛను జెంద నంతలోఁ
బావనియగా విభీషణుని భార్య యొకింగి వచించె నిక్కముల్
గావని యూస్తభాషణముల క్షితినందన నూఱడించుచున్.10

క. ధరణీసుత నోసగుము రఘు
వరునకని హితము మాల్యవంతుఁడు తెలుపన్
బరిహాస మాడి సేనను
బురికొల్పెను రావణుండు పోరొనరింపన్. 11

చ. వనచరుఁ డర్థిత ప్రబల వాహినులన్ బరికించి మేఘవా
హనుఁ డురుగాస్త్రముల్ బరపి యాకసమందున డాగి రాజనం
దనులను గట్టివేసి చనఁ దార్క్ష్యుఁడు తత్పవనాశ నాస్త్రబం
ధనములుబాసె వానరులు దగ్గయి సమ్ముదమందిచూడఁగన్.12

ఉ. అంగదుఁ డాంజనేయుఁడు ప్రహస్త ముఖాసుర వాహినీశులన్
సంగరమందు దున్మినను వారలు డెల్ప నెఱింగి దుర్జయో
త్తుంగ భయంకరాకృతి యుతుండగుచున్ రథచారియై సమి
ద్రంగము జేరె రావణుఁ డరాతి నిరాకరణ ప్రచండుఁడై. 13

గీ. శరముల బరపి వానర సైన్యములను
జంపి లక్ష్మణుఁ బడఁద్రోసి శక్తిచేత
రామ బాణావశేషిత పాణిుఁ డగుచు
పంక్తిముఖుఁడు పురమునకుఁ బారిపోయె. 14

క. సమరమునఁ గపి బలంబులఁ
గవియుచు దినుచున్న కుంభకర్ణుని సీతా
ధవుఁడు గతాసునిఁ జేసెను
సవిశేషముగఁ గుసుమ వృష్టి సమరులు గుఱియన్. 15

ఉ. ఈవిధి దైత్యసైన్యపతులెల్లరు నంగద వాయుపుత్త్ర సు
గ్రీవుల చేతఁ జచ్చుట లెఱింగిన వెంటనే మేఘనాథుఁ డ
స్త్రావలిచే వలీముఖుల సంతతి మూర్ఛిలఁ జేసె నంత సం
జీవి నగంబుఁ దెచ్చుచు సజీవుల మారుతి చేసె నందఱన్. 16

ఉ. వెండియు మేఘవాహనుఁడు విష్ణుపదంబున లీనుఁడై సము
ద్దండతఁ గీశసైన్యముల దర్ప మడంచుచు రామచంద్ర కో
దండ విముక్త బాణములఁ దాఁకక పాఱి పురంబు ముంగలన్
మండుచు గోసె వాయుజు సమక్షము కృత్రిమమైన జానకిన్. 17

వ. అతఁడు నిరాశచే దశరథాత్మజుఁ జేరి చనన్ నికుంభిలా
క్రతువును మేఘవాహనుఁడు కైకొని సేయుచునుండె రామునిన్
క్షితిసుతఁ గూర్చి దుఃఖమును జెందఁగనీక విభీషణుండు త
త్క్రతువును భంగమున్ సలిపి రండని పంపెను వానరేంద్రులన్. 18

తే. అంజనాతనయాది సైన్యంబు లరిగి
మఖము భంగంబుఁ గావింప మండిపడుచు
కాలరుద్రుని చందంబు గదలి వచ్చె
రావణాత్మజుఁ డారణరంగమునకు. 19

ఉ. ధీరుఁడు లక్ష్మణుం డతని దివ్యరథంబున కన్న మిన్నయౌ
మారుతిపై వసించి రిపుమండలి భండనమందు దున్మి వృ
త్రారిశరంబు గైకొని దశాస్య సుతుండగు మేఘనాథు సం
హారము జేసె భూరి కుసుమంబులఁ జల్లగ దేవతావళుల్. 20

మ. సురరాడ్భీకర మేఘనాథుఁడు గతాసుండౌట యాలించి దు
స్తర దుఃఖాబ్ధి మునింగి రావణుఁడు విశ్వస్తారవోద్భిన్న ది
గ్భరితాత్మీయ పురంబు గన్గొనుచుఁ గోపవ్యాప్త చిత్తంబుతో
నరిగెన్ ఘోర రణాంగణంబునకు భార్యాబోధ మాలింపకన్. 21

ఉ. దానవ నాథుఁడున్ బ్రళయ దావ ధనంజయ భీషణాంగుఁడై
వానర సేనలన్ నిజ కృపాణము గైకొని చించి చెండుచున్
మానిత విష్టప త్రితయమారణ దారుణ శక్తిచేత రా
మానుజు నింద్రజిద్రిపుని నాశనిమూర్ఛల నొందఁ జేయుఁగన్. 22

గీ. అంత సంజీవనీ జీవితానుజన్ముఁ
గాంచి సంతోష మంది రాఘవుఁడు శ[illegible]
డున్నత తురంగ మాతలి యుక్త దివ్య
రథముఁ బంప నధిష్ఠించె రణమునందు. 23

సీ. వైశ్వానరమును రావణుఁడు ప్రయోగింప
వారుణాస్త్రమ్మున వమ్ముఁ జేసి
దందశూకంబును దశవదనుఁడు వైవ
గారుడాస్త్రమున ఖండంబుఁ జేసి
జైమూతమును రాక్షసవరేణ్యుఁడు వయివ
మారుతాస్త్రమున భస్మమ్ముఁ జేసి
తామిస్రమును దైత్య భూమీశుఁడు వయివ
వైకర్తనమ్మునఁ బారఁదఱిమి.

గీ. అమర కిన్నర గంధర్వ యక్షు లంబ
రమునఁ జూచుచు భీత్యాదరములఁ జెంద
దశవదనుతోడ దశరథ తనయుఁ డపుడు
రణ మొనర్చె నభూత పూర్వంబుగాఁగ. 24

[illegible]ములచేఁ బ్రకాశించెను జానకి [illegible] మాహాత్మ్య[illegible]
[illegible]ములు బుట్టుచుండ నతిసత్త్వవాక్ప్రియుచేత రావణా
సురుఁడు త్రిలోకకంటకుని శూరునిఁ జంపెను రామచంద్రుఁ డం
బరము [illegible] [illegible] సుమవృష్టిఁ జేయఁగన్. 25

రక్కసులు నిహతులంకై
[illegible] మండోదరీ ప్రముఖాంగనలు గతిఁ
[illegible] పతులను సుతులను గను
గొంచుఁ బలవించి రప్పుడు ఘోరముగాఁగన్. 26

రణ మొనరించి విశ్రుత పరాక్రముఁడౌ నిజసోదరుండు రా
వణుఁడు దివంబుఁ జేర రిపుభావము నెంతయుఁ బాసి యాత్మదూ
షణ మొనరించి దుఃఖమయ సాగరమందు మునింగి యావిభీ
షణుఁడటఁ బారలౌకికము సల్పె యథావిధి భక్తియుక్తుఁడై. 27

అపుడు విభీషణు లంకా
ధిపతిని గావించి యగ్ని దేవునిచే సీ
త పవిత్రురా లనుచుఁ దెలి
సి పరిగ్రహణంబుఁ జేసె శ్రీరాముఁడటన్. 28

కపులఁ గూడి పుష్పకవిమాన యానుఁడై
సేతు బంధనాది చిత్ర కథల
సీతతోడఁ దెల్పి చేరె భరద్వాజు
నాశ్రమంబు దశరథాత్మజుండు. 29

భరతుఁడు సైన్య యుక్తుఁడయి వత్స వియుక్త నవప్రసూత సం
తరళ గవీసమానలగు తల్లులఁ గూడి వశిష్ఠుఁడున్ మునీ
శ్వర యుతుఁడై యెదుర్కొనఁగ సర్వశుభావహతూర్యనాదముల్
బరవన యోధ్యఁ జేరె రఘువంశలలాముఁడు రాముఁడయ్యెడన్. 30

ఉ. వారిధి నీరపూరిత సువర్ణ ఘటంబులఁ గేలఁ బూని బం
గారపు పట్టికన్ నొసటఁ గట్టి వశిష్ఠ పురోగ మౌని బృం
దారకు లెల్ల గూడి ప్రమదంబున ధర్మసతీ సమేతుఁడౌ
శ్రీ రఘురామమూర్తి నభిషిక్తునిఁ జేసిరి రాజ్యలక్ష్మికిన్. 31

ఉ. ఆ నరనాథుఁడౌ దశరథాత్మజుఁడున్ స్వకుల క్రమాగతం
బైన కిరీటమున్ శిరమునందు ధరించుచు భద్ర పీఠికన్
భానునిభంగి రాజిలి సభాస్థలవాసుల గారవించె నెం
తేని మునీశులన్ వసుమతీశులఁ గీశుల సత్కవీశులన్. 32

—♦ గద్యము. ♦—

ఇది శ్రీ వాణీ కరుణా కటాక్షలబ్ధ కవితా విచిత్ర పత్రికుల
పాత్ర పురుషోత్తమ శాస్త్రిపుత్ర విశ్వేశ్వర ప్రణీతం
బైన రామాయణ సంగ్రహమం దుద్ధ
కాండము సర్వము
సంపూర్ణము.

శ్రీవాణ్యై నమః.

# రామాయణసంగ్రహము.

[ఉత్తరకాండము.]

---

శా. శ్రీరాముండు నిజస్థలంబులకు సుగ్రీవాదులన్ బంపి శృం
గారాకార గుణాఢ్యులౌ కుశలవుల్ నాన్ బుత్రులన్ గాంచి వి
స్తారాసంగమునన్ సహోదరులు పుత్రద్వంద్వమున్ గొల్వఁగా
ధారాళంబుగ నేలె రాజ్యము నయోధ్యన్ రామరాజ్యంబనన్.

వర పవిత్రగోత్ర జనితుండు
పురుషోత్తమ విబుధవర్య పుత్రుండు విశ్వే
శ్వరుండు రచించెను దీనిన్
గరుణన్ శ్రీరాఘవుండు గైకొనుగాతన్.

శ్రీ రామచంద్రార్పణ మస్తు.

# స్నేహలతా కవితాసంఘమువారిచే ప్రకటింపఁబడిన గ్రంథములు.

| | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|
| 1 | రాఘవశతకము ... | 0 | 2 | 0 |
| 2 | మాధవశతకము ... | 0 | 2 | 0 |
| 3 | ధ్రువచరిత్ర ... | 0 | 4 | 0 |
| 4 | సరస్వతీశతకము ... | 0 | 2 | 0 |
| 5 | సరస్వతీ రామాయణము ... | 1 | 0 | 0 |
| 6 | పతివ్రతాశతకము ... | 0 | 4 | 0 |
| 7 | వైజయంతివార్షికపత్రిక ... | 1 | 0 | 0 |
| 8 | భారతనీతులు (Approved.) ... | 0 | 4 | 0 |
| 9 | పోతన్నభక్తివైరాగ్యములు ... | 0 | 2 | 0 |
| 10 | లక్ష్మీనారదాగీతములు ... | 0 | 10 | 0 |
| 11 | లక్ష్మీశారదాశతకములు ... | 0 | 5 | 0 |
| 12 | లక్ష్మీశారదాసుభాషితము ... | 0 | 8 | 0 |
| 13 | వీరగాథలు ... | 0 | 5 | 0 |
| 14 | సుకన్య ... | 0 | 2 | 0 |
| 15 | బ్రహ్మపత్రోపాఖ్యానము (అను) పొగాకు చరిత్ర | 0 | 3 | 0 |

వలయువారికి కవితా సంఘము రిపోర్టు ఉచితముగ పంపఁబడును. అందు సర్వవిషయములును గోచరము లగును. పై అన్ని గ్రంథములు ఒకేసారి కొనువారికి సంఘమువారిచే రచింపఁబడిన మఱికొన్ని గ్రంథము లుచితముగ నియ్యఁబడును.

అడ్రెసు :— ప్రెసిడెంటు : స్నేహలతా కవితా సంఘము,
కొల్లాపురం, మొరవకొండ పోస్టు,
(కర్నూలుజిల్లా.)